ఓం.

# పితృలోక మహాసభ.

# The Criticism of Astrology.

ఇది

శ్రీమదాన్య నారాయణమూర్తిగారిచే

వ్రాయబడినది.

(First Edition, 1000 Copies)

బెంగుళూరు.



...913.

...upee one.

ఓమ్.

# పితృలోకమహాసభ.

# The Criticism of Astrology.

---

ఇది

శ్రీమదార్య నారాయణమూర్తిగారిచే

వ్రాయఁబడి

(*First Edition. 1000 Copies*)

---

బెంగళూరు.

"ఐరిష్" ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె.



1913.

**Price Rupee one.**

# అర్పణము.

శా|| తండ్రీ! నీతనుకారణంబునఁగదా? తనువెత్తితిన్ భూమిపై ।
తండ్రీ! నీదగుపోషణంబునఁగదా? తానిల్చె యారోగ్యమున్ ।
తండ్రీ! నీహితబోధచేతనుగదా? తత్త్వజ్ఞుఁడైతిన్ ధరన్ ।
తండ్రీ! నీదుఋణంబుఁదీర్చఁగొనకన్ ధారేయుఁడైయుండెదన్ ||

క|| మిథ్యాధ్యవసతియుక్తితో । బ్రత్యాఖ్యాతంబుఁజేసిప్రకటించితి నే
సత్యముఫలితముగాదని । యత్యుత్తమమగునుగుప్తమరయుటచేతన్

చ|| వదలక మీఋణం బిదిగొవచ్చెగదాయనిసంతసించితిన్ ।
సదమలరీతినార్యజనసమ్మతినొందినగ్రంథరాజమున్ ।
సదసులునానవంగఫలశాస్త్రవిఖండనసంగ్రహంబునన్ ।
ముదమునస్వీకరింపుగురుమూర్తిపితా! స్మరణార్థమిచ్చితిన్ ||

## పోషకులు.

శ్రీయుత. బి. కె. దేవయ్యగారు, ముఖాసి బారందూరు,
హొసూరు తాలూకా, సేలంజిల్లా.

,, ఆర్య. రామమూర్తిగారు, గోనబావి,
రాయదుర్గం తాలూకా, బళ్ళారిజిల్లా

,, కాశింసెట్టి. వెంకయ్యగారు, రొద్దంలోచర్ల,
పెనుగొండ తాలూకా, అనంతపురంజిల్లా.

# వైదికాంధ్ర గ్రంథములు.

(గ్రంథకర్తృకములు)

---

| | | |
|---|---|---|
| 1. | ఈశ్వరరహస్యసారము | రు. 1– 4–0 |
| 2. | పితృలోకమహాసభ | 1– 0–0 |
| 3. | మతమతాంతరపురోహితమహాసభ | 0–12–0 |
| 4, | భారతసూర్యోదయము | 0– 4–0 |
| 5. | హిందూవైవాహికప్రహసనము | 0– 4–0 |
| 6. | మనుష్యజీవనము | 0– 6–0 |
| 7. | స్వాత్మనిరీక్షణము | 0– 4–0 |
| 8. | ఈశ్వరసిద్ధి | 0– 4–0 |
| 9. | అగ్నిహోత్రలాభముతత్పద్ధతి | 0– 8–0 |
| 10. | మద్యమాంససేవకకుఠారము | 0– 6–0 |

ఐదు(5) రూప్యములు పంపినవారికన్నియు పోస్టేజిలేకుండ లభించును.

ఆర్య—నారాయణమూర్తి,

హిందూపురం,

అనంతపురం జిల్లా.

# అభిప్రాయములు.

క॥ శ్రీగమ్యంబుగననిచిన । భారతసూర్యోదయంబుఁ బఠియింపమనో ।
భారములెల్లను దొలఁగెను। నారాయణమూర్తి మీకు నతులొనరింతున్ ॥

గీ॥ అహహా భారతదినమణి నభినుతింప ।
నల్పమతి నాకుఁ దరమౌనె యవనిలోన ।
సత్యవిజ్ఞానవాఙ్మయ సాగరమున ।
దలఁచినాఁడను మీగ్రంథ తరణిభువిని ॥

సీ॥ అజ్ఞానమనెడు గాఢాంధకారము బాప
నుత్తమమైన సూర్యోదయంబు ॥
అమితమహామతపంకమారిపోవుటకును
భావింపనిదిదీప్త భానురశ్మి ।
పాపరూపములైన పర్వతపఙ్క్తికిభువి
పవియగు నీపుస్తకంబు ।
కలుషంబులను మహాగజసంఘములకునీ
గ్రంథంబుగొలుసుల బంధనంబు ।
ఛలకపటపక్షపాత సంచయములనెడు
వ్యాధులణచెడు దివ్యమహౌషధంబు ।
ద్రోహతిమిరహరణ చంద్రోదయంబు
అహహ భారతసూర్యోదయంబుభువిని ॥

పం॥ భద్రకవి.

తే॥గీ॥ శ్రీమనుష్యజీవనమునఁ జెలఁగు గ్రంథ-
ము భవితవ్య నారాయణమూర్తివలనఁ ।
బంపఁబడె నేఁడు సత్కాంక్ష ప్రబలనంది-
కొని తుదివఱకుఁ జదివితి మనములరగ ॥

సీ॥ సత్యవాక్పటిమయు సద్భావగరిమయు
విమలకర్మంబు సద్విద్యయుమఱి ।
ప్రాకృతనియమాను బంధవర్తనము
కర్తవ్యకార్యసంఖ్యానమహిమము ।
సద్గ్రంధపఠనంబు సత్సహవాసంబు
వీర్యరక్షణము సర్వేశనుతియు ।
దేశాభిమానంబుఁదిరమగు
ప్రీతియునాహ్లాదకరము సదాచరణము ।
దుర్గుణవిసర్జనంబును దుఃఖప్రాప్తి
కారణవిమర్శనంబాదిగాఁగల సుగుణాకరుని ।
జీవనమెజీవనమని తెలుపునా !
మనుష్యజీవనము నెంతని నుతింతు ? ॥

తే॥గీ॥ ఇనుఁడు తారలు శశియు మహేశ్వరుండు ।
నాకసంబున వెలయునందాక విబుధ ।
వరుల కెలమినిఁ బెనిచెడి మరకతమయి ।
వఱలుఁగావుత నీగ్రంధమరకతంబు ॥ (శిరిపి_ఆంజనేయులు)

నమస్తే మహాశయా !
క॥ వేదాంగమనుచుఫలమును । భేదము నెంచక నునమ్మిభ్రమఁజెందిన నే ।
మోదపయోనిధిమున్గితి । భేదమిపుడుఁదెల్లమయ్యె బట్టబైటగన్ ॥
క॥ సఖుడా! నానారీతుల । ప్రకటించితి విపుడుఫలితపద్ధతియెల్లన్ ॥
అకుటిలమగునీగ్రంధము। సకలజనులుఁగనియువినియు సంతసమొందన్॥

శా॥ అహా ! వైదికయంగమంచుమదిలో నేనమ్మియుండంగ ని ।
మ్మోహంబింతయునుండకుండగభళీ ! మీరిట్లుఖండించి దు ।

గ్రాహంబైన యసత్యజ్యోతిష విషగ్రాసంబు నాశంబుగన్ ।
నోహో ! గ్రంథమహౌషధంబని చితౌనామోదమున్ గల్గగన్ ॥

క॥ ఫలితముగణితము వేరని। తెలియక నేనుంటి దానిఁ దొలగించితివో ।
పలుమఱు నేనందులకై। తొలుత నుసలిపితిని నీకు ధన్యవాదమున్ ॥

కన్నకుక్కుడి- పరశురామాచారి.

నమస్తే ప్రియవర !

తమ గ్రంథములఁబఠించి. నా మనస్సునకుఁ దోచినదానిని లిప్యంతరమునఁ దెల్పుటకు సమర్థుఁడనుగాను. “సర్వేపిసుఖినఃసంతు సర్వే సంతునిరామయాః । సర్వేభద్రాణిపశ్యంతు మాకశ్చిద్దుఃఖమాప్నుయాత్” అను నీతిని పాటించిన మిముఁబోటివారు రచించిన గ్రంథములమోఘములుగదా ? మీ గ్రంథరాజమందలి, తేజస్వితా- హృదయాకర్షితా- సుధారతా- ఖండనమండనసరళతా- ప్రమాణపుష్టతా- సిద్ధాంత సత్యతాద్యుత్తమగుణములెంతని వర్ణింతును ? ఐహిక పారలౌకిక సుఖదాయకములగు నిట్టి గ్రంథములింకను ప్రచురించుటకు సర్వేశ్వరుఁడు మీకు సర్వసుఖము లొసంగును గాత !

సూర్యనారాయణ కవి.

సీ॥ మతమతాంతర పురోహిత మహాసభయను
గ్రంథంబుఁ జూచియానందమయ్యె ।
మానుషజీవన మను పొత్తముఁబఠించి
యసమానముగ ధీ ప్రసన్నమయ్యె ।
ఈశ్వరరాహస్య మాశ్రితులకునెల్ల
సంశయమ్ములఁబాపి శాంతమొసగె ।
భారతభావోద్భవంబుఁబాపె భయంబు
బహువిధ భేదభావంబులెల్ల ।

ప్రహసనంబువినోద సుప్రహసనంబై
యై సదాపఠనయోగ్యమై యొప్పుచుండు ।
వైదికమతాంధ్రిమూశిక [illegible]గాను
యిలశశియు తారకలున్న నాళులోనుండు[illegible] ॥

ఉ॥ అప్రియమైన సత్యమును హానిప్రియంబయినట్టి యసత్యముల్ ।
సప్రియమైన సత్యమును సూనృతమం చనుచుండ మనీషిస ।
త్యప్రకటంబుగాగ మతయాంత్రిక ప్రేరక మాటసంజ్ఞచే ।
ప్రప్రథమందొకప్డు ప్రియనాటకులం బల్కెనరీతినిమ్మహా ।
విప్రసమూహ పంచక వివాదములన్ వివరించితో బళీ ।
క్షిప్రముతోడ నొక్క ప్రతిచేరగనంపుడు మిమ్ము వేడెదన్ ॥

సహపాఠి (బాల్యమిత్రము) అప్పుతభట్టాచార్య.

Dear Sir ;

I received the "మనుష్యజీవనము and మతాంతర మహాసభ" of your "Granthamala" It is with the gratest pleasure that I read the books. I congratulate you on your work. Your arrangement of subjects is admirable..............once taken up, they carry forward the reader and it is difficult to lay them down. They will revolutionize the foolishness and............I am yours sincerely,

V. APPAYYA.

సృహత్తమా నమస్తే !

చ॥ సకలజనాభివర్ధని సుసంఘముపై యకలంకప్రీతిచే ।
సకరుణమీరునిచ్చుటికిం జక్కగవచ్చి మనుష్యజీవనం ।
బొకటినిందెల్పసభ్యవరులా నిదిసత్యమటంచుబల్కుచున్ ।

ప్రకటితహస్తతాళములు మాటికిమాటికొనర్చుచుండగా ।
సకలసభావితానమును సమ్మతిజేసిన సత్యవాణ్మయా......ఇత్యాది.

కాకుపల్లి—శివరామశర్మ.

ఇంద్రవజ్రవృత్తము.

దృష్ట్వా మహేశ్వర మహిమ్నరహస్యసారం - శ్రీ భారతాంబుజ సఖోదయనాటకాదీన్ । వైవాహికప్రహసనం రచితం యథార్థం । నారాయణార్య కవినామతిమాన్ భవామః ॥

ఆనందయంతి పఠనాత్పరితోషయంతి ఆస్ఫాలయంతి శ్రవణాదను మోహయంతి । యద్వద్దయాహ్వయ సరస్వతి సత్యవాణిం । నారాయణార్యకవితా సరణింరసజ్ఞాః ॥.........ఇత్యాది.

కెలమంగలం—గురుచరణార్యః.

శ్రీయుదార్య మహాశయా ! నమస్తే !

తాము సాధారణ స్థితిగలవారైనను అసాధారణ హృదయులై యున్నారని తమ గ్రంథరాజములవలనఁ దెలియుచున్నది. మీరత్యల్పస్థితిలోనుండియు, ననల్పసేవను దేశమునకుఁ జేయుచున్నారు. అనేకులు ధనికులయొక్కయు నధికారులయొక్కయు సహాయమునుగోరి గ్రంథమాలలను ప్రచురపరచుచుండగా తామొక్క పరమేశ్వరునియందు విశ్వాసముంచి, కర్తవ్యపాలనమును ధర్మనిష్ఠయు గలిగి మహోపకారముఁజేయుచున్నారు. మీ గ్రంథములన్ననో— తను మన ధనాభివృద్ధియు, జ్ఞానాభివృద్ధియుఁ గలుగజేసి అజ్ఞానాంధకారమునుఁ బాపుచున్నవి. అన్యంబగు నింద్రియలోలుప- విషయ విషభరిత- మిథ్యాకర్త పత్రిక- పుస్తకములఁ బఠించుటమాని, మీ వైదికాంధ్ర గ్రంథములఁ బఠించుటవలన పాఠకులు నన్నివిధముల ధన్యులగుదురని నమ్మినాడను.

*L. K. SHARMA.*

# ముఖ్యసూచన.

---

ఒక మాయబంగారపు నగలవర్తకుఁడు తనవద్దగల సద్యః ప్రకాశమగు గిల్టు యాభరణములఁజూపి, గొనియాడునుగాని, వానిని పరిక్షించుటకు స్వర్ణకారునియొద్దకు రమ్మన, గుట్టు రట్టగునని జడియుచుండును. అలాగున కొందరు స్వార్థులు మాగ్రంథములను తాము పఠించుటకుఁజడియుచుండుటగాక, పరులను చదువకుండఁజేయుచున్నారు. వీరిలక్షణములను "మతమతాంతరపురోహితమహాసభ" యను గ్రంథమున వివరించియున్నారము. అట్టివారి మాటలను పాటింపక వేదాది సత్యశాస్త్రములందు విశ్వాసము, భక్తి, శ్రద్ధలు గల నిజమైన వైదికులు మా గ్రంథములను పఠించి యదార్థమగు వైదికసిద్ధాంతముల నవలంబించి ధన్యులగుదురని ప్రార్థించుచున్నారము.

ఇట్లు సర్వజనశుభచింతకుఁడు,

ఆర్య—నారాయణమూర్తి,

హిందూపురం,

అనంతపురం జిల్లా.

ఓమ్.

# పితృలోకమహాసభ.



(సభామంటపమున వారువారు యథాస్థానములందుఁ గూరుచున్నతరువాత, రిసెప్షన్ కమిటియొక్క ప్రధానాధిపతియగు బృందావనరావనెడు జైనపితృవు ఈ ప్రకారముగ నుపన్యసించెను.)

## బృందావన జైనుల యుపన్యాసము.

సభాసదులారా! నాకుఁ దెలిసినంతమట్టునకు హిందువులును ముసల్మానులును క్రైస్తవులును ఒక్క సీసాలోఁ దించిన ద్రావకమువలె నొక్క తెగవారైయున్నారు. ఎట్లనఁగా:—బైబిల్ ఖురానులలోని సంగతులు హిందువుల పురాణములలోని సంగతులును ఈవిషయమున కాధారములై యున్నవి. లూతుభార్య నగరమునుండి వెడలిపోవుచు వెనుకకుఁదిరిగి చూచినందున కుప్పస్తంభమై పడిపోయెనని ఆదికాండము 20వ

అధ్యాయమున నున్నది. హిందువుల పురాణములలో గౌతమునిభార్య శిలయై పడిపోయినట్లు వ్రాయబడినది. అబ్రాహాముభార్య సారాయను నవి అబ్రాహామునకు జెల్లెలుకావలయును. లోతు తనయిద్దరి కుమార్తెలతోను దాను సంభోగించి సంతానమును గలిగించెను. ఇటువంటి వావివరుసలు పురాణములలోను గలవు. బ్రహ్మ తనబిడ్డను వివాహమాడియున్న వాడు. జంతుహింసజేసి అబ్రాహాము యజ్ఞముజేసెను. పొట్టేళ్ళు మేకలయజ్ఞములు హిందువులలోను గలవు. దేవుడు యాకోబుతో యుద్ధముచేసెను. హిందూ దేవతలును మానవులతో యుద్ధము చేయుచున్నారు. బైబులలోని యోసేపుచరిత్రయు, మన హిందువులలోని సారంగధరచరిత్రయు నొక్కటియే బైబులులో గొయ్యలమంత్రించిన బాములయ్యెనని యున్నది. ఇట్టి మహేంద్రజాలములు పురాణములలోను అనేకములు గలవు. బైబిలులో యోహాను అను వానిని జేప మ్రింగెనని యున్నది. అతడు మూడు దివారాత్రములు మత్స్య గర్భమందుండి అది కక్కినప్పుడు బయటికివచ్చెను. పక్షి గర్భమునందు మనుష్యుడు బయటికి వచ్చినసంగతి పురాణప్రసిద్ధము.

తురకలు మాత్రముతో జంతువుల కుత్తుకలు గోయుదురు. హిందువులు మంత్రములు చెప్పి యాగములందు జంతువులను జంపుదురు. మహమ్మదుసాహిబ్ గారికి ఆయూషాతోటి వివాహమువలెనే రాధాకృష్ణుల వివాహము గలదు మహమ్మదు దేవునియొద్దకు పోయినప్పుడు కొన్ని సంవత్సరములు చేరి యొక్కము హూర్తమయ్యెను. కృష్ణమహారాజుగారి రాసలీలా సమయమందు ఆరుమాసములు నొక్క రాత్రిగానుం డెను. హజరత్ మహమ్మదువద్దకు స్వర్గముండి దేవుని ఆజ్ఞలు అధ్యాయములుగా సర్కారువారి సమ్యల్లవలె దిగివచ్చుచుండెను. కృష్ణమహారాజు గారివద్దకు నారదాదుల మూలకముగా స్వర్గమునుండి వర్తమానములు వచ్చుచుండెను. ఇటువంటి సంగతు లెన్నియో నేను వివరింపగలను. శ్రీ ద్వారకాపుర మున ప్రాచీనకాలమందు రెండుతెగలవారుండిరి. అందొక తెగవారు ముసలాయుధుడగు బలదేవుని భక్తులుగా నుండిరి. రెండవతెగవారు కృష్ణభక్తులుగానుం డిరి. ముసలాయుధుని పూజించువారికి ముసల్మాన్యు లనియును, కృష్ణుని యారాధించువారికి కృష్ణమాన్యుల నియును పేరు ప్రసిద్ధియైయుండెను. ఈ ముసల్మాన్యు

శబ్దము వికృతినిజెందె "ముసల్‌మాన్" అయిపోయి నది కృష్ణనామ్యశబ్దము ఖండాంతరముఁజేరి చెడి "క్రిస్టియన్" అయిపోయినది. కృష్ణశబ్దము 'క్రీస్తు' అయినది. కృష్ణుడు యశస్వీగనుక యశస్వీకృష్ణశబ్దము. "జేసెస్‌క్రీస్టు" అయిపోయినది. క్రైస్తవులు దేవుఁడు దేవునికుమారుఁడు, పరిశుద్ధాత్మయనునట్లు, హిందువులు బ్రహ్మ, విష్ణు, రుద్రులను ముగ్గురిని నమ్ముచున్నారు. క్రైస్తవులలో రోమన్ క్యాతలిక్కులు విగ్రహారాధకులు. ప్రొటెస్టంటులు విగ్రహారాధకులుగారు. హిందువుల లోను విగ్రహపూజ చేయువారున్నారు. ద్వైతులు విగ్రహారాధకులు అద్వైతులు మూర్తిపూజకులు కారు. హిందూపురాణములోని కర్ణుడు కుంతీదేవికి బుట్టినట్లే క్రీయిస్తును దనతండ్రి వీర్యమునకుగాక పరిశుద్ధాత్మకుఁ కన్యాగర్భమున బుట్టెను. క్రయిస్తువు మహిమలకును ధన్వంత్రి శుక్రాచార్యుల మహిమలకు గించిత్తయినను వ్యత్యాసములేదు. హిందూ మహమ్మదు క్రైస్తవు లలో మద్యమాంసాహారములు సమానముగ నున్నవి. హిందువులప్పుడప్పుడు చేయు నేకాదశీవ్రతములు ముస ల్మానులొక్కసారిగా జేయుదురు. హిందువులకు హరిద్వా రాది తీర్థస్థానములు, మహమ్మదీయులకు మక్కామొ

దలగునవియును, జరూసలేము మొదలగునవి క్రయిస్తువు లకును గలవు. తురకలు గోరీలను పూజించుచున్నారు. హిందువులు సమాధులను పూజింతురు. వీనియన్నింటినిబట్టి నా సిద్ధాంతము స్థిరమగుచున్నది. గాన హిందువులును, ముసల్మానులును, క్రయిస్తువులును ఒక్కమార్గము లోని పోగులవలె నొక్కటెగవారుగా నున్నారు. ఇట్టి మీతో సర్వదా భిన్నభావమునుగల జైనుడగు నన్ను సభికులు నిష్పక్షపాతకముగా నభ్యర్థనాసభాపతిని జేసి గౌరవించినందులకు మీకు సౌహార్దిక ధన్యవాదములు సమర్పించుచున్నాడను.

ఇట్లు బృందావన జైనులుచెప్పి ముగించినతరువాత బ్రాహ్మసామాజకులగు కేశవచంద్ర సేనుగారు లేచి ప్రసంగము చేయుటకు సిద్ధమైరి. కరతాళములు మ్రోగెను. సభనిశ్శబ్దమయ్యెను.

---

## (2) కేశవచంద్ర సేనులుగారు.

సామాజకులారా! బృందావనులుచెప్పిన హిందూ ముసలుమాన క్రయిస్తువుల యేకత్వమును నేనను మోదించుచున్నాఁడను గాని, నిష్పక్షపాతముగ మనము

యోచించి చూచినయెడల హిందూ జైన సంప్రదాయము లేకములని స్ఫురింపక మానదు. "క్రమాన్యత్వం పరిణామాన్యత్వే హేతుః" యని పతంజలి చెప్పినట్లు వస్తువులయొక్క రూపాంతరమందుఁ బ్రతిక్షణమును బరివర్తనము సంభవించుచుండును. ఉదాహరణముగా సద్యోజాతుఁడైన నొకబాలుని ఫొటోగ్రాపు అనగా ఛాయాప్రతిమనుదీసి యుంచుకొని, మరికొంతకాలమునకు నదేమనుష్యుఁడు తరుణవయస్సునకు వచ్చినపుడు మఱియొక ప్రతిఁదీసి, మఱియు వానిదే వృద్ధాప్య దశ యందు వేఱొక ప్రతిని దీయించి చూడుఁడు వాస్తవమున మూడు ప్రతిబింబములు నొక్కనివే యయినను, మిక్కిలి యంతరమేర్పడి, యామూడును ఒక్కనివే యని చెప్పఁజాలక యుందుము. ఈప్రకారముగానే జైనమతము హిందూమతముయొక్క పరివర్తనముగానున్నది. ఇవన్నియు రూపాంతరములుగాని వేఱుకావు అయినను గుర్తించుటకు మాత్రము సుగమముగా నుండలేదు. చూడుఁడు ! జైనులయొక్క యుపాస్య దేవతలు నిరువదినలుగురు తీర్థంకరులుగా నున్నారు. వారు సిద్ధశిలయందు జేరి యీశ్వరరూపస్థులై యుందురు. హిందువులలో పూజ్యమగు నవతారములు యిరువదినాలుగు. వీరంద

రును వైకుంఠమునఁ జేరి ఈశ్వరత్వమును గాంతురు. జైనులు నలువది యెనిమిది యాకారములను పూజింతురు. హిందువులాలాగే నలువది యెనిమిదీ యాకృతులుగల మూర్తిపూజను సలుపుదురు. మరియు నీ రెండు మతములయొక్క తీర్థక్షేత్రములు నయితము మిక్కిలి యొకటినొకటిఁ బోలియున్నవి. పాలిటానా, శత్రుంజయ, ఆబూ, చితార, చంపాపుర, రాజగృహీ, తారంగాజీ, కుండలపుర, పాపాపురీ, సిద్ధక్షేత్ర, పారసనాథ, యిత్యాది జైనయాత్రాస్థానములు జూచినవారు నాయభిప్రాయము నేకీభవింతురు. భాద్రపద శుక్లపక్షమునందు జైనులు "అంతచతుర్దశి" పర్వమును జేయుచున్నారు. హిందువులదే కాలమున "అనంతచతుర్దశి" యను వ్రతమును నాచరించుచున్నారు. ఉపవాసము లుభయులకు సమానములై యున్నవి. ఇంక విగ్రహార్చన విధానము. మూర్తిదర్శనము, సమానాచారములై యున్నవి. మూర్తిపూజ ముక్తిదాయ మని యుభయులును నమ్మియున్నారు. జైనుల గ్రంథములును. హిందువుల పురాణములును బరస్పర సంబంధములుగలవియై, యేకరీతి ననుసరించియున్నవి. కన్నడ పంపరామాయణ, కుముదేందు రామాయణములలో లక్ష్మణాదులు జైను

లనియు, జినధర్మమును జక్కగా నడపినవారనియు, చెప్ప బడినది. హిందువులు వారిని దేవతలని పూజించుచు న్నారు. హిందూపురాణములలో నెట్లు పరస్పర విరుద్ధములును, అసంభవములును గలవో అటువలె జైనగ్రంథములందును గలవు. హిందువులెట్లు నానా దేవతలను నమ్ముదురో అట్లే వీరును దీర్థంకరులను సమ్యగ్జ్ఞానులనియు, బరమేశ్వరులనియు, నమ్ముచున్నారు. హిందువులలోని యద్వైతులవలె జైనులును దాము దేవతలగుచున్నామని నమ్మినారు. ఇందువలన జైనులు హిందూమత పరివర్తనమునుగాంచి, దానినుండి భిన్నులైయున్న వారుగాని అన్యథాగాదు. వీరిలోమరల శ్వేతాంబరదిగంబరాది అంతశ్శాఖలు హిందువులలోవలె బయలుదేరినవి. ఇట్లుండగా బృందావన జైనులు, తాము వేఱనియును, హిందూ ముసల్మాన క్రయిస్తవు లొక్కటియనియును, జెప్పుట యుక్తముగా నుండలేదని నాయభిప్రాయము. ముఖ్యముగా విచారించుచుం బోనుబోను, అందఱు నొక్కతెగయగు నార్యసంతతివారమని సారమేర్పడుచున్నది. ఆదిని మనమందఱ మార్యులమని తెలిసికొనిన తరువాత నీవైషమ్యములను విడనాడి సోదరులై యుండక తప్పదు. కాన మనమిప్పుడు మతభేదములను వదలుకొని ప్రకృ

తాంశముపై దృష్టినుంచవలయును. ఇది నాసమ్మతము. మఱియు నీసభకు నగ్రాసనాధిపతిగా శ్రీస్వామి వివేకానందులవారిని నేమించుటకు నేనుద్దేశించెదను.

ఇట్లు చెప్పి ముగించినతరువాత, వివేకానందులవారిని సభాపతిగా నేమించిరి. చప్పట్లు మ్రోగెను. అంతట సభాపతిలేచి తనప్రథమ ప్రసంగమును ప్రారంభించెను.

---

## (౩) వి వే కా నం దు ల వా రు.

సభ్య మహాజనులారా! నాకీదినమున సభాపతిత్వమిచ్చి గౌరవించినట్లే, నా మాటలయందును గౌరవముంచుమరని వేడుచున్నాడను. ఒకానొక గృహయజమానుఁడు, తనకుటుంబజనులు ప్రమత్తులై నిద్రించుచుండుట జూచి, వారిని హెచ్చరించియు, గద్దించియు, నిద్రనుండి లేపినయెడల, నింటివారిలోఁ గొందఱు సోమరులును వివేక శూన్యులగువారు దమయజ్ఞాన నిద్రాపరవశతచేత, యజమానుని గురించి "వీఁడు హానికారకుఁడు, మాకు బద్ధశత్రువుగా నున్నవాడు" అని భావించినను అతఁడు యథార్థముగాఁ గుటుంబవిరోధి కాఁడుగదా? మఱియు నతఁడు, వారికిఁ బరమహితైషియనియు, శుభచింతకుఁడ

నియు, వివేకులు భావింతురుగదా ? ఆలాగున నాయుప దేశమును భావింతురని నమ్మినాఁడను.

మన మీదినమున చర్చింపదలచియున్న ఫలిత జ్యోతిషమును గురించి, నాయభిప్రాయమును దమకు నివే దించుచున్నాఁడను. ప్రతిమానవుఁడును, స్వాభావిక ముగాఁ దనభావికాలఫలమును దెలియఁగోరుచుండును. కాని భగవంతుఁడట్టి భవిష్యజ్ఞానమును దెలియుటకు సాధనముల నిచ్చియుండలేదు. ఎందుకనఁగా, భవిష్య జ్ఞానము మానవుని యభివృద్ధికిని, బురుషార్థమునకును, బాధకముగా నున్నది. ఐనను దురాశఁగల మానవులు ఈవిషయమై శోధనలుచేయఁ బ్రారంభించిరి.

ఆదికాలమందలి యార్యులు, వేదాది సత్యగ్రంథ ముల యాధారమున, జ్యోతిశ్శాస్త్రమనుపేర ఖగోళము లను, వాని గతులను గురించి, ఆర్యభట్టీయాది గణితవి ద్యాగ్రంథములు వ్రాసిరి. వీని యాధారమున రోమక పౌలిస, పైతామహ సిద్ధాంతములు రచింపఁబడెను. వీని పరిశ్రమమువలన, మిశ్రదేశస్థుఁడగు టాలిమి యను పండి తుఁడు, ఖగోళవిద్యలయందు గణకుఁడయ్యెను. తరు వాత నది చీనాదేశమందును, యూరోపు ఖండమందును వ్యాపించెను.

జ్యోతిర్గణములగు సూర్య, చంద్ర అంగారకాది గ్రహములును, వాని గతులును, వాని చలనాదులవలన గలుగు గ్రహణములును, వాని గణితమునుగురించి చెప్పుటవలన ఆర్యభట్టీయాది గణితజ్యోతిష గ్రంథములకు జ్యోతిశ్శాస్త్రములను పేరు వాడఁబడియున్నది. ఈసంపూర్ణ గణితవిద్య ఆర్యులనుండి ప్రపంచమంతయు వ్యాపించినది.

ఇట్లుండగాఁ గొందఱు, ఈ గణితసంబంధమైన ఖగోళశాస్త్రములోఁ జెప్పఁబడిన గోళములగతులే, ప్రపంచమున జరుగు సుఖదుఃఖములకును మనుష్యులయొక్క ఫలాఫలములకును, గారణములై యుండవచ్చునని యనుమానించి, వరాహ మిహిరాదులు గణిత విద్యనుండి ఫలితవిద్యను గల్పింపసాగిరి. ఇది మొదట కాంభోజము, అనగా కాబూలు రాజ్యమునందుఁ బ్రకటమైనది. అప్పుడా దేశమునం దార్యులు ప్రభువులై యుండిరి. ప్రథమమున గ్రహణములనుండి ఫలముల నూహింపఁ బ్రారంభించిరి. శ్రావణ మాసమున గ్రహణము కలిగినయెడల (కాశ్మీరాన్ సపులింద చీనయవనాన్) కాశ్మీర, చీన, యవన దేశములకు హానికలుగును. ఇట్టి గ్రహణ ఫలములు సరిగాఁదూఁగక పోవుటవలన వడగండ్లవర్షమును, పటుపి

మ్మట భూకంపము, ఇంధ్రధనుస్సు ఇత్యాదులును, నాత ర్వాత గ్రహగతులు మొదలగునవియు ఫలకారణముల్లై యిప్పటి దురవస్థకు దగినది. ఈ కల్పిత శాస్త్రాధార మున మనుష్యులకు జాతకములువ్రాసి, వానిమూల మున ఫలములదెల్పుట కుద్యమించి, దానికిని జ్యోతిశ్శా స్త్రమని నామకరణమును జేసిరి. ఈమర్మమును దెలి యని యనభిజ్ఞులు, గణితజ్యోతిషమును ఫలితజ్యోతిష మును ఒక్కటేయని భ్రమింపసాగిరి. ఎవరైన ఫలిత జ్యోతిష మసత్యమని చెప్పినయెడల, గ్రహణములెట్లు సత్యము లగుచున్నవని వాదింతురు. ఇదియె దీనికి నుదాహరణము. కావున మనమీభ్రమ నివారణము కొఱకు, వేదాంగమగు సత్యజ్యోతిష విద్యను, గణిత జ్యోతిషమనియును, ఫలమును జెప్పుదానిని ఫలితజ్యోతి షమనియును వాడుచున్నారము.

అనేక ఫలశాస్త్రిజ్ఞులు, ఫలిత జ్యోతిషమునకు, మూలగ్రంథము బృహజ్జాతకమని చెప్పుచున్నారు. అయి నను వరాహమిహిరులు "పృథువిరచిత మన్యైః శాస్త్ర మేతత్సమస్తం" అని చెప్పియుండుటవలన, యిందునకు భట్టోత్పల టీకాకారులు "ఏతత్ సమస్తం—సకలశా స్త్రం, అన్యైః—యవనేశ్వరాదిభిః, పృథు—విరచితం"

అని చెప్పియుండుటవలనను, వరాహమిహిరులకంటెను, బూర్వీకులీశాస్త్రిమును దెలిసియుండిరనియును, అందు ముఖ్యముగ యవనులు నభ్యసించియుండిరనియును, దెలియుచున్నది. మఱియు గర్గసంహితమను ఫలిత జ్యోతిషగ్రంథమునందు "మ్లేచ్ఛాహియవనాస్తేషు సమ్యక్శాస్త్రమిదం స్థితమ్" అని యుండుటవలన మ్లేచ్ఛదేశస్థులగు యవనులు ఫలితజ్యోతిషమునకు ప్రాథమిక కర్తలనియును, యవనులలోనుండి హిందువులలో నిది వ్యాపించెననియు, సిద్ధమగుచున్నది. కావున దీనిని యవన జ్యోతిషమని సయితము చెప్పదగియుండును. ఈ ఫలిత గణితశాస్త్రిభేదమును తెల్పుటకై గ్రంథపట్టికను జూపుచున్నాడను.

సిద్ధాంత గ్రంథములు.

1 బ్రహ్మ, 2 సూర్య, 3 సోమ, 4 రోమక, 5 వసిష్ట, 6 పౌలస్త్య, 7 బృహస్పతి, 8 గర్గ, 9 వ్యాస, 10 పరాశర, 12 భోజ, 12 వరాహ, 13 బ్రహ్మగుప్త, 14 సిద్ధాంతశిరోమణి, 15 సుందర, 16 తత్వవివేక, 17 సార్వభౌమ, 18 లఘు ఆర్య, 19 బృహదార్య, 20 ఋగ్వేద జ్యోతిష, 21 యజుర్వేద జ్యోతిష. 22 అధర్వవేద జ్యోతిష.

## ఫలిత జ్యోతిష గ్రంథములు.

1 రత్నకోశ, 2 రత్నమాల, 3 రాజమార్తాండ, 4 వివాహ వృందావన, 5 వివాహపటల, 6 ముహూర్త తత్వ, 7 జ్యోతిషదర్పణ, 8 ముహూర్త మార్తాండ, 9 గాడానంద, 10 ముహూర్త చింతామణి, 11 ముహూర్త చూడామణి, 12 ముహూర్త కల్పద్రుమ, 13 ముహూర్తమాలా, 14 ముహూర్త దీపిక, 15 ముహూర్త గణపతి, 16 ముహూర్త సింధు, 17 విద్వజ్జనవల్లభ, 18 అద్భుతసాగర, 19 వ్యవహార ప్రదీప, 20 జ్యోతిర్విదాభరణ, 21 జ్యోతిర్నిబంధ, 22 గార్గిజాతక, 23 కాలచక్ర జాతక, 24 పారాశరీ, 25 జైమినిసూత్ర, 26 భృగుసంహిత, 27 బృహత్పారాశర, 28 లఘుపారాశర, 29 కేశవమత, 30 ప్రశ్ననారదీయ, 31 ప్రశ్నపద్ధతి, 32 పాశకావలి, 33 రమలపాశకవిద్య, 34 రమల చింతామణీ, 35 రమలామృత, 36 హోమునరత్న, 37 తాజకభూషణ, 38 దేవాలంకృతి, 39 తాజకతంత్రసార, 40 తాజకపద్ధతి 41 తాజక సార, 42 తాజకాలంకార, 43 తాజకనీలకంఠ, 44 తాజక కౌస్తుభ, ఇత్యాదులు.

ఈ పట్టికనుబట్టి జ్యోతిషమును, గణిత జ్యోతిషమును, వేఱువేఱని సభికులకు వేద్యమగును. కాన నీ

యసనాతనమగు యవన జ్యోతిషముయొక్క సత్యాసత్యమును గురించి నిర్ణయము చేయుచురుగాంత !

అప్పుడు ఆదిభాస్కరులనువారు లేచి యుపన్యసింపఁ దొడఁగిరి

---

(4) ఆ ది భా స్క రు ల వా రు .

సభ్యులారా ! సభాపతిగారి ప్రారంభోపన్యాసమును నేనును నామోదించుచున్నాఁడను. ఈ నవీన ఫలితజ్యోతిషము మనలోనెట్లు వ్యాపించెనని కొందఱు పరిశ్న చేయవచ్చును. ఇప్పుడు ప్రత్యక్షముగ మహమ్మదీయులాచరించు హాసేన్ హుసేన్ యుత్సవముల యందు మసీదులకుఁబోయి, మేవా సమర్పణముచేసి, మొ్రిక్కి ప్రసాదమును స్వీకరింపని హిందువు లెవరుగలరు ? ఇదెట్లు మనలో వ్యాపించెనో అట్లే ఫలశాస్త్రపద్ధతియు వ్యాపించినది. పురాతన ప్రసిద్ధులగు భారతీయులలో స్వయంవరముతప్ప, వివాహములను గుండలులులనుబట్టి చేయుచుండినట్లు కనఁబడదు, పూర్వము వివాహములందు యోగ్యత, సామర్థ్యత, విద్యాది పరీక్షలు జరుగుచుండెను. సీతా రాములయు, సుభద్రా

ర్జునలయు, శకుంతల దుష్యంతాదులయు, వివాహములె న్నియో దీనికి నుదాహరణములు గలవు. కాని,జాతక పత్రముల ననుసరించి జరిగిన వివాహములు ఆక్షేపణీయ మున బొత్తిగా లేవు. ఇప్పటి భూలోకనివాసులకన్ననో మహామారీ రోగభయముకంటెను ముహూర్తభయ మెక్కువయై యున్నది. "అవశ్యమనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభం" అను సిద్ధాంతమును ఈఫలిత జ్యోతి షము పాడుచేయ నమకట్టినది. మూర్ఖులు తమ యా యువును వృద్ధి చేసికొనుటకై దైవజ్ఞుని బ్రార్థింతురు. మహాజ్యోతిష్కులు మూడుమూకలకు మేరు పర్వతమును మ్రింగివేయుదురు. ఈశ్వరీయ నియమమును దలక్రిం దులు చేయుదుమని నమ్ముదురు. ఎవరు కుండలివిచార మును జేయక వివాహము జేయుదురో వారు నాస్తికుల నబడుదురు. సుముహూర్త వివాహములుచేయు యా స్తికులు సయితము దుష్ఫలములనే అనుభవించుచు, దుఃఖములపాలై యున్నవారు. హిందూ జ్యోతిష్కులు చంద్రగ్రహమును బుధునిగాను, యవన జ్యోతిష్కులు స్త్రీనిగా నమ్మినారు. హిందువులు శుక్రగ్రహమును దేవ శత్రువని భావించియుండగా, యవనులు శుభగ్రహమని చెప్పుచున్నారు. యవనులు హిందువులకు వ్యతిరేక

ముగా బుధ శనైశ్చరులు నపుంసక గ్రహములని నమ్మి యున్నారు.

మానవులకు వారివారి కర్మానుసారముగఁగలుగు సుఖదుఃఖముల నేకవిధములై, యనంతములై యున్నం దున ఫలిత జ్యోతిషముకూడను లగ్నఫలము, రాశిఫ లము, గ్రహఫలము, గ్రహశత్రుమిత్ర ఫలము, ఉచ్చనీచ ఫలము, స్వక్షేత్రఫలము, దృష్టిఫలము, ఆహార విహార ఫలము, వారఫలము, మాసఫలము, సంవత్సరఫలము, నక్షత్రఫలము, తిథిఫలము, పాప పుణ్య గ్రహఫలము, స్త్రీపున్నపుంసక గ్రహఫలము, యిత్యాది పలువిధము లగు ఫలములను గ్రోడీకరించి, అద్దగోడమీఁది దీపము వలె సుఖదుఃఖముల రెంటికి సరిపోవునట్లు కల్పింపబడి నది. మంచిచెడ్డల కన్నింటికి ముహూర్తములున్నవి. స్థలము వెదుకుటకును, ఇల్లు కట్టుకొనుటకును, బావి త్రవ్వుటకును, బిడ్డ పుట్టినను, పేరు పెట్టినను, పెండ్లి జేయుటకును, బయుండుటకును, గుడ్డలు ధరించుటకును, ప్రయాణము జేయుటకును, ఇంట ప్రవేశించుటకును, క్షౌరము చేయించుకొనుటకును, మందుఁ ద్రాగుటకును, దొంగలించుటకును, వ్యభిచరించుటకును, జూదమాడుటకును, మోసపరచుటకును ముహూర్తములున్నవి. ఇఁకఁగొంత

కాలమునకు మలమూత్ర విసర్జనములకును ముహూర్తము గావలసి వచ్చునని తోచుచున్నది. ఈ ముహూర్త వైభవమును మనవారు స్వీకరించియుండియు, దీనిని కాళ్లతోఁద్రొక్కి, విసర్జించియుండు యితర విదేశీయుల వలె సుఖింపఁజాలకున్నారు. ఇదెంతటి దౌర్భాగ్యము?

నేను భూలోకమున నున్నప్పుడు, నాకుమారుని జ్యోతిషము నేర్చుకొనుటకై పంపితిని. వాఁడును శాస్త్రవేత్తయై వచ్చెను. వాని పాండిత్యపరీక్షకొఱకు, నాపిడికిట నొక వస్తువును బట్టుకొని నాచేత నేమున్నదని యడిగితిని. వాడు తెలుపును బసుపునుగలసిన పదార్థమదియని చెప్పెను. నేనందునకు సిద్ధాంతార్థపు మాటలనువిడచి పరిష్కరింపుమని యడిగితిని. అట్లు విశదపరచుటకు శాస్త్రములో నాధారములేదనెను. పిమ్మట నామిత్రులగు కొందరి యూరోపియనుల జాతకములను గనఁబరచి, వీరిదేహముల రంగులెట్టివని యడిగితిని. వాడు గణితమునువేసి చూచి, శరీరస్థానమందు కేతువుండుటచేతఁ గొందఱు నల్లనివారని చెప్పెను. నేనప్పుడు యూరోపియనులలో నల్లనివారు లేరుగదా? వారందరికిఁదను స్థానమందొక్కటే గ్రహముండదా? యని యడిగితిని. సీమలోనివారలవిషయ మీశాస్త్రములో

వ్రాయవలసినది నిలువయున్నదనెను. తరువాత విధ వలు సధవలు కలసిన యేఁబది స్త్రీజాతకములు వానిచే తికిచ్చి, ఇందుఁగల సధవల యొక్కయు విధవల యొక్కయు, విధవలలోఁ బునర్వివాహమాడిన స్త్రీలయొక్క పత్రములు ప్రత్యేకముచేయుమంటిని. మూఁవాఁడు స్తబ్ధుఁడయ్యెను. ఇందులో సంపూర్ణ పరాభవమొందినదే గాక, పునర్భువులనుగురించి శాస్త్రములో నేమియులేదనెను. అటుమిమ్మట నిన్నటిదినమున నేనెన్ని జాబులు వ్రాసి పోష్టులో వేసితినో చెప్పుమంటిని. శాస్త్రములో దీనికాధారము లేదనెను. మరలఁ జనిపోయినట్టి నా స్నేహితుని జాతకమును జూపి, వాని యాయువెంత యని యడిగితిని. బ్రతికియున్నట్లు అతని యాయువును జెప్పెను. అతఁడు చనిపోయినాఁడంటిని. వాఁడు మరల గ్రంథములను వెదకి, కుండలిని బరీక్షించి, వాని కాసంవత్సరమున గొప్ప గండముగలదు గాన వాని మృతికి దిగే కారణమనెను. అందుచుకు నేను ఒక్కజాతకమే అల్పాయువునకును దీర్ఘాయువునకును ఆధారముగా నున్నప్పుడు, యీపాడు శాస్త్రమునెట్లు నమ్మవలయునంటిని. వాఁడందునకు నొక్కజాతకమును బట్టియే దరిద్రుఁడని గాని, ధనికుఁడనిగాని, దీర్ఘాయువు గలవాఁడని, మరియు

నల్పాయుష్కుడని సయితము చెప్పుటకు నీశాస్త్రిమూ ధారముగా నున్నదనెను. మరియు సమస్త విషయము లును గోలీలవలె నెటులదొర్లించిన నట్లు దొర్లుచుండు ననియు, నుదాహరణము లెన్నిటినోజెప్పి జూపెను. అంతియకాదు మావాఁడొక్క జాతకమును వ్రాసి, ప్రపంచములో సంచరికిని దానియాధారమున సరిపోవునట్లు ఫలములు వివరించి చెప్పఁగలనని ప్రతిజ్ఞచేసి, దాని చమత్కారమంతయు వివరించెను. మావాఁడు యాడంబర జ్యోతిష్కుఁడై, లోకులకు గ్రహములయొక్క జడుపును కల్పించి, ఆమూలమున జపహోమ దానాదులు స్వీకరించి, మాగృహమును పదార్థములతో నిండించెను. చెడ్డలకు ముహూర్తములు చెప్పెడు నీ చమత్కార శాస్త్రమును సత్యశాస్త్రిమని భ్రమించిన మన వారిబుద్ధికి నేను వింతపడుచుంటిని. ఆహా! మనభారతేయులు వంచనలను మోసములను గనిపెట్ట జాలని బుద్ధిహీనులై, మిక్కిలి శోచనీయమైన దశలో నుండుటకుఁ జింతింపవలసి యున్నది. చీనారాజ్యమందు ఫలశాస్త్రిము ప్రవేశించెనుగాని, దానియనర్థమును ప్రభుత్వము వారు తెలిసికొని, యేజ్యోతిష్కుని వచనము మిథ్యయగునో, వానిని దక్షిణమే యురితీయుట కనుజ్ఞ నిచ్చిరి.

భయంకరమైన యాశాసనమునకు వెరచి, యీపిశాచము హిందూదేశమును బట్టుకొన్నది. ఓ హిందూదేశమా! నీవు మీనమేషములనడుమఁ జిక్కితివి. నీకింక దిక్కెక్కడిది? నీకు దిశాశూల సంప్రాప్తమై యున్నది. మహాశయులారా! త్వరితముగ నీదుష్ట శాస్త్రమును నష్టపఱచి, మన సంతానమునకు మేలు చేకూరునట్లు చేయుటకై ప్రార్థించుచున్నాఁడను. నేఁగూర్చుండెదను.

అనంతరము అమృత భట్టాచార్యు లుపన్యసింప నిలువంబడిరి.

---

## (౫) అమృత భట్టాచార్యులు.

సభాసీనులారా! మనవారు ఫలముల వైఖరిని గమనించుటలేదు. దాని చమత్కారమును జూడుఁడు!

భానువారమున జన్మించినవాడు పిత్తశరీరి, సుందరవిగ్రహుఁడు, గంభీరుఁడు, చాకచక్యము గలవాడు; వానికరువది వత్సరములాయువు

సోమవారము:— విద్యావంతుడు, చతురుఁడు,

భోగపురుషుఁడు, ఉత్తమ స్వభావుఁడు, ఘ్రువదినాలుగు సంవత్సరములాయువు.

మంగళవారము:—ధనికుఁడు, కఠోరహృదయుఁడు, మూర్ఖుఁడు, నాస్తికుఁడు, డెబ్బది వర్షములాయువు.

బుధవారము:—ధర్మాత్ముఁడు, ఆలసి, దర్శనీయుఁడు, నూరు సంవత్సరములాయువు.

గురువారము:—పండితుఁడు, ధర్మాత్ముఁడు, పరివారము గలవాఁడు, తొంబదివత్సరములాయువు.

శుక్రవారము:— విద్యావంతుఁడు, ధర్మాత్ముఁడు, ధనవంతుఁడు, వాత వికారముగలవాఁడు, అరువది సత్సరములాయువు.

శనివారము:—స్వార్థి, రాగద్వేషి, జాతిపతితుఁడు, నూటనాలుగు నంవత్సరములాయువు.

ఈ వారఫలములలో నేమేమి తలక్రిందులగునో! అవి సంవత్సరముల ఫలములోను, ఈ రెంటిలో వ్యతిరేకించిన ఫలములు తిథులయొక్క ఫలములలోను, వీనిలో కొంఱపడినవి పక్షఫలములలోను, వీటిలో వికటించిన వానికి బదులుగా గ్రహఫలములలోను జేర్పఁబడియుండును. అనఁగా నొకచోటఁ దప్పిపోయిన ఫలము మరియొక్కచోటఁ జూపఁబడును. ఈ వ్యత్యాసములకు

గ్రహశత్రు మిత్రత్వాది భంగము లనేకములు చూపఁ బడియుండును. ఏఫలము కలిగినను దప్పిపోయినను జ్యోతిష్యముమాత్రము నిజమగుచుండును. సోమవారమునఁ బుట్టినవాఁడు విద్యావంతుఁడు గాక పోయినప్పుడు, వాని మాసఫలమో అథవా మఱేదియైన నొక ఫలము కారణముగాఁ జూపవచ్చును. ఉదాహరణముగా నొక చంద్రగ్రహమును జూడుఁడు. ఏకస్థానమున ధనవంతుఁడగును; ఎనిమిదవ స్థానమున నిర్ధనుఁడగును. పదియవ స్థానమున బలవంతుఁడగును; పండ్రెండవ స్థానమున రోగియగును. ఆరవ స్థానమున నల్పాయువగును. పదునొకండవ స్థానమున దీర్ఘాయువగును. ఈలాగునఁ బరీక్షించి చూడగా దానిచమత్కారమంతయుఁ దెల్లమై తెల్లవారును.

జ్యేష్ఠానక్షత్రమున స్త్రీ శిశువు పుట్టినచో బావ చచ్చును; మూలానక్షత్రమున మామ చచ్చును; ఆశ్లేషయందత్త గతించును; విశాఖయందు మఱఁది మరణించును; రేవతీ ప్రథమ చరణమున బావయు, మూడవ చరణమున నత్తయు, నాల్గవ చరణమున మఱఁదియు, జనిపోవుదురు. ఆహా! చూడుఁడెంత భయంకరము; వధువులను సర్పములుగ మార్చిన నీ శాస్త్రి

ము[illegible]క్క యనర్థమును, విపత్తులను, ఎంతనివర్ణింతును? ఈ దోషములన్నియు, దైవజ్ఞునకు ముడుపుఁ జెల్లించి నచో, నతఁడు మాయముచేయును. క్రూరగ్రహము లను శాంతపరచి గ్రహచారమును బారఁదోలును. ఆయువు నధికపరచును. ఒకరి జాతక బలమును మరి యొకరిపై నావేశింపఁ జేయును. విధియంతయు జ్యోతి ష్కుని స్వాధీనములో నున్నది. వధూవరులను మృగ ములుగా మార్చునట్టి శక్తియు, మాతా పితరులను బొమ్మలుగాఁ జేయు మంత్రబలమును వారియందున్నది. నామిత్రుఁడొకనాఁడు నన్ను "ఈదినము క్రొత్తము చ్చెలు దొడుగుకొనవచ్చునా" యని యడిగెను. "ముం డ్లచెట్లలో ముహూర్తమును వెదకు" మని చెప్పితిని.

ఒక ఫలజ్ఞాని, ఫలమును ముందుగా వ్రాసిపె ట్టుచుఁ దన ప్రభావమునుజూపి ద్రవ్యమును జేర్చుట కారంభించెను. నేనువెళ్ళి "స్వామీ! నేనీ తుపా కిలో నొకటిని గురిపెట్టి కాల్చుచున్నాడను; గురితప్పు నా? తగులునా? తప్పునెడల నేదిక్కున నెంతదూర మున దెబ్బతగులును? వ్రాయుడంటిని. శాస్త్రవిధు లలో నిట్టి ప్రశ్నలేదని చెప్పిఁ తప్పించుకొనెను. నా మిత్రునిభార్య ప్రసవవేదనఁ బడుచుండగా, నీజన్మిపం

బోవు శిశు వాఁడదియా, మగవాఁడా ? వ్రాసి [illegible]య్యవలెనని యడిగితిని. అందునకతఁడొక కాకితముపై 'పుత్రనపుత్రీ' యని వ్రాసియిచ్చి, కవరులో [illegible] ప్రసవించిన తరువాతఁ జూచుకొనుఁడని చెప్పెను. ఇందలి చమత్కారమును జూడుఁడు. (న) వర్ణమును పుత్రశబ్దమునకుఁ జేర్చితిమేని ఆఁడుదియగుచున్నది. పుత్రీశబ్దమునకుఁ జేర్చితిమేని మగవాఁడగును. ఇడువంటి జాతకపత్రముల వైఖరిని గనిపెట్టఁజాలని మూర్ఖులు పెక్కుకష్టముల పాలగుచున్నారు. మనోసంబంధమైన మిథ్యావిశ్వాస మెంతయో దురంతముల కాస్పదమగుచున్నది. మూఢ విశ్వాసము గుండుదెబ్బలకంటెను బలీయమైయుండును. ఈ జాతకపత్రముల నమ్ముకొని మనవారు దేహారోగ్యగుణ కర్మస్వభావ లక్షణములను విచారించక, వివాహములుచేసి పలుకష్టముల పాలగుచున్నవారు తుదకంతయు "గాలిలో దీపమునుంచి దేవుఁడా నీసత్య" మన్నట్లు విధియని తలంచుచున్నారు. మొదట గృహప్రవేశమునకు సుముహూర్తము బెట్టి, సమారాధన సంతర్పణ దానాదులలో ద్రవ్యధ్వంసమును జేయించు సిద్ధాంతియే, యింటిలో నెవ్వరైన జచ్చినప్పుడు దుర్ముహూర్తమును వెదకి, కొన్ని మాసములవఱకు నాయింటిని వద

లించి, బాధపరచి, యింటివారిని బరులపంచఁ బడియుం డునట్లు చేయును. ఈవిపత్తుల కన్నింటికిని గృహప్రవే శమునాఁటి సుముహూర్తము కారణమా? అథవా కర్మఫలమా? కర్మఫలము తప్పదన్నప్పుడు ఈముహూ ర్తములతోఁ బ్రయోజనమేమని మనవారూహించు చున్నవారా?

పూర్వజన్మాదుల ఫలములను మిక్కిలి యెక్కు వగాఁ దెల్పెడు భృగుసంహిత యనెడు ఫలశాస్త్రి మును జూచి యున్నవారుగదా? ఆ గ్రంథకర్త నిజ ముగా భృగు ఋషి కానేరఁడు. ఋషులింతటి కపటు లని, ధూర్తులని, యెవరు చెప్పఁగలరు? ఆ గ్రంథము నుగురించి నామిత్రులొక రుపన్యసింప నున్నారుగాన నేనేమియుఁ జెప్ప నవకాశములేదు. ఆ గ్రంథములోని ఫలమును విన్నను, వ్రాసియిచ్చినను, దానమర్పింపవల యును. భూలోక వాసులయొక్క భ్రమ నివారణకై మనము తప్పక తగిన ప్రబంధమును జేయువలయును. పెక్కుమంది యుపన్యాసకులుండుటచేత నేనింతటితో విరమించుచున్నాఁడను.

అప్పుడు విజయ దేవుఁడుగా రుపన్యసింపసాగిరి.

## (6) విజయదేవుఁడుగారు.



పితృమహాశయులారా! కొన్ని గవ్వలను దీసికొని "మొగశిశువైనచో బేసి సంఖ్యగాను, ఆడశిశువైనచో సరి సంఖ్యగాఁ పడుగాఁక" అని తలంచుకొని కొందరి గర్భిణిస్త్రీల విషయమై దొర్లించినాఁడను. ఒకప్పుడాలాగుననే ఘటించినది; మరియొకప్పుడు తప్పిపోయినది. కాని, జనులు నావద్దకుఁ బ్రశ్నల నడుగుటకై వచ్చుచునేయుండిరి. కనుక లోకులు స్వాభావికముగాఁ గల్లలను గణింపరు. కాని నిజములనుమాత్రము లెక్కపెట్టుదురని నేను నమ్ముచున్నాఁడను. ఈ ఫలశాస్త్రములలో జనులకు సాధారణముగాఁ గలుగు సుఖదుఃఖాదులు చెప్పఁబడియుండును. ఏ జాతకములోఁ గాని పిడుగుపడి చచ్చుటయు, కలెక్టరుపని లభించుటయు, బ్యారిష్టరీ మొదలగు పరీక్షలలోఁ గడదేరుటయు, అమెరికా యూరోపాది దేశయాత్రలఁ జేయుటయు, స్త్రీలలో రెండవ వివాహమాడుటయు, అమడబిడ్డలఁ బ్రసవించుటయు, జూచియున్నారా? ఐరోపా స్త్రీలకు బదునారేండ్ల లోపల సంతాన మగునని కుండలినిబట్టి ఫలశాస్త్రప్రకారము చెప్పినచో నది యెట్లు సిద్ధించును?

కాన నీశాస్త్రమున నింకను గల్పింపవలసి యున్నది. సంపూర్ణ మెప్పటికినిగాఁ జాలదు.

లాభము గలుగుట, నష్టము సంభవించుట, రోగియగుట, ఆరోగ్యవంతుఁడగుట, వ్యసనము ప్రాప్తించుట, మనస్సు ప్రసన్నమగుట, మాతాపిత్రాది వృద్ధజనులు చచ్చుట, పుత్రులగనుట, స్త్రీవియోగమగుట, ప్రయాణముచేయుట, వివాహములగుట,జలాగ్న్యాది గండములు సంభవించుట, వాహనములెక్కుట, మొదలగునవి సామాన్యముగా అందరికిని గలుగుచుండును. లాభము గలిగెనా గ్రహబలము; నష్టముగల్గెనా తద్దోషము; గ్రహమిత్ర శత్రుత్వాది భంగము. రోగియగుట సంభవించెనా గ్రహగతి; చచ్చెనా గొప్పగండము; ఆరోగ్యముగానుండెనా మిత్ర గ్రహబలము; అందుపై తిథి వార మాస సంవత్సర సంయోగ వియోగ దృష్టిస్థానాదులెన్నియో కారణములుగాఁ జూపఁబడును. జ్యోతిష్కుఁడెవరికైనఁ జిక్కుననుకొనెదరా? ఈ చమత్కారమును గనిపెట్టి పూర్వ మంగీరసుఁడు భాస్కరాచార్యాది ప్రభృతులు ఫలిత జ్యోతిషమును ఖండించి యున్నారు.

ఫలశాస్త్రజ్ఞుఁడు మనకు వైశాఖ మాసమున

ఆకు లాభము గలుగునని చెప్పెను. అప్పుడు మనధ్యానమంతయు లాభముమీఁదనే స్మారిచేయుచుండును. మనుష్యునకుఁ బ్రతిదినము లాభమున్నది. లేకున్న దినప్రతి నేమి తినఁగలఁడు? వందరూపాయిలు నష్టమైనను, అది వాని లోపముగా భావింపఁబడును. రెండు రూపాయిలు లాభముగలిగెనా అది గ్రహబలమగును. చాలును జ్యోతిషము సిద్ధమయ్యెను.

నాతో నొక ఫలశాస్త్రిజ్ఞుఁడు "నీవు పుట్టినదినము మీతండ్రికిఁ జెప్పియుంటి" వనెను. వెనుకటి కథలక్కరలేదు; నాభార్య గర్భవతిగా నున్నది; యెప్పుడు ప్రసవించునో చెప్పుడంటిని. గుర్తువేసి తెచ్చుచున్నానని వెళ్ళినవాఁడు మరల దర్శన మీయలేదు.

ఒకప్పుడేక కాలమున నిద్దరు శిశువులు మూలా నక్షత్రమున జన్మించిరి. అందొక శిశువు తండ్రి ఫలశాస్త్రి విశ్వాసముచేతఁ జావునకు దిగులుపడి, యాశిశువునుజూడక పరగ్రామమునకుఁబంపి పోషించునట్లు చేసెను. అచ్చట సమయమునకు సరిగాఁ బాలుదొరకక ఆ శిశువు చనిపోయెను. మరియొక శిశువు సురక్షితమై బ్రతికెను.

నా స్నేహితుఁడగు నొక వైశ్యుఁడు "నాకుమ

రణకరమగు నొక మందునిచ్చెదవా?" యని యడిగెను. నేనెందుకని యడుగగా నతఁడు "నా మారుతల్లిని జంప వలసియున్నది. కారణ మేమన్నను, ఆమెది సింహ యోని; నాది మృగయోని; యిందుచే నేను దినదినము క్షీణించుచున్నాఁడను; తప్పక చత్తును" అని చెప్పెను. ఈ ఘోరపాతకమెట్లు చేయ సాహసించితివని నేనడుగ, "నాలుగురూప్యములు జ్యోతిష్కునికిచ్చి యాపాపమును నివారణచేసికొందును" అని చెప్పెను.

సోదరులారా! యిటువంటి విపత్తులఁ దలచుకొన్న నాశరీరము పులకరించుచున్నది. హా! జ్యోతిష పిశాచమా! నీవు మానవజాతికిఁగల దయను బాడుచేసితివిగదా? నీవెన్నఁడు హిందూదేశమును వదలిపోయెదవు? పురుషార్థమును ధ్వంసము చేసితివి! స్వాతంత్ర్యమును నిరసింపఁజేసితివి! స్వయంవర వివాహములను స్వర్గమున కంపితివి! వంశముల నశింపఁజేసితివి! బుద్ధిబలముల క్షీణింపఁ జేసితివి! అతిబాల్య వృద్ధవివాహముల నెలకొల్పితివి! మూర్ఖమున్నతిఁ బరచితివి! కన్యలమెడకురివేసి హత్యఁజేసితివి! యేమి భయంకరము! యెటువంటి ఘోరాంధకారము? ఓ ఫలిత జ్యోతిషప్రేతమా! నీకు దాహసంస్కారము జేయువారులేరా? యెవరుం

దురు ? అందరు నీపాదు కలంక పంకమునజిక్కుకొని, తమ యజ్ఞానముం దెలియఁజాలని దివ్యజ్ఞానులై పడియున్నవారు. మనమొక కాగితముపై నేమైననువ్రాసి, దానిని జెరిపివేయుటకై యెంత తుడిచి కడిగినను దాని మలినము పోయి శుభ్రముగానట్లు, ఈ ఫలితజ్యోతిష ఘోషాంజనము మన మనోనేత్రమునకుఁ గడుదట్టముగఁ బూయఁబడి యుండుటచేత, నది మొదలంటనాశనము గాఁజాలకయున్నది. దీని యపజయపతాక మిన్నిరంగులతో నున్నను, కుక్షింభరులగు అస్ట్రాలెజర్సు బయలుదేరుచు నున్నవారు. ఎట్టి యవసరమున కట్టి శ్లోకములు గలిగి బుద్ధిలేని మొద్దులను భ్రమింపఁజేయుచున్నది. ఈ యవనజ్యోతిషము ఈ జ్యోతిషాలయమును ఆర్యులర్ధ భాగమును పడఁద్రోచిరిగాని, అనార్యు లడ్డమువచ్చి పోటు స్తంభముల నాటుచున్నవారు. వీరి భ్రమనివారణమునకై మనము వేగముగఁ బ్రయత్నములు సలుపవలెను. నేనాసనమును స్వీకరించెదనని కూర్చునిరి.

అప్పుడు రామమోహనరాయు లుపన్యాస పీఠమలంకరించెను.

---

## (7) రా మ మో హ ను డు.

ప్రియభ్రాతలారా! ఒకతూరి ఒక యవనజ్యోతిష్కుడు నావద్దకువచ్చి ఫలశాస్త్రము నిజమని రుజువుచేయగలనని చెప్పెను. నేనందుకు మొట్టమొదట మీయింట నెందరు విధవులున్నారనియును, వారికి ముహూర్తము జాతకమును ఏర్పరచినవారెవరనియును, ఈజాతక ముహూర్తముల లక్ష్యముచేయని నీపొరుగింటి ఆర్యధర్మోపదేశకుని కుటుంబములో నెందరు విధవులున్నారనియును అడిగితిని లజ్జపడి మూర్ఖసిద్ధాంతి వెడలిపోయెను.

నామిత్రుడగు నొక యాంగ్లేయునకు బిడ్డపుట్టెను. జన్మకుండలిని వేయించి జాతకమును వ్రాయుటకై దైవజ్ఞునకిచ్చితిమి. "అతడు ఈ చిన్నదానికి 9 సంవత్సరములలో వివాహమగుననియు, 16—17 సంవత్సరములలో సంతానము కలుగుననియు, 24వ సంవత్సరమున సవతి వచ్చుననియు ఇత్యాదులు వ్రాసిపెట్టెను" అప్పుడు నేను "స్వామీ! యిది యింగ్లీషువారిబిడ్డ కుండలి" వారికి 10 సంవత్సరములలోపల వివాహమగుటయు సవతివచ్చుటయు నెట్లు సంభవించెనని యడిగితిని. గుణగ్రాహియగు నతడు గ్రంథములన్నింటిగాల్చి, దానియందలి విశ్వాసమును వదలుకొనెను.

సహజస్థానమనగా మూడవయిల్లు సోదరసోదరీల సంఖ్యను దెలియజేయును. మేము నలుగురు అన్నదమ్ములమును, నలుగురు అక్కచెల్లెండ్రును గలవారము. మా యెనిమిది జాతకములలోను మూడవస్థానమందుగల గ్రహ మొక్కటిగా నుండవలయును. ఎందుకనగా బ్రతివానికిని సమానసంఖ్యగల సోదరసోదరీలు గలరు. ఇట్లుండగా మాజాతకములలో గ్రహములు భిన్నించినందున నంతయు తలక్రిందులయినది.

" శనిక్షేత్రేయదాభానుః భానుక్షేత్రేయదాశనిః సద్యస్సోపభవేన్మృత్యుః శంకరోయదిరక్షతి " శనిక్షేత్రమగు—మకరకుంభరాశులలో సూర్యుడు రెండునెలలుండును ; సూర్యక్షేత్రమగు— సింహరాశియందు శని రెండున్నర సంవత్సరములుండును ; ఈ కాలములో శనిక్షేత్రమందు సూర్యుడును, సూర్యక్షేత్రమందు శనియును మాఘఫాల్గుణ మాసములందుండుట తటస్థమగును. కనుక నా రెండుమాసములలో బ్రపంచమున బుట్టిన శిశువులందరును తప్పక చనిపోవలయును దీనికీశ్వరుడడ్డము రాజాలడు. ఈ గ్రహాష్టకమునకు గొప్ప యబద్ధమే ప్రమాణము.

శని ఉచ్ఛస్థానమందుండిన ధనవంతుడగును. శని

రెండున్నర సంవత్సరములు తులారాశియందుచ్చలో నుం డును. ఈ రెండున్నర సంవత్సరములలో బుట్టినవారం దరు మహాధనికులయి యుండవలయును. ఈ యనర్థా ధ్యాయమును బరీక్షించి చూడుడు. ప్రథమస్థానము శరీరవర్ణమును చెప్పును. ఆఫ్రికాఖండ నివాసులంద రికి నాస్థానమందు శుక్రశనులుతప్ప మరేగ్రహముండగూ డదుగదా ? ఇది సిద్ధమా ? హిందూదేశమున మిశ్రవ ర్ణ-మైనందున నీశాస్త్రము సృష్టింపఁబడినది. ఇది నవీ నమనియును, సనాతనముగాదనియును స్థిరపడుచున్నది.

" పంచాశీతిర్భవేదాయుర్వైశాఖస్యాద్యపక్షకే।
సార్వేష్టమ్యాం భృగోర్వారేనిధనం పూర్వయామకే "

(జా. భ) గణితజ్యోతిష సూర్యసిద్ధాంతప్రకారము వైశా ఖకృష్ణాష్టమికి అభిజిత్ అథవా శ్రవణనక్షత్రము రావల యునుగాని ఆశ్లేషానక్షత్ర మెప్పటికిని రానేరదు. కనుక తులారాశిలో జన్మించినవా డెప్పటికిని జావనేకూడదు. 85 సంవత్సరములు జీవించి వైశాఖ కృష్ణాష్టమి గురువా రము ఆశ్లేషానక్షత్ర పూర్వప్రహారమునఁ జచ్చుననుటెం తటి యవిద్యాంధకారమో చూడుఁడు.

" భాద్రమాసేసితేపక్షే చతుర్థ్యాంశనివాసరే।
భరణీ నామనక్షత్రేగ్రణంతి మరణంన్నృణాం " కుంభరా

శిలోఁ బుట్టినవాఁడు, భాద్రపదశు 4 శనివారము భరణి నక్షత్రమునఁ జచ్చెను. ఆదినమున భరణీనక్షత్ర మెప్పటికిని రాదు. మరియు నిటువలెనే "ఆశ్వినస్య సితేపక్షే ద్వితీయాయాం గురోర్దినే। కృత్తికానామ నక్షత్రేసాయం మృత్యుర్న సంశయః" మీనరాశిలో బుట్టినవాడు ఆశ్వీయుజ శుద్ధ ద్వితీయా గురువారమునాఁటి సాయంత్రి కృత్తికానక్షత్రమందుఁ జచ్చెను ఇచ్చటను గృత్తికా నక్షత్రము రానేరదు. చూడుఁడీ యభినవసిద్ధాంత మెట్లున్నది ?

శుక్రుఁడు భూసూర్యులకు నడుమ వచ్చినప్పుడు ప్రకాశభాగము సూర్యాభిముఖముగను, అప్రకాశభాగము భూమ్యభిముఖముగ నుండుటచే శుక్రగ్రహముగపడక శుక్రమూఢ మేర్పడును. ఫలశాస్త్రము శుక్రుఁడు గప్పినను మౌఢ్యమని చెప్పుచు, నూతన కార్యారంభములు చేయఁగూడదని మంచిసమయములను అనుకూలములను వ్యర్థము చేయుచున్నది. శుక్రమనగా వీర్యము; యౌవనకాలమందు వీర్యముత్పత్తియగును ; శుక్రోదయమనఁగా యౌవనకాలము గాన నప్పుడు వివాహము చేయవలెననుటకు శుక్రోదయమున వివాహమవశ్య మాచరింపవలయునని ఋషులు చెప్పియున్నారు ఇట్టి సత్యమును

విడిచి, ప్రపంచమున వేలకొలది భాగములలో నొకభాగ మగు హిందూదేశ నివాసులు శుక్రమూఢాది మూఢాచారములలో మునుగుచున్నారు. ఇట్టివారు విద్వాంసులా? వారికిబుద్ధియున్నదా?

గణితములో ఫలితముఁజేర్చి పంచాంగములు ముద్రించి, ధరలు హెచ్చుననియు తగ్గుననియు చెప్పెదరు. వారికి దానియందు దృఢవిశ్వాసమున్నచో దీనిని రహస్యముగ తెలిసికొని, తాము వ్యాపారములు చేసి కోటీశ్వరులు గానేరక కాసులు పైసాలుకొరకు వేసారితిరుగుటలెందుకు? ధర మందగించినప్పుడు పదార్థములు కొని యుంచి, తేటమైనప్పుడు విక్రయించి లక్షాధికారులు కాఁజాలక భిక్షాధికారులై శనైశ్చర సంచారములేల చేయవలయును?

మా కాలెజీయందొక విద్యార్థి "నీవీసంవత్సరమునఁ బరీక్షలోఁగడదేరజాలవు" యన్న జ్యోతిష్కుని మాట నమ్ముకొని చదువుట మానుకొనెను. మా ప్రిన్సిపలుగారు ఈ సంగతిఁదెలిసి యాజ్యోతిష్కుని స్కూలునకుం బిలువనంపి "మీరు ఫలములు చెప్పఁగలరా" యని యడిగెను. అహా! సందేహమేమి? చెప్పగలను. అని అతఁడు బదులు చెప్పునంతలో బెత్తముతో డజన్

వాయించుసరికి, తిరిగితిరిగి చూచుచు నింటికి పరుగెత్తెను. అప్పుడా విద్యార్థినిఁజూచి, తనఫలమును దాను దెలియని యామోసగాని వంచకపు మాటలను నీవెట్లు నమ్మితివని బుద్ధిచెప్పి యా సంవత్సరమున వాఁడు పరిక్షలో గడతేరునట్లు చేసెను. "పృష్ఠే చంద్రేభవేన్మృత్యుః వామే చంద్రే ధనక్షయః" అనువారునువారే "నహిచలతినరాణాం భావినీకర్మరేఖా" యనువారును వారే. ఇందేదినిజము ? కర్మఫలము తప్పక జరుగునప్పుడు యీఫలితజ్యోతిషమువలనఁ బ్రయోజనమేమి ? నేనింకఁజాలించెదను.

---

## (8) ఆత్మదేవుఁడు.

పితృమహాజనులారా ! రామమోహనులు చెప్పినట్లు ఫలితజ్యోతిషము జ్యోతిష్కులకు పనికిరాకుండుట వింతగానేయున్నది. తాము భాగ్యశాలినులగు కన్యలను బాగుగ ఫలపరీక్షచేసి తమయిండ్లకు నేల తెచ్చుకొనరాదు ? సర్వసంపదలతోఁ దమగృహాముల నేల నించుకొనరాదు ? ఒక జ్యోతిష్కుని కొడుకును పాముకరచినయెడల వానికి నౌషధమిచ్చునప్పుడేల ముహూర్తమును

పంచాంగములో వెదుకఁడు ? ఒక ఫలశాస్త్రిజ్ఞుఁడు గ్రిహబాధవలన ననేక కష్టముల ననుభవించునప్పుడు శాంతిసంతర్పణ సమారాధనల నేల చేయఁడు ? శనివేధ చేత నొక యవనజ్యోతిష్కుని బాకీలను అప్పులువారెగవేయగా గ్రహప్రసన్నత కొరకుఁ బ్రబంధములనుజరుపక కోర్టులకెందులకు పోవలయును ? ఒక ఫలశాస్త్రిజ్ఞుని యిల్లు కాలినప్పుడు చల్లార్పుటకేల ముహూర్తమును వెదుకఁడు ? వారేల రైలుప్రయాణమునకై వారశూలాది వర్జములు విచారించరు ? ముహూర్తము లక్కరలేని విదేశీయులకు గల దుఃఖములేవి ? ముహూర్తమూర్ఖతను మునిఁగిన హిందువుల సుఖములేవి ? "బుద్ధిర్యస్య బలంతస్య నిర్బుద్దేస్తు కుతోబలం" అన్నట్లు నిర్బుద్ధి మనుష్యుల గతులిట్టివే.

ఈరాశియందు బుట్టినవాఁడీ దినమునఁ జచ్చునను జన్మపత్రముల నమ్ముకొని మూఢ విశ్వాసమున దుఃఖియై గురిగాఁ జచ్చుటయు సంభవించును. మూఢవిశ్వాసము తుపాకిగుండుతో సమానమైనది. కాన జ్యోతిష్కులు నరహంతుకులై యున్నవారు. దీనిని నమ్మువారు "మూఢోమూర్ఖో గార్ధభో యేకరాశి"యనునట్లు మూఢులుగ నున్నారు.

ఫలిత జ్యోతిషమందు అంగారక గ్రహము మన వారికి విశేష విపత్తులను కలుగఁజేయును. సప్తసంగ్రహముల కంతటికి బలాధిక్యమెట్లు కలిగెను? గ్రహముల ప్రసన్నతకొరకు జ్యోతిష్కులకు దానములేల యియ్యవలయును? గ్రహముల, ప్రసన్నా ప్రసన్నములు నిజమైన నెవరికి సూర్యగ్రహము ప్రసన్నమో వారికి వైశాఖ జ్యేష్ఠ మాసములయందలి యెండతాపము నీఁగూడదు. వారికి ఛత్రములు చెప్పు లక్కరలేదు. ఎవరికి చంద్రగ్రహము ప్రసన్నమో వారు హేమంత ఋతువునందు దిగంబర సంచారులైనను చలికిఁ బాల్పడఁగూడదు. ఎవరికి గ్రహములు సౌమ్యములై యున్నవో వారినవి బాధించక నుండవలయును. ఇట్లు జరుగుచున్నదా? గ్రహములు జ్యోతిష్కుల వశమైనప్పుడు తామే రాజులు గావలయునుగదా?

వాస్తవముగా జ్యోతిష్కులు గ్రహదానోపజీవనులైనందున వీరికే గ్రహమూర్తులని పేరు. ఎందుకనఁగా గ్రహశబ్దార్థము పుచ్చుకొనుట యగుచున్నది. "యేగృహ్ణంతి తేగ్రహాః" యెవరు గ్రహింతురో వారు గ్రహములు. వారికియ్యకున్న ద్వేషింతురు. అప్పుడు క్రూరగ్రహములగుదురు. ఇచ్చిన సంతసించి సౌమ్యులగు

దుకు. కాన యవన జ్యోతిష్కులు సాక్షాత్ గ్రహము లని సిద్ధమయ్యెను.

జ్యోతిష్కులకు కొక్క జ్ఞానమున్నది. సాధారణముగా లోకులు తాము సుఖముగా నున్నప్పుడేమియు విచారింపక తమ కేమయినకష్టము ప్రాప్తించినప్పుడే తమ గ్రహచారము లెట్లున్నవో తెలియుటకు దైవజ్ఞునియొద్దకు వచ్చువాడుకయై యున్నది. ఇది తెలిసి పోపుజీలు వంకర టింకలులకు వెదకుదురు. తత్ శాంతికి యోగ్యతానుసారము సూర్య నమస్కారములు, గ్రహజపములు, సంతర్పణ సమారాధనలు, గో భూ హిరణ్య వస్త్రదానములు చెప్పి తమ స్వార్థమును దీర్చుకొందురు. గ్రంథములందొక్క సమయముననే సుఖదుఃఖముల రెంటికిఁ దగిన యాధారములు దొరకుచున్నవి. రోగము కలిగినప్పుడు గ్రహచారము బాగుండలేదందురు. జపాదులు చేయించెదరు. రోగము శాంతించినయెడల నందుకు గ్రహశాంతి కారణమందురు చచ్చెనా గ్రహచారమెప్పటికైనా తప్పవాయని యందురు. ఇది సోదర పూరణార్థ శాస్త్రమనుటకేమి సందేహము?

మా గ్రామమున నా భార్యయు మరియిద్దరు స్త్రీలును నేక కాలముల నొక్కటే లగ్నమున బ్రసవించిరి.

వారిలో మూఁడవాఁడు విద్యావంతుఁడయ్యెను. తక్కిన వారు విద్యావిహీనులైరి. నేను కొందఱి యరణ్యావాసుల జన్మములను గనిపెట్టి జాతకములు వ్రాసితిని. అంతయు తలక్రిందులైపోయి, నాకున్న విశ్వాసమంతయు మాయమయ్యెను. నాకుండిన యనావశ్యకభయము తొలఁగిపోయి సుఖముకలిగినది. వాస్తవముగ నేమహాత్ముఁడైనను భవిష్యమును జెప్పఁగలిగియున్నచో నట్టి మహిమ ఫలిత జ్యోతిషమువలన గానేరదు. అదియోగము నాత్మజ్ఞాన సంబంధమైనది. అందుకు ద్రవ్యాదులు సమర్పింప నవసరములేదు. అది యవన జ్యోతిష్యమునకు సర్వథా సంబంధము గలిగియున్నది కాదు. ధనాకాంక్షగల, దైవజ్ఞత మోసమని తెలియవలయును. మహాత్ములకు జాతకములు, కుండలులు, హస్తములు, ఆకారములు, వారతిథిమాసాది కాలములు, గణితములు గ్రంథములు, మొదలగునవి యక్కరలేదు వారు ఋషులు.

ఓహో! మనవారికెట్టి దైవజ్ఞులు చేకూరిరి. వీరి పద్ధతినిబట్టి మంచిచెడుగులన్నియు గ్రహములందున్నవిగాని, మనుష్యులందు లేవు. ఫలప్రాప్తియంతయు

నీశ్వర వ్యవస్థలోలేదు ; గ్రహావ్యవస్థలో నున్నది. కాన ఫలశాస్త్రము నాస్తికము; దీనినినమ్మువారు నాస్తికులు.

ఒకడు జారచోరుఁడగుటకు గ్రహములు కారణము గనుక ప్రభువులందరును తమ శాసనముల త్యజింపవ లయును ; వేదాది శాస్త్రములు 'ఇతిశ్రీ' యయ్యెను. కాని పూర్వప్రభువులైనను ఇప్పటివారైనను తమ న్యాయ స్థానములందు న్యాయవాదులు, సాక్షులు, చట్టములు మొదలుగాఁగల ప్రబంధములకు బదులుగా నీభవిష్య జ్యోతిష్కులను ప్రతిష్ఠించి వీరి సహాయముతో వీఁడు దోషి; వాఁడు నిర్దోషి, ఈనేరమిటుల జరిగినది ; అని నిర్ణయింపఁజేసి తీర్పులు చేయుటగానము. ప్రభువులు నమ్మనిదానిని ప్రజలెట్లు నమ్ముచున్నారు ? వారు భ్రమప్రమాదమునఁబడిన పామరులని ఖస్పష్టమగుచున్నది.

ఒకానొక వంధ్యస్త్రీ జ్యోతిష్కునివద్దకుఁబోయి, నాకుసంతానము గలుగుటకు నుపాయమేమని యడిగెను. అందులకతఁడు నీవు ఎవరిదైన పరుల గృహమును కాల్చి వేసినయెడల సంతానమగునని చెప్పెను. జ్యోతిష్కులు తమ యుక్తులుపన్నుగడలు జపములు వ్యర్థములగు సంద ర్భమున నిట్టి యుగ్రమయిన యుపాయముల చెప్పి తప్పిం చుకొందురు. మరియొక జ్యోతిష్కుఁడు ఒక గొల్లడాలికి

జ్యేష్ఠపుత్రుఁడగు నొక్కవిరక్తమున స్నానముచేసినచో నీకు పుత్రుఁడు కలుగునని చెప్పెను. మూఢమతులగు నాయువతులు పోపులుపదేశించిన పనులాచరించి కారాగృహమున కాపురముండబోయిరి. ఇట్టి యనర్థములెన్నియో జరిగినవి. ఆహా! ధీమంతులారా! మీరింకను దీనియనర్థమును గనుంగొననేరకున్నారుగా? మీ బుద్ధికి ధన్యవాదము; ఇకనైన కాలయాపనముఁజేయక నీపాడు ఫలశాస్త్రమును పాడుచేయుటకుఁ బ్రయత్నించుఁడు. మన సంతతియగు భూలోకనివాసుల నీబ్రహ్మరాసిగట్టిగఁ బట్టుకొని పీడించుచున్నది. అయినను మనవారు దీనిని గృహదేవతగా భావించి పూజించుచున్నారు. తామనుభవించు దుష్టఫలములు, తామాచరించు కుకర్మములయొక్క పరిణామ ప్రాయశ్చిత్తములని యెరుంగక, గ్రహగతులందులకుఁ గారణమని భ్రమించి మరియు నందులకు పరిహారముగ నయితము దుష్టకర్ములాచరించుచు రౌరవాది నరకములలోఁబడి పొరలుచున్నవారు. ఈశ్వరీయ నియమమును స్వప్నమందైనఁ దలంపరు. ఇది మహాపరితాపము! నేనాసనమును స్వీకరించెదను.

---

## (9) రుద్రదత్తుగారు.

సభ్యులారా ! ఫలాదులు తెలుపు శాస్త్రములన్నియు సత్యమైనవియుగాక, సత్యాసత్య రూపములైయున్నవి. కాలము నూతనమగుచున్నది. సంస్కారములు వెలయుచున్నవి. గాన ఫల జ్ఞానులును, తమశాస్త్రములను సంస్కరించుకొనుచు వచ్చియున్నారు. చూడుడు ! జన్మపత్రములందు మొదట " సాజన్మపత్రీ శుభదా న యస్యతజ్జీవితం సంతతమంధకంస్యాత్ " జన్మపత్రమెవనికిలేదో వాని జీవితమందు సదా యంధకారముండునని యాశను గల్పించిరి. మరియు వీరి యుక్తినిజూడుడు ! మొదటనే—"జనుషః సమయే ధృతంనయంత్రం నమయా చ నివేశితా చ నాడీ। అపరై రుపదిష్టజన్మకాలాజ్జని పత్రీహవిలిఖ్యతేమయైషా " అనగా నేను జన్మకాలము దెలియుటకు కాలయంత్రము నుపయోగింపలేదు. పరులుచెప్పిన కాలమునుబట్టి జాతకమును వ్రాయుచున్నాడను. అని వ్రాయుచురు.

వారెంత ద్వంద్వార్థములుగను, అర్థాంతరద్యోతకముగను, అనుమానముగను, యూహలుగను, చమత్కృతిగను వ్రాసినప్పటికిని కొన్నివిషయములందు చిక్కులు

సంభవించును. గనుక నట్టివిషయములనుండి తాము తప్పించుకొనుటకై యీనూతన సంస్కార శ్లోకమును కవచరూపముగ వ్రాసిపెట్టుదురు. వీరిబూటకమును విశ్వగుణాదర్శమను గ్రంథకర్త యిట్లు వర్ణించియు న్నాడు. "విలిఖిత సదసద్వ్యాజ జన్మపత్రం జనానాం। ఫల తియదితదాసీం దర్శయత్యాత్మదాక్ష్యమ్। నఫలతి య దిలగ్నం ద్రష్టురేవాహమోహం – హరతిధన మిత్థేవం హంతదైవజ్ఞపాశః" ఫలశాస్త్రివేత్త, సుఖదుఃఖయుత మైన మంచిచెడుగులను జేర్చి జన్మపత్రమున వ్రాయును. అందు కొన్ని ఫలములు సమ్మిళితములైనప్పుడు తన ప్ర భావమును జెప్పుకొనును తప్పినసంగతులకు జన్మకాల మును చెప్పినవానినెత్తిన తప్పుమోపును. ఈకుత్సితులు పరులద్రవ్యము నీవిధముగా నపహరించుచున్నవారలు; అని చెప్పియున్నాడు.

తప్పిపోయినవన్నియు కాలపరీక్షకుల లోపమని యును జనులను నమ్మించుదురు. కాలపరీక్ష తప్పియు న్నప్పుడు, ఫలములన్నియు తలక్రిందులు కావలయును గదా? కొన్ని నిజమై ఘటించుటకు కారణమేమి? అది శాస్త్రచమత్కారము. నా కుమారుడు పుష్యబహుళ యమావాస్య సోమవారమున జన్మించెను.

"సాత్వికో గుణవాన్ శాంతః పూజ్యో మానీ దృఢవ్రతః ।
దీర్ఘాయు ర్ధనవాన్ దాంతః సోమవారే సముద్భవః"
అను వార ఫలప్రకారము దీర్ఘాయువుగలవాడు. అమా వాస్య ఫలములో "అమాయాంతు నరోజాతో యింద్రియార్థ గతస్సుఖీ చతురో బలహీనశ్చ స్వల్పాయుశ్చల చిత్తగః" అనునట్లు అల్పాయువుగలవాడు. వారఫలములలో గుణవంతుడు శాంతుడు దాంతుడు పూజ్యుడు తిథిఫలములో దీనికి విరోధము. యీలాగుననే సమస్త ఫలములును సుఖదుఃఖముల రెంటికి సరిపోవుచున్నవి. మా వాడిప్పుడు పూర్ణాయువు గలవాడనియు, మరియు నల్పాయువు గలవాడనియు చెప్పవచ్చును. ఆకాశమందలి జడములగు గ్రహములకును చేతనములగు జీవులకును నీశ్వరవ్యవస్థయగు పాప పుణ్య సంబంధమగు సుఖదుఃఖములలో నేమి సంబంధముగలదు? వాని ఫలములన్నియు ఋతుకాల భేదముల చేత సమష్టికి గలుగవలసియున్నవి గాని, వ్యక్తిమాత్రమునకు గానేరదు. మాతల్లి అమడబిడ్డలను గన్నది, గాని ఆమె జాతకములో నాసంగతి వ్రాయబడలేదు. మాతండ్రి జాతకమునను సయితము వ్రాయబడలేదు.

ఆర్యులకాలమున పంచాంగములకు తిథిపత్రములని

పేరుండెను. ఐదుసంవత్సరములకు నొక్కసారి పంచాంగములు గుణింపబడుచుండెను. (1) సంవత్సరము (2) పరివత్సరము (3) ఇదావత్సరము (4) వత్సరము (5)ఇద్వత్సరము అని (తై॥ బ్రా॥ 4-10-4) ఆర్షేయపంచాంగములలో ఫలితములవాసనయే యుండలేదు. సిద్ధాంతమందు " భూచ్ఛాయాం స్వగ్రహణే భాస్కర మర్కగ్రహే ప్రవిశతీందుః । ప్రగ్రహణమతః పశ్చాన్నేం దోర్భానోశ్చపూర్వార్థాత్ " (బృహత్సంహితాయాం) అనగా చంద్రగ్రహణమందు భూచ్ఛాయలో చంద్రుడును,సూర్య భూగోళములకు నడుమ చంద్రుడుండునని చెప్పియుండగా పంచాంగములలో సూర్య-చంద్రులను పాము మ్రింగినట్లు ప్రతిమల నచ్చొత్తించి, కల్పితకథలను నమ్మునట్లు సిద్ధాంతులే జనులను మోసపరచుచు మహాపాతకులగుచున్నారు.

పంచాంగమనగా సూర్యోదయ సంగవ మధ్యాహ్న అపరాహ్ణ సాయంకాలమని, దినమును అయిదుభాగములుగా విభజించుటగానున్నది. (అ॥ వే॥ 9-6-46) ఇప్పటి పంచాంగములలో నెన్ని యంగములుగలవో చూడుడు !

ఫలిత జ్యోతిషమును సాధించుటకై అనేక కల్ప

నాకథలను చెప్పినారు. వాల్మీకులు శ్రీరాముని జన్మమునకంటె పూర్వమే రామాయణము వ్రాసినదీ మహాజ్యోతిష ఫలశాస్త్ర మహిమచేతనే యనియు, గర్గఋషి శ్రీకృష్ణులయొక్క జన్మకుండలినిబట్టి, కంస సంహారకథను వ్రాసినదీ ఫలశాస్త్రాధారముననే యనియును చెప్పెదరు. ఫలము తప్పుటకు సమాధానముగ నొక కథ కల్పింపబడినది:— ఈశ్వరుడు బృహస్పతి చెప్పిన ఫలమును పరీక్షించుటకై, పార్వతినిచూడ నింటికివెళ్ళెను. ద్వారమున గణపతి కావలియుండి, తల్లియనుజ్ఞనొప్పున తండ్రిని యాటంకపరచెను. ఈశ్వరుడతనితలనరికి లోపలబోయి చూడగా, దేవగురువు చెప్పినట్లు, పార్వతి బిత్తలయై స్నానముచేయుచుండెను. అప్పుడీశ్వరుడీశాస్త్రి మనర్థమయినదని తలంచి, ఫలశాస్త్రిమసత్యమై పోవుగాక యని శపించెను. ఇది సనాతన సత్యశాస్త్రిమైతే, నీశ్వరుడెందులకు పరీక్షించును? ఈ పార్వతీ పతియెవరు ? పర్వత ప్రాంత్యములలో, హిమవద్గిరి సమీపమున కొండలదేశమునకు రాజుగానుండిన నొక ఆర్యరాజు. పాపము ! వీరెన్ని కల్లపల్లటీలు గొట్టిరో చూడుడు ! ఈశ్వర - శాపమువలన, మిథ్యయైపోయిన శాస్త్రిమునేల, మనవారు పట్టుకొని గోలపెట్టు

చున్నారు. ఓహో! వీరీశ్వరద్రోహులు. గనుకనే దుఃఖములధికములై యున్నవి.

నాజాతకములో నాల్గు కేంద్రములయందును శుభగ్రహము లున్నందున "లక్షద్వయం ధనంయాతి చతుష్కేంద్రే శుభాన్వితే" అను దానిని నమ్మి మాతండ్రి రెండులక్షల ద్రవ్యముగలవాడగునని చెప్పుకొనుచుండెను. నాదరిద్రదశ మీకందరికి తెలిసియేయున్నది.

ఇట్టి రాసభ దైవజ్ఞులు, యిటువంటి గార్దభేంద్ర సిద్ధాంతులు, యీలాటి ఖరశేఖర జ్యోతిష్కులు భూలోకమున విస్తరించినను ప్రబలుచున్నవారు. ఈఫలజ్ఞానులు పనులకు ఫలము చెప్పుచున్నారుగాని, నేడు తమ గృహాము కూలిపోవునని, రేపు తమయిల్లు కాలుచున్నదని, యీరాత్రి తమ్ము దొంగలు దోచుకొందురని, తమ కూతురు ఈవరునింగూడిన విధవయగునని తమకిపు డవమానము గలుగునని తమవ్యాజ్యము కొట్టుబడిపోవునని తమకిపుడు ప్రాణభంగమగునని తెలియజాలరు.

ఒకడు కన్నులుమూసికొని ధ్యానించిగాని, స్వరమును చ్ఛాభ్యాసముచేసి పరిక్షించిగాని, పాచికలు దొర్లించి గణితము వేసిగాని, శోధించిన ఫలశాస్త్రజ్ఞానముచేత గాని, భవిష్యమును చెప్పినను కొన్ని నిజమగుటయు,

మరికొన్ని యబద్ధమగుటయు సంభవించును. ఒకడు దేనిని చూడకను, ధ్యానించకను, గుణింపకను, యూహించి చెప్పినను యట్లే జరుగును. ఈమాత్రమునకీ గ్రంథ సముద్రమెందుకు ? వీరిమిథ్యలు సత్యములని లోకులుభ్రమించి "గోత్రకాలుతో బియ్యమునుదంచినట్లు" తమపురుషార్థమును వ్యర్థపరచుకొనుచున్నారు. ప్రతి శుభాశుభ కార్యమునకును యీ దైవజ్ఞ వేషధారుల శరణమపేక్షించుచు "పుత్రదానమునకుబోయి పతిని బోగొట్టుకొన్నట్టు" తమయొక్క మంచిసమయమును బోగొట్టుకొనుచున్నారు ప్రతి చిన్న పెద్ద పనుల కెల్లను జ్యోతిష్కునికి ముడుపుచెల్లించుచు "ముద్దుయిచ్చి ముక్కును గోయించుకొన్నట్టు" తమకనుకూలమైన కార్యములనెల్ల ప్రతికూలపరచుకొనుచున్నారు. దైవవిధాయకముచొప్పున వారివారి కర్మానుసారముగ సంభవించు ప్రతియాపత్కాలమందును, తమ ముఖ్యకర్తవ్యములను మానుకొని, సిద్ధాంతబ్రువులవద్దకు వెళ్ళుచు "తేలుకుట్టినందుకు పాముపుట్టలో చేయిదూర్చినట్లు" మరింత దుఃఖభాజకులగుచున్నారు.

వీరింతటితోబోక సిద్ధాంతగ్రంధములందు సయితము ప్రక్షిప్తములజేర్చి, వాటిని పాడుచేయుదొడంగి తమ

చేతుల నందులో దూర్చియున్నారు. మన యితిహాస ములెట్లు కల్పితాంశములు దూర్చబడి పాడుచేయబడి నవో అందరెరింగిన విషయమే. అలాగుననే సిద్ధాంత గ్రంథములలో ఫలభాగములను దూర్చియున్నారు. గాన నింక కాలయాపనముకూడ గాదు. ఈ మిథ్యాంకుర ముల నిప్పుడేపీకి పారవైచి శుద్ధపరచవలయును. నేమకా సముంబూనెద.

అప్పుడు వందేశర్మగారులేచి యుపన్యాసపీఠ మునధిరోహించి యిట్లనిరి.

## (10) వందేశర్మ.

ఓ పితృబృందమా! నాభార్య ప్రసవించినపుడు, నేను జన్మకుండలివేసి లగ్నపరీక్షచేయగా బృహస్పతిగ్ర హము యేకరాశిగతులయిన సూర్యచంద్రులను చూడక చక్కగానుండెను. ఇందుకు బృహజ్జాతకమందు "న్వాల గ్నమింద్రమంచ గురుర్నిరీక్షతేన వాశశాంకం రవిణాస మాగతం । సపాపకోర్కేణయుతోథవాశశీ, పరేణజాతం ప్రవదంతి నిశ్చయాత్ ॥" అను ప్రమాణముచొప్పున నాకాలమున బుట్టినవాడు నిశ్చయముగ జారత్వమున

గలిగినవాడని నేనుభావించి నాభార్యను త్యజించితిని. నిర్దోషిమైన నాగృహదేవి యీ బహిష్కారమునకు సహింపక ప్రాణత్యాగము గావించుకొనెను విమర్శన జ్ఞానములేని నేను దుఃఖపడవలసివచ్చెను. గాన సర్వానర్థదాయకమైన నీఫలితజ్యోతిషమును విషమువలెభావించుచున్నాడను. ఈ ఫలితజ్యోతిషమున కుపబలముగా చెప్పెడు కథలన్నియు కార్యాంతరమున గల్పింపబడిన వనుట కుదాహరణముగా, నా స్నేహితుడొకడు నన్ను నమ్మించుటకై "బృందావన జ్యోతిష్యులనువారు మహానుభావులు; వారు నాకనేకవిషయములు చెప్పియుండిరి" అని వింతవింతలు జెప్పెను. ఆ బృందావనుడు మాత్రం డిప్యేయని నామిత్రునకు దెలియదు ఆయన మాత్రం డిప్యేయని నేను జెప్పినప్పుడు, నామిత్రుడు లజ్జపడి వెళ్ళిపోయెను. గావున ననేకులు పెద్దమనుష్యులగువారు నయితేము, పరులనమ్మించుటకై బుద్ధిపూర్వకముగ నబద్ధములు చెప్పుచున్నవారు. కొన్ని భవిష్యములు ప్రకృతి నియమమునుబట్టి పూర్వులు తెలుపుచుండిరి. పదార్థ విద్య ననుసరించి పూర్వమార్యులు ఫాల్గుణశుక్ల పూర్ణిమనాడు గొప్ప హవనముచేసి, హోమాగ్ని కీలలనుపరిక్షించి, అగ్నిశిఖలు వాయుగతివలన పశ్చిమదిశకు వ్రాలి

నమెడల వర్షము సమృద్ధిగా గురియుననియును, తూర్పు నబ్రాలిన దో నల్ప వర్షమనియు, దక్షిణమునకు బ్రాలిన యెడల నశుభమనియు, నుత్తరమునకు బ్రాలిన నధిక వర్షమనియు నిశ్చయించుచుండిరి. కొన్ని జంతువులకు భగవన్నియమమును బట్టి ఋతుభేదములు దెలియును. కాకి గూడులు, చీమలప్రాకులు, గోవులస్వభావములు మొదలగునవి ఋతుభేదములను దెలియజేయును. ఆవుల కాపరులు తమ మందలోని గోవులుసంధ్యాకాలమందొక్క పెట్టుగా మోమునెత్తి అంబాయని యరచినను, సంధ్యవేళ దొడ్డిచేరిన వెంటనే నిద్రించినను, పండ్రెండుగంటలలోపల తప్పక వర్షము కురియునని నిశ్చయింతురు. ఇది యీశ్వరదత్తమగు స్వభావజ్ఞానము. ఒక కుక్కను నీళ్లలో వేసితిమేని యది యీదుచువచ్చును. మనుష్యుఁడీతగొట్టవలయునన్న నభ్యసింపవలయును. ఏభవిష్యము దెలియుట మనుజులకు బాధకముగానున్నదో యాకర్తమును దెలియుటకై యత్నించుట వృథయగును.

భవిష్యజ్ఞానముగలవాడేపనిజేసినను భంగముకాఁడదు. భావికాలము నిజముగ గలవాడైనచో భంగకార్యమునకెట్లు బూనుకొనును ? ఫలజ్ఞానుడు వేసినచెట్టు

చావగూడదు. ఆగంతుకము దెలిసినవాడేరోగికి చికిత్స చేసిన చావకూడదు. అతడేవ్యాపారముచేసిన నష్టము రాకూడదు. ఈమాయకారిమల్లయలెట్లు మోసము చేయుచున్నారు చూడుడు! ఈకుక్షింభర కపటుల జేరువారు పిచ్చిపుల్లయ్యలుగాక మరెవ్వరు? ఈతెల్ల బొమ్మలకడకు వెడలువారు వెఱ్ఱివెంకయ్యలుగారా? ఈయర్థసిద్ధాంతులు గణితములో ఫలితమునుజేర్చి పంచాంగములందు "ఈసంవత్సర మార్గశిర కార్తిరాత్రి ప్రవేశమగుటవల్లను గురుచారఫలము శుభమైనందుననను చంద్రగ్రహణము కలుగుటవలనను, సువృష్టియు, సస్యాభివృద్ధియు, చెరుకు వడ్లు నూవులామువాలు, రాగులు, జొన్నలుత్తమమగును. పంచగ్రహకూటము సప్తగ్రహకూటము శనిరాహు సంయోగము మొదలగు దుర్యోగము లుండుటవలన కాలమునకు సరిగా వానరాక ఖండవృష్టి గురియుచు సాధారణ పంటలుపండును; ఒకదేశము సుభిక్షము, మరియొకచోట దుర్భిక్షము, అక్కడక్కడ దొంగతనములు హత్యలుజరుగును; చైత్ర వైశాఖములందగ్నిభయము; హేమంతమున శీతజ్వరము గలుగును; జంతువులకు రోగములుబుట్టును; పైరులకు బురుగులు పట్టును; భద్ర తుంగలో సంగమించును; మహార్ఘము;

వృష్టినాశము ; సస్యసమృద్ధి ; కించిత్ బాధ ; అరణ్యా ములందు మృగబాధలు ; క్షామమందు జనులుచత్తురు ; వర్షములు రానందున ధరలు హెచ్చును " యీబుడుబు డుక్కల గద్దెలు నింపుదురు. ఈయుంగవైఖరిని సయి తముజూడుడు ! " పంచార్కాః పంచవాభౌమాః పంచ వామందవాసరాః । దుర్భిక్షం భయమాదేశ్యం తదాశే షాః శుభావహాః॥ " ఒక నెలలో ఆది మంగళ శనివారము లైదువచ్చినయెడల నశుభమనియు, దక్కిన సోమ బుధ గురు శుక్రవారములైదును శుభమనియు చెప్పబడినది. మరల "యత్రమాసే పంచవారాజాయంతేచ బృహస్ప తౌ విగ్రహః పశ్చిమే దేశే ఖడ్గయుద్ధంచజాయతే " యి చ్చటపైదానికి విరోధముగా గురువారము లైదువచ్చినచో చెడ్డదని చెప్పబడినది. ఇందేదినిజము ? దానికదినిజము; దీనికిదినిజము. ఒకనెలలో నైదు సోమవారములు వచ్చి యు కాల మశుభముగానున్నప్పుడు, దానిని సిద్ధపరచు టకు "మదాచ జాయతే పక్ష స్త్రియోదశ దినాత్మకః । తదాకాలోతి ఘోరస్స్యాత్ " ఇత్యాదులు అర్థాత్ మాసములో పదుమూడుదినములుగల పక్ష మున్నంజా లును ; శుభముపైని యశుభము గూర్చుండును. అథవా అమావాస్య పున్నములలోని సంయుక్తవారఫలము లీగో

షమును సరిచేయును. ఈ అఘ్రాంబుధి అపారమైనది గాన, వివరింప నెవరబ్బతరము? మాతాతలందరు నిందులో మునిగిపోయినారు ఈకపట ఫలవేత్తలు, అపాత్రిదానమును స్థాపించి దానముయొక్క క్రమమును పాడుచేసిరి మృత్యుంజయ జపములేమి, శని కేతు అంగారకాది గ్రహముల శాంత్యర్థమై నానావిధ దానములేమి అరిష్టనివరణ యంత్రములేమి, కల్పించి ఈశ్వరాదేశయుల్లంఘనమును, తన్నియమ భంగమునుజేయ సాహసించిరి. ఇంతియకాదు ; లంచముబుచ్చుకొని ముక్తిని దయచేయ ప్రారంభించిరి. ఈశ్వరునియందు విశ్వాసము లేకుండజేసిరి. భక్తిశ్రద్ధలను మునుగజేసిరి ; పుణ్యాకర్తల నాశనపరచిరి ; బ్రహ్మోపదేశమును బురదలో ద్రొక్కి, బొమ్మలను జడగ్రహములను పూజింపసాగిరి. తమపంచాంగములలో పిల్లలేడువకుండుటకు సుఖప్రసవములకు సంతానప్రాప్తికి క్రూరగ్రహచార పీడాదుల నివారణకు మహాశోద్ధరణీయాది యంత్రములను మంత్రములును, పోయివేయుటకు పశువులను గొనుటకు నాగలిగట్టుటకు విత్తనములు చల్లుటకు చెట్లునాటుటకు ముహూర్తములున్ను, శిరోరోగ నివారణకు మంత్రపూరితమైన టోపీలున్ను ప్రచురించి మానవ మర్కటములకు టోపీలువేసి

తమస్వార్థముం దీర్చుకొనుచున్నారు. ఆహా ! వీరెంతటి లజ్జలేనివారు ? యెటువంటి మూర్ఖప్రచారకులు ? యేలాటి దేశద్రోహులు ? దేశక్షేమమును గోరు ప్రభువులిట్టి సత్యాసత్యమిశ్రమములగు మోసకృత్యములచే నింపింపబడిన పంచాంగములను కాల్పించివేసి, యీవారంగసిద్ధాంతులను శిక్షించుట పరమధర్మము.

సభ్యులారా ! యీపాతకులవలన లోకము బహువిధముల నష్టపడుచున్నది. ఈ యసత్యఫలశాస్త్ర నమ్మకముచేత వధూవరుల గుణకర్మస్వభావ సమానత్వమును, వారి వయోరూపలావణ్య తుల్యమును గాటింపక కుండలీలను నమ్ముకొని, మూర్ఖజ్యోతిష్కుడు చెప్పిన మాటలనునమ్మి, భగవదాజ్ఞకు విరోధముగ వివాహములు జరుపుచు, వచింపరాని దుఃఖములకు పాల్పడుచున్నవారలు. నాజాతకములో ద్వితీయాధిపతి గురు శుక్రులతో గూడినందున సువర్ణపాత్రములో భోజనము చేయవలసియుండెను. అది యేజన్మములో లభించునో దోచకున్నది. గాని యనేకాంశములలో నాజాతకప్రకారమే కలిగినది ; గుఱ్ఱపు సవారిచేసితిని ; నీటిగండము తప్పినది; వివాహమయినది ; ఉద్యోగము లభించినది ; మాయింట చచ్చినవారుగలరు ; పుట్టినవారుగలరు ; లాభనష్ట

ములు కలిగినవి ; కాయిలాలు సంభవించినవి ; యొకటి కాదు నాయనుభవములన్నియు నించుమించుగా నందు లోనుండినవి ; అయినను యీఫలశాస్త్ర విశ్వాసము చేత నాకుజన్మించిన పుత్రుడు జారజుడను నమ్మకము కలుగుటయు, నా కారణమున నాభార్యను త్యజించుట యు, నా హేతువున నామె ఆత్మహత్య గావించుకొనుటయు, నాజాతకమునందుగాని నాభార్యజాతకమునందు గాని వ్రాయబడియుండలేదు. ఇది తెలిసియుండిన నేను దుకు శాంత్యాదులైనను చేసియుందును. ఇట్టి ముఖ్య విషయములే జాతకములందు నుండవు. మొత్తమున నీశాస్త్రమున లాభమునుబొందుట, సూదులతో బావిని దవ్వి జలమును ద్రావుటవంటిదిగా నున్నది. గనుక దీనివినాశనము సముంచితమని నాయాశయము. నేనింక గూర్చుండెదను.

అప్పుడు హంసరాజుగారు నిలువంబడిరి.

---

## (11) హంసరాజుగారు.

నా ధర్మసహోదరులారా ! శాస్త్రప్రకారము గుణములలో దోషములను, దోషములలో గుణముల

నారోపించుట దూషణమనబడును. మరియు గుణమును గుణమని దోషమును దోషమని చెప్పుట భూషణమన బడును. మన పూర్వపు ఋషులు సత్యాసత్య నిర్ణయ ముకొరకు మనకు దర్శన గ్రంథములను దయచేసియు న్నారు. వానిచే పరీక్షించి, అట్టి పరీక్షలో ప్రత్యక్షా నుమానోపమాన శబ్ద, ఐతిహ్య, అర్థాపత్తి, సంభవ, ఆప్తోక్తి మొదలుగాగల ప్రమాణములకు విరుద్ధముగ- అసత్యము- అగ్రాహ్యము- అనుచితము- అసంభవము- అన్యాయములని యేర్పడినవానిని సర్వథా త్యజింప వలయును.

యవనజ్యోతిషము తప్పిపోయినప్పుడు జోష్యులు ముహూర్తము సరిగా దొరకలేదని యొకనెపము జెప్పె దరు. ఒకని జాతకములో కొన్ని నిజమగుచున్నవి ; మరికొన్ని యబద్ధమగుచున్నవి. కల్లలయిన విషయ ములకు ముహూర్తము సరిగా దొరకలేదందురుగదా ? నిజమైన విషయములకేమి దొరకియున్నది ? చమత్కా రమా ? అథవా మూర్ఖమా ? సత్యాసత్య నిర్ణయప క్షులకువారీహేత్వాభాసమును మీమాంసముచేయుదు ముహూర్తము సరిగా జిక్కలేదనుట ఈశ్వరశాపమును మిథ్యచేసెను ఇటువలె నీశ్వరశాపము- ముహూర్త

సూటిని ఖండించెను ఈ పూర్వాపర విరోధమువలన రెండును త్యాజ్యములయ్యెను. ఇటువంటి మిథ్యాపరిగ్రహణమునకు హిమాలయభ్రాంతల శిష్యులు తమ గుప్తవిద్యను దివ్యజ్ఞానమును ధారబోయుచుండుట యెంతయజ్ఞానము ?

నాభార్య ప్రసవవేదన పడుచున్న తరుణమందు జ్యోతిష్కుని ప్రశ్నయడుగగా:— ప్రశ్నకాలమందు లగ్నరవి గురుచంద్రులు విషమరాశి నవాంశములయందుండుట చేత "ఓజర్‌క్షేపురుషాంశకేషు బలిభిర్లగ్నార్కగుర్వింమభిః। పుంజన్మప్రవదేత్......" ఇత్యాది బృహజ్జాతక వచనముబట్టి కుమారుడు గలుగునని చెప్పెను. అందులకు మాతల్లి నవ్వుచు "మీశాస్త్రము పనికిరానిది ; తప్పక యాడబిడ్డ పుట్టు" నని చెప్పెను ఆమె చెప్పినట్లే జరిగినది. విచారించగా— నాభార్య కూర్చుండునప్పుడును లేచునప్పుడును యెడమచేయి భూమిమీద యూనుచుండుటను బట్టి నిశ్చయించితినని చెప్పెను. ఇట్లు విద్యావిహీనులు చెప్పినవానిలో ననేకములు నిజమగుచున్నవి. గనుక నిచట శాస్త్రాధిక్యమేమి నిలిచెను ?

నేను హైందవగ్రంథములనుగాక యవనగ్రంథములగు కానునుల్, మహాబూబి, సిక్తా, రమల మొదలగు

గ్రంథములను పరిశీలించినాడను. అందు పాచికలను ద్రొర్లించి కుండలిని వేయు పద్ధతిగలదు. ఆ కుండలిలో లహ్యాన మొదలుకొని తరీఖవరకును పదునారు శకలు గలవు. శకలముల పరస్పర గుణకమువలన మనుష్య జీవితములోని ఫలములనేకములు సమయానుసారముగ చూపుటకను ఏర్పరుపబడియున్నది. ఈ శకలములకు తత్వములు, గ్రహములు, వార, తిథి, మాస సంవత్సర ములాదిగాగల సంబంధములు బంధింపబడియున్నవి. ఈ శాస్త్రజ్ఞులు ప్రశ్నకర్తయొక్క హృదయభావములను విద్యుత్శక్తి ప్రభావమువలన పాచికలలో ప్రవేశింపజేయు నని నమ్ముచున్నవారు. పాచికలను ద్రొర్లించునప్పుడు "సురె అలహం ఖుల్లహువల్లా ఖుల్లహువల్లా ఖుల్ల హువల్లా దరోద" అను మంత్రమును పఠింపవలయును. వీరిలో ననేకులు తమసామర్థ్యమును నమ్మించుటకై "మీయింటికి సమీపమున నూతికలదు; మీ మర్మ స్థానమున మచ్చగలదు; మీ హృదయము దృఢమైనది అథవా చంచలమైనది. మీచేత ద్రవ్యము నిలువదు" యిటువంటి గద్దెలను చమత్కృతిగా వల్లింతురు. అట్టివి అందరియందు నుండునవియే.

శ్రోతలారా! జాతకములు వాదసౌకర్యముకొరక

కంగీకరించినను, పరీక్షవాయువులో నవి తూలికలవలె గొట్టుకొని పోవుచున్నవి. ఒకని జాతకములో సంతానము వ్రాయబడియున్నను భార్యతో రమింపక సంతానము కలుగదుగదా ? వీడు విద్యావంతుడని, జాతకములో నున్న మాత్రమున పాఠశాలలో చదువక విద్య రాదుగదా ? పురుషప్రయత్నము కారణమైనప్పుడు యీ శాస్త్రముతో ప్రయోజనమేమి ? ప్రయత్నించినను జాతకఫలమే-సిద్ధించునన్న ప్రయత్నము లేకున్నను జాతకము సత్యము గావలయునుగదా ? అట్లుగాకున్న నది ప్రధాన కారణ మెట్లగును ? నా జాతకములో ద్వితీయలాభాధిపతులు ఉచ్చయందుండి పాపగ్రహములతో కలిసియుండుట చేత «విత్తలాభాధిపౌస్వోచ్చేపాపఖేచరసంయుతే । జన్మప్రభృతిదారిద్ర్యం భూయాద్భిక్షాన్నజీవనం" అను ప్రమాణముచొప్పున నేను భిక్షమెత్తువాడు గావలయునుగదా ? నేను భూలోకమున నొకనిని చిటికెడు నశ్యము సయితె ముచితముగా నడిగినవాడనుగాను. ముహూర్తము సరిగా దొరకనందున ఫలము తప్పుచున్నదనెదరు గదా ? నష్టజాతకవిధాన మెచ్చటినుండి వచ్చెను ? గాన సర్వథా ముహూర్త కారణవాదము వ్యర్థము మరియు మిథ్యయైయున్నది.

కొందరు తమయొక్క స్వానుభవము గొప్ప నిద ర్శనముగా చెప్పుచు- తమకు త్తర దేశపు జ్యోతిష్కుడు మిక్కిలి గురిగా చెప్పినాడనియు, దక్షిణ దేశపు దైవ జ్ఞుడు చక్కగ తెల్పినాడనియును పలుకుదురు. ఈ పరికల్పములన్నియు కార్యతః చూపింపజాలరు కొన్ని కాకతాళన్యాయముగ తటస్థింపవచ్చును. గాని అందుకు శాస్త్రమాధారము గానేరదు. దురాభిమానులనేకులు పరులను నమ్మించి తమ మిథ్యను సాధించుటకై వందేశ ర్థగారు పన్యసించినట్లు బుద్ధిపూర్వకముగ నబద్ధములు చెప్పుదురు. మరియు గోరంతలను కొండంతలుగా వర్ణిం చుదురు. నా మిత్రుడొకడు తన దుఃఖములనేకములు గ్రహశాంత్యాదులవలన నివారణమయ్యెనని పట్టుదల తో వాదించుచుండెను. అతనికొకనాడు బహిర్దేశము వెళ్ళియుండి అధికాచమానానంతరం గుదప్రక్షాళనము చేసికొనుటలో దైవవశాత్తుగా చెంబులోనుండిన తేలు చేతిలోపడి రాత్రిపూటగనుక చూడనేరక ప్రక్షాళనము చేసుకొనుటలో గుదస్థానమునకును హస్తమునకును బల మైన కుట్టు కుట్టినది. నావద్దకు మందునకై వచ్చినాడు. నేనప్పుడు « నీ గ్రహచారమునకు మందుగలదా ? తేలు కుట్టును పాముకాటును గ్రహచారములుగావా ? అందుకు

గ్రహశాంత్యాదుల క్కరలేదా? నీ దుఃఖము లెన్ని యో-గ్రహశాంతులవలన నివారణమయ్యెనను హరివాదము నేడేమయ్యెనని" యడిగితిని అతడు మిగుల లజ్జాక్రాంతుడై నాటినుండి తన పామరత్వమును విడిచి పెట్టెను. గ్రహములు మనుష్యులకితర విధముగ సంబంధ ముండినను పుణ్యాపాపములకును సుఖదుఃఖములకు నెంత మాత్రము సంబంధముండదు. అట్లున్నదనుట కేవలము వేదశాస్త్ర విరుద్ధమైన నాస్తికవాద మగుచున్నది. ఛీఛీ!! యీ వృత్తితో జీవించువారికి ధిక్కారము! ధిక్కారము! నియత కాలము ముగిసినదిగాన నేనాసన మును స్వీకరించుచున్నాడను.

పిమ్మట శశిభూషణముగారు వ్యాఖ్యానస్థానముం జేరి నిలువంబడిరి.

---

## (12) శ శి భూ ష ణ ం.

మహాజ్జనులారా! లోకములో దృష్టికి గోచరింపని దానికి అదృష్టమని పేరు. అది సుఖదుఃఖరూపము లుగా మన స్వయంకృతాపరాధముల వలన నుత్పత్తియై మనకు ప్రాప్తమగుచున్నది. ప్రతి సుఖదుఃఖ సంఘటన

కును కారణమున్నది. మన జీవితముయొక్క ప్రత్యేక దినము ప్రతిక్షణము సయితము కారణమని చెప్పవలయును. ఈ స్వయాకృతాపరాధములు జన్మపరంపరగా సంఘటితమై యున్నవి. ఈ ఫలానుభవము వైవిధ్యమని వేదశాస్త్రములు చెప్పుచున్నవి. దీనిని దెలియవలెనని మానవుడాశపడుచున్నాడు. ఒకడొక గ్రంథములో కడ్డీపుల్లను దూర్చి అందలి మొదటివాక్యము అథవా ప్రకరణములోని శుభాశుభార్థములు తెలిసికొని ఫలమును నిర్ణయించుకొని నాయదృష్టమును కనిపెట్టితినని యానందించుచున్నవాడు. అది ఘుణాక్షరన్యాయముగ నొకప్పుడు సత్యమగును. మరియొకప్పుడసత్యమగును. సత్యమైన యంశమును గట్టిగ పట్టుకొని మూఢవిశ్వాసమును గలిగియుండును. మూఢవిశ్వాసము మిక్కిలి హానికరమని యందరెరింగిన సంగతియే. ఒకతూరి యొకడు తన శత్రువును బెదరించుటకై వట్టిమందు వేసి తుపాకిని గురిపెట్టి కాల్చగా నెదుటివాడు గుండు తగిలినదను మూఢనమ్మకముచేత నేలబడి ప్రాణములు విడిచెను. దుఃఖహేతువులలోన జ్ఞానమే మొదటిదియని సర్వజనవేద్యము. ఈ ఫలశాస్త్రమదృష్టము దెలియుటకాధారమని చెప్పెదమన్న కర్మఫలమును యవనులెల్లు

నమ్ముదురు ? దీనిని నమ్మునట్టి హిందువులు కర్మఫలమును భవింపక తప్పదని చెప్పెదరు. ఇట్లు చెప్పుచు దుఃఖని వారణకొరకు జప హోమ దాన సంతర్పణాదులు చేయించుచున్నరు. ఇదెట్టి యజ్ఞానాంధకారము ?

శీఘ్రబోధలోని "అవర్గో గరుడో జ్ఞేయో బిడాలః స్యాత్కవర్గకః" ఇత్యాది ప్రమాణముల ప్రకారము మాతండ్రిగారు గరుడవర్గముగాను, మాతల్లిగారు మార్జాలవర్గముగా నుండిరి. వీరికి ఫలశాస్త్రప్రకారము సదా వైరముండవలయును. అట్లుండక మాతల్లిదండ్రులు మరణపర్యంతమును పరమమైత్రినిగలిగి యుండిరి. పైశ్లోకప్రకార మర్జునుడు గరుడుడగుచున్నాడు. ద్రౌపది సర్పమగుచున్నది వీరి పరస్పరమైత్రినిగురించి యితిహాసము చాటుచున్నది. ఈరీతిగా నీకల్పితవర్గముల నెన్నింటినో పరిశీలించియున్నాడను సత్యము మాయ మైపోయినది. మైత్రీవర్గమువారనేకులు సదా గృహమందు దేవాసురసంగ్రామంబులు జేయుచుండగా జూచినాడను.

అశ్వలాయన గృహ్యసూత్రమున "సార్వకాలమేకే వివాహమ్" సర్వకాలములందును వివాహము చేయదగినదని చెప్పబడినది. గోభిలీయగృహ్యసూత్రమందు

" లక్షణప్రశస్తాం కుశలేన " యిత్యాదిగా—స్త్రీ, సర్వ థా శుభగుణములచే నుత్తమమై ప్రసన్నముగనుండు కాలమున పాణిగ్రహణము చేయవలయునని చెప్పబడి నది. ఋగ్వేదమున " తమస్మేరాయువతయోయువా నం " ఇత్యాది మంత్రములయందు విస్పష్టముగ వధూ వరులకు యువావస్థలో వివాహము చెప్పబడినది. ఇట్టి సత్యవేదశాస్త్రమర్యాదలను తిరస్కరించి మనవారు " ఏకయా మాఘ వేద్గాకిత్యాది— ఏకక్షణాద్భవేద్గారి త్యాది— అష్టవర్షాద్భవేద్గారి " త్యాది కల్పిత శ్లోక ములు [illegible] వేదవిరోధముగ వివాహములు జరుగుచున్నట్టివానిని వేదోక్త వివాహములని చెప్పుకొ నుచున్నారు. గాన ముహూర్తనిర్ణయము సయిత మనుచితము. జాతకములలో జెప్పబడిన యాయువునకు సరాటిగా సనేకులు చనిపోవుటయును మూఢవిశ్వాసము వలననే యని స్పష్టమగుచున్నది. అమెరికాలోగల మానస పరీక్షక సంఘమువారొక యురిశిక్ష విధింపబడినవానిని మంచముమీఁద పరుండబెట్టి వానితో " మేము నీశరీర మునందలి రక్తమంతయు నీకేవిధమైన బాధలేకుండ తీసి వేయుదుము ; అనంతర మొకనిమిషములో సుఖముగా నీజీవమును విడిచెదవు " అని చెప్పి వానికన్నులు కప్పి

వేసి వానిపాదమునుండి రక్తము దీయుచున్నట్లు నటిం చుచు క్రిందనుంచిన తొట్టిలో కృత్రిమరక్తమును నిం డించి దానిని వానికి జూపిన యుత్తరక్షణముననే మృతి నొందెను కాబట్టి జాతకములు వ్రాయువారిరీతిగా నొకవిధమైన మూసనహంతకులని సిద్ధాంతమైనది.

ఎవరైనను "నిజము" అను పదము సకు అర్థము "సత్యాసత్యము" అని చెప్పగలరా? ఫలశాస్త్రముల నుబట్టి యొకనికి ఆయువెంత? సంతానమెంత? కళత్ర మెంత? యని యడిగినప్పుడు ఆయువు 70, సంతా నము 4, కళత్రము 2, అని చెప్పెనుకొనుము. అయితే జాతకుడు ముప్పదివత్సరములలో చనిపోయి సంతానమొ కటిమాత్రము కలిగి భార్యయు నొక్కతియే యుండినయె డల శాస్త్రజ్ఞుడు మరల శోధనలుచేసి మనము చెప్పిన దాని కనుగుణ్యముగా గండము భంగము యిత్యాదుల గపరచి చూపును. ఒకడొక కార్యార్థమై వెళ్ళును. కార్య మనుకూలమయ్యేనేని తాను వెళ్ళునప్పుడెన్ని యశుభశకునములు కలిగియున్నను శుభశకునములనే దలంచుగొనును. కార్యభంగమాయెనా యెన్ని శుభశ కునములు కలిగియున్నను యశుభములనే దలంచుకొను ను. ప్రయాణమున కట్టెలెదురుగావచ్చిన- నందుకు

దోషపరిహారార్థముగ వెనుకకు కొన్ని యడుగులు మరలి వచ్చి నిమేషముకూర్చుండి శైలువెడలును. కార్యభంగమయ్యేనేని అందుకు కట్టెలెదురగుటయే- కారణమను కొనును; కార్యమనుకూలమయ్యేనేని వెనుకకు మరలి కూర్చుండినందున దోషపరిహారమాయెనను కొనును. అథవా కట్టెల మోపునకుగల త్రాళ్ళభేదము, కట్లభేదము, పచ్చివి, యెండినవి మొదలగు భేదము, మోసికొని వచ్చినవారియొక్క స్త్రీపురుషభేదము యిత్యాది భేదతరంగములలో తాను సమాధానమునొంది శాస్త్రము నిజమనుకొనును. ఇందుకు మూర్ఖముగాక మరి యేకారణము ?

పూర్వ మొకరాజు జ్యోతిష్కుని బిలిచి నీవెప్పుడు మృతినొందెదవని యడుగగా నాచమత్కార దైవజ్ఞుడు "మహాప్రభూ ! తమ మరణమునకు మూడుదినములు ముందు నేను జచ్చెదన" ని చెప్పెను. ఇందుకా యజ్ఞానుడగురాజు భయపడి యా మోసగానిని తన నగరులోనే- కాపాడనియమించెను. మన మెన్నివిధముల చర్చించిచూచినను ఫలితజ్యోతిషము నష్టమునకును కష్టమునకును కారణమై యున్నదిగాన, దుఃఖదాయకమైన నీ శాస్త్రమును కుపథ్యమునువలె త్యజింపవల

సినదే యని నానిశ్చయము. దానిని నమ్మిత ప్తహృదయులగుటకంటెను, నమ్మకత్తృ ప్త హృదయులగుట శ్రేయస్కరంబు. ఇంకనే గూర్చుండెదను. (అప్పుడు గురుమూర్తిగారు వ్యాఖ్యాన స్థానమునకువచ్చిరి)

---

(13) గురుమూర్తిగారు.

సభ్యులారా! ఇప్పటి భారతీయులు ఆర్షేయ గ్రంథములగు సూర్యార్యబ్రహ్మ సిద్ధాంతాది గ్రంథములకుబదులుగా ముహూర్తచింతామణ్యాది జాలగ్రంథములను రచించి పఠించి స్వార్థులై లోకులను లూటీచేయుచున్నవారు. ఇవన్నియు నించుమించుగా విక్రమాబ్దము 1650 ప్రాంత్యమందు రచింపబడియున్నవి. తాజకనీలకంఠమందు "శాకేనందాభ్రిబాణేందు మితే ఆశ్వినమాస కే శుక్లేష్టమ్యాంవర్షతంత్రం నీలకంఠబుధోకరేత్" అని శాలివాహన శకము 1509 నందుననగా 1587 వ క్రీస్తు శకమునకు సరియగు 1644వ విక్రమ శకాబ్దములో ఆశ్వీజ శుద్ధ అష్టమి దినమందు నీలకంఠపండితుడు తాను రచించినట్లు చెప్పియున్నాడు. జాతకాలంకారమందు "శాకేమార్గణరామసాయుక ధరాసంఖ్యేన భస్యే

తథా । మాసే బ్రధ్నపురేను జాతకమిదం చక్రేగణేశః సుధీః" జాతకాలంకారమును బ్రధ్నపురిగణేశుడు 1535వ శకము అర్థాత్ 1670వ విక్రమార్కశకము శ్రావణమాసమునందు రచియించియున్నవాడు. ముహూర్తచింతామణిలో "గిరీశనగరే వరే భుజభుజేషుచంద్రైర్మితే । శకే వినిరమాదిమం ఖలుముహూర్తచింతామణిమ్" అనగా 1522 శకమునకు సరియగు 1600వ క్రీస్తుశకమందు రచియింపబడినదని చెప్పబడినది. జిజ్ఞాసువులు ప్రతిగ్రంథమును చూచకొనవచ్చును. నేనిచట విస్తారభయముచేత వివరింపలేదు. సభికులు పరిక్షించినచో (600) ఆరువందల సంవత్సరముల క్రిందట నీ ముహూర్తగ్రంథముల గంధమే యుండలేదని స్పష్టమగును. (300) మూడువందల సంవత్సరములకు యీవల శాస్త్రములనేకములు రచియింపబడినవి. అన్నియు నయుక్తములతోడను, సిద్ధాంత గంథములకు విరోధముగను, ఖగోళభూగోళ విద్యకు వ్యతిరేకముగను, స్వార్థయుతముగను, కపటములతోడను నిండినవిగానున్నవి. ఈ కల్పితమిథ్యాజ్యోతిషముయొక్క పునాది రాశిపైనున్నయది. గాన రాశిఫలములను గురించి కొంచెమమీమాంస చేయుచున్నాడను. రాసులు వాస్తవముగా

క్రాంతివృత్తియొక్క పండ్రెండు కల్పితభాగములై యున్నవి. "అథకల్ప్యామేషాద్యా అనులోమం క్రాంతి పాతాంగాత్" (సి॥శి॥ గోలాధ్యాయం) నక్షత్ర సమూహముల నూహించి మేషాదిపండ్రెండు భాగములుగా భాగించబడియున్నవి. కుండలిలో 12 స్థానములు గలిగి అందు ప్రత్యేకమందొక్క రాశి వ్రాయబడి భిన్నభిన్నఫలములు వ్రాయబడుచున్నవి. ఇక్కడ సమితార్థమై కేవల మేడవరాశిని బుచ్చుకొనుచున్నాడను.

"మేషేస్త సంస్థేచ భవేత్కలత్రం క్రూరంనరాణాంచ ఫలస్యభావం" అనగా నేమనుష్యునియొక్క యేడవయింటిలో మేషరాశి పడునో యామనుజుని భార్య క్రూరవతియగును "వృషేస్థ సంస్థేచ భవేత్కలత్రం సురూపమవాక్ప్రీణతం ప్రశాంతం" యేడింట వృషభరాశియైనవో సుందరభార్య; మితభాషిణి శాంతముకలది. "తృతీయరాశౌచ భవేత్కళత్రే కలత్రియుక్తం సుధనంసువృత్తం" యేడవయింట మిథునమైతే వానిపత్ని ధనవతి సదాచరణముగలది. "కర్కేణయుక్తేచ మనోహరాణి సౌభాగ్యయుక్తాని గుణాన్వితాని। భవంతిసౌమ్యాని కలత్రకాణి కలంకహీనాని సుసంయుతాని" యేడింట కర్కరాశియైన- మనోహ

రిణి, సౌభాగ్యవతి, గుణవతి, సుందరి, కలంకరహిత మయినది. "సింహేస్తసంస్థేచ భవేత్కలత్రం। తీవ్ర స్వభావంచ ఫలంచదుష్టం" సింహరాశి యేడింటపడిన తీవ్రస్వభావ- దుష్టయగును. "కన్యేస్త సంస్థేచ భవేత్సుదారాః। సురూపదేహా స్తనయైర్విహీనాః" యేడింట కన్యయైన- సుందరి, తనయులులేనిది. "తులేస్త సంస్థేగుణగర్వితాంగ్యో భవంతినార్యో వివిధప్రకారాః" యేడింట తులారాశిలో గర్వితయుతయై వివిధప్రకారముగ నుండును. "కీటేస్త సంస్థేచ వికలాసమేతా। భవేచ్చభార్యా కృపణా నరాణాం" ఏడింట వృశ్చికమున్నయెడ- వికల- కృపణత్వములుగలది. "చాపేస్త సంస్థేచ భవేత్కళత్రంనృణాంసుదుష్టం విగతస్వభావం విన స్తలజ్జం పరదోషరతం। యుద్ధప్రియందంభస మన్వితంచ" యేడింట ధనురాశిగలిగిన సతిదుష్ట-లజ్జాహీన కలహప్రియ; దంభముగలది. "ఘటేస్త సంస్థేచ భవేత్కలత్రం నృణాంసుదుష్టం విగతస్వభావం దేవద్విజానాం సతతప్రహృష్టం। ధర్మధ్వజం సత్సుకమానమేతం" యేడింట కుంభరాశియైనచో మంచిభార్య, దుష్ట-స్వభావరహిత - దేవబ్రాహ్మణప్రసన్న - ధర్మధ్వజ - సజ్జనులను క్షమించునది. (ఇచట పరస్పర విరోధముగలదు)

" మీనే స్త సంస్థేచ వికారయుక్తం భవేత్కలత్రం కుమతిం కుపుత్రం " యేడింట మీనరాశిపడినచో వానిభార్య వికారిణియై — దుర్బుద్ధియై — కుపుత్రవతియై యుండును. (సమీక్ష) లోకములో బహుమంది మరణ పర్యంతము పరిణయమే లేక చనిపోవుచున్నారు. అట్టివారికి యీరాశి ఫలమేమియు గలుగదు అయినను ప్రతిజాతకము అథవా కుండలిలో నీఫలముండక తీరదు. స్త్రీలకును యీరాశి ఫలములున్నవి. వారికి భార్యలెవరు ? ఫలశాస్త్రకర్తల కేటువంటి మతిభ్రమగలిగినదో జూడుడు ! స్వార్థులకు తప్పక మతిభంగము కలుగవలసినదే. ఇట్టివారికి యథార్థవాదులని పేరు. భూలోకమున నాకుమారుడు నాదౌహిత్రుల యొక్క జన్మదినములను తెలియజేయు ఫలశాస్త్రజ్ఞులకు, ఐదువందల రూప్యములు బహుమతి జేయుదునని ప్రకటించిన ప్రతిజ్ఞను యీయథార్థవాదులుగాని, వారి గురువులుగాని, నేటివరకును జయించలేక తమ్మును తామే స్తోత్రముచేసికొనుచు దొంగలువలె దాచుకొన్నారు. సిద్ధాంత శిరోమణి యందు " కులాలచక్రభ్రమివా మగత్యా- యాంతో నకీటాంఇవ భాంతియాంతః " అనగా కుంభకారుని యొక్క చక్రభ్రమణము దానిమీదగల కీటకమునకు

తెలియనివిధముగ, మనకు భూభ్రమణము తెలియుదని యును, ఆర్యభట్టీయమునందు " అనులోమగతిర్నౌస్థః పశ్యత్యచలం విలోమగం యద్వత్ । అచలానిభాంతి తద్వత్ సమపశ్చిమగానిలంకాయామ్॥ " అనగా నోడలో గూర్చుండి సముద్రప్రయాణము చేయువారికి తాము స్థిరముగ నున్నట్లును, భూభాగము కదలునట్లును దోచులాగున, సూర్యుడు స్థిరముగ నుండియు పడమట పోవునట్లును భూమి తిరుగుచుండియు స్థిరముగనున్నట్లు దోచునని చెప్పబడియుండగా, ఫలజ్ఞానులు తమ దివ్యజ్ఞానముచేత భూస్థిరత్వమును సూర్యగమనమును సాధించుచున్నవారు. ప్రపంచములో ప్రతిమానవుని జీవనచరిత్రను పరిక్షించితిమేని అందిద్దరికైన—నేకవిధమున నుండదు. అనంత జీవులకు ననంతభేదములతో గూడిన ఫలానుభవములుండును. ప్రపంచమున సరాసరి నూటపదికోట్లు (1100000000) మానవులుగలరు. ఫలశాస్త్రజ్ఞులు సెకండున కొకటి వంతున కల్పించినను 518400 కంటె నధికముగ ముహూర్తములను సృష్టింపజాలరు. ఈ యల్పలగ్నములతో నెట్లు ఫలమును దెలియవలయును ? ప్రతివాని జీవనచరిత్రయు భిన్నముగ నుండుటచేత నొకమానవుని కుండలి వలె మరియొకని కుండగూడదు. గనుక నీశాస్త్రములు

కల్పితములై మిథ్యలై దుఃఖము సుఖముల రెంటిని జూపు చమత్కారముగలదై మానవుల భ్రమింపజేయుచు బహులయనర్థములకు నాధారమై యుండుటచేత దీనిని నాశనముచేయుట కంగీకరించుచు విరమించుచున్నాడను. (అప్పుడు కాళిదాసుగా రుపన్యాసమివ్వ ప్రారంభించిరి)

---

## (14) కాళిదాసుగారు.

సభికులారా! ఫలశాస్త్రములలోని చమత్కారమంతయు సుఖదుఃఖముల రెంటిని జూపుటయైయున్నది గాన, నది సత్యశాస్త్రమని భ్రమగల్గుచున్నది. ఉదాహరణముగా మేషరాశి ఫలముజూడుడు! "ధనవాక్ పుత్రనానుగ్రః ష్కోప కారణేరతః । ధర్మకర్మసమాయుక్తః సుశీలో రాజవల్లభః । గుణాభిరామఃసతతం దేవబ్రాహ్మణపూజకః । క్రోధశాకల్యభోక్తాచ తామ్రవిశ్రుతలోచనః । శూరః శీఘ్రప్రసాదీచ కామీదుర్బలజానుకః॥" యిత్యాది—మేషరాశిగలవాడు ధర్మకర్మయుక్తుడట! కామాతురుడట! శూరుడట—మరియు దుర్బలుడట! క్రైస్తవులేమి—మహమ్మదీయులేమి—కటికవారలేమి—కన్నపుదొంగలేమి, యీ మేషరాశిగలిగి యున్నవారెం

దలోగలరు. వీరియొక్క జీవహింస కర్తచేత సకలధర్మ ములు నశించును. వారివిషయమున నీ మేషరాశియొక్క ఫలమేమయ్యెను? జాతకాభరణమునందు రాశినిబట్టి మృత్యుసమయము నియమింపబడినది:— "ఆయుస్తస్య వినిర్దేశ్యమిత్యాది" మేషరాశివాడు కార్తిమాసబహుళ నవమీ బుధవారమున జచ్చును "వైశాఖే శుక్లప క్షేత్యాది, మాఘమాసే నవమ్యాంచేత్యాది, ఫాల్గుణస్య సితేపక్షేత్యాది, చైత్రే కృష్ణ త్రయోదశ్యామిత్యాది, జ్యేష్ఠమాసేత్యాది, ఆషాఢస్యాసితే పక్షేత్యాది, శ్రావ ణస్యాసితే పక్షేత్యాది, భాద్రమాసేత్యాది, అశ్వినస్యాసి తేత్యాది" ప్రమాణములవలన వృషభరాశిలో జన్మించిన వాడు మాఘశుద్ధ నవమి శుక్రవారము రోహిణీనక్షత్ర మందును, మిథునరాశివాడు వైశాఖశుద్ధ ద్వాదశీ బుధ వారము మద్యాహ్నము హస్తానక్షత్రమందును, కర్కరా శివాడు మాఘశుద్ధ నవమీ శుక్రవారము రోహిణీనక్ష త్రిమందును, సింహరాశివాడు పాల్గుణశుద్ధ పంచమీ సోమవారము మధ్యాహ్నమున నీటినడుమ జచ్చునని, కన్యారాశివాడు చైత్రబహుళ త్రయోదశీ రవివారము నను, తులారాశివాడు వైశాఖ కృష్టాష్టమీ గురువా రము ఆశ్లేషా నక్షత్ర పూర్వప్రహారమందును, వృశ్చిక

రాశివాడు జ్యేష్ఠశుద్ధ దశమి బుధవారము హస్తానక్ష త్రమందును, ధనురాశివాడు ఆషాఢశుద్ధ పంచమీ శుక్రవారము హస్తానక్షత్రమందును, మకరరాశివాడు శ్రావణశుద్ధ దశమి మంగళవారము జ్యేష్ఠా నక్షత్ర మందును, కుంభరాశివాడు భాద్రపదశుద్ధ చవితి శని వారం భరణీ నక్షత్రమందును, మీనరాశివాడు ఆశ్వీజ శుద్ధ విదియ గురువారం సాయంకాలం కృత్తికా నక్షత్ర మందును చత్తురు. (సమీక్ష) జాతకములలో వానివాని యాయుప్రమాణమును చూడుడు ఆనాటికే దినము వచ్చునో శోధించుడు! అథవా ప్రతివాని మరణసమ యమును పరీక్షించుడు! అప్పుడు దీనియసంభవమును మిథ్యయు స్పష్టమగును. మనుష్యున కీఫలశాస్త్రము— పంన్రెండు రాసులను బట్టి పంన్రెండుదినములు మరణసమ యములను విధించియున్నది. ఈ నియమితమగు కాల ములందు మాత్రమే మనుష్యులు చావవలయును. సంవ త్సరములో శేషించిన 348 దినములలో నెవరును జావ కూడదు. లోకమున ప్రతిదినమును చనిపోవుచుండుట ప్రత్యక్షముగ జూచుచున్నారము. మరియొకవింతను మీకు జూపుచున్నాడను. ఈ జాతకాభరణ బ్రహ్మ మువ్రాసిన నొసటివ్రాతను మానసాగరీయను గ్రంథబ

హ్మాము తుడిచివేసి "కార్తికేత్యాది" మేషరాశివాడు– కార్తిక శుద్ధ చవితీ మంగళవారము భరణీనక్షత్రమునను "పౌషమాసేత్యాది" మిథునరాశివాడు పుష్య బహుళ అష్టమీ బుధవారము ఆర్ద్రానక్షత్రమందును, కర్కాటరాశి వాడు "ఫాల్గుణేత్యాది" ఫాల్గుణ శుద్ధ చతుర్థమందును, సింహరాశివాడు "శ్రావణేత్యాది" శ్రావణశుద్ధ దశమీ భానువారమునను, కన్యరాశివాడు 'భాద్రపదేత్యాది' భాద్రపద శుద్ధ నవమి బుధవారమునందును తులారాశి వాడు 'వైశాఖేత్యాది' వైశాఖ శుద్ధ త్రయోదశి శుక్ర వారము సంధ్యాస్తము శతభిషానక్షత్రమందును, వృశ్చిక రాశివాడు 'జ్యేష్ఠమాసేత్యాది' జ్యేష్ఠబహుళ యేకా దశీ మంగళవారము అనూరాధ నక్షత్రమందును, ధను రాశివాడు 'ఆషాఢేత్యాది' ఆషాఢ శుద్ధ పాడ్యమి గురు వారం హస్తానక్షత్రమందును, మకరరాశివాడు 'కార్తికే త్యాది' కార్తిక శుద్ధ పంచమి శుక్రవారం శ్రవణనక్షత్ర మునందును, కుంభరాశివాడు 'మాఘమాసేత్యాది' మాఘ శుద్ధ విదియ గురువారము ఉత్తరాభాద్రమునం దును, మీనరాశివాడు 'మాఘమాసేత్యాది' మాఘ శుద్ధ ద్వాదశీ గురువారం ఉత్తరాభాద్ర నక్షత్రమందును చావవలసినదని విధించెను. ఇకదీని గణితజ్ఞానమును

సమీక్ష చేయుటకు సభికులకే విడిచిపెట్టుచున్నాను. ఈ పరస్పర విరోధముల చక్కపరచుటకు మాత్రలోక మునచ్చినది.

ఒకతూరి నేను విదేశయాత్రకు వెళ్ళునప్పుడు ఫల శాస్త్రివేత్తవచ్చి "యిప్పుడు వామపార్శ్వయోగినీ గనుక తత్కాంతరము దానమిచ్చవల యునని సలహాయి చ్చెను. నేనాపిశాచి నెటులైన దూరముపోనివ్వవలయు నని దానమర్పించిపంపించితిని. మరియొకడువచ్చి "పృష్ఠ తో దక్షిణేవాపి యోగినీ గమనేహితా। వామసమ్ముఖ యోర్నేష్టా వాయ్యుమేవం విచింతయేత్॥" (విజయకల్ప లత) అని చెప్పి మా బంధువులవలన నాప్రయాణభం గముచేయించెను. కొంతకాలము తరువాత నాడటుచె ప్పినశాస్త్రియే- వామయోగినీనాడే ప్రయాణమయ్యెను. అప్పుడు నేనాతనితో "మీకు యోగినీవిచార మక్కర లేదా" యని యడుగగా నతడంనులకు "యోగినీసు ఖదా వామే పృష్ఠే వాంఛితదాయినీ। దక్షిణే ధనహంత్రీ చ సమ్ముఖే మరణప్రదా" యని చెప్పి శీఘ్రబోధలో వామయోగిని సుఖకారమని చెప్పబడినదనెను. చూచి తిరా వింతను? సర్వాలుకు శుక్రదోషములు కల్పించి ముహూర్తచింతామణ్యాది గ్రంథములలో వ్రాయబడినది

గాని, యాకల్పిత జాలగ్రంధములు రచించినవారి గోత్ర జులకు దోషములేదని వ్రాయబడినది. చూడుడు ! “ కశ్యపేషు వశిష్ఠేషుచాత్రి భృగ్వాంగిరస్సుచ ! భారద్వాజేషువాత్స్యేషు ప్రతిశుక్రోనదుష్యతి ” (పియూష ధారా) ఓహో ! కశ్యపాది గోత్రములవారికి మిత్రుడై తక్కినవారందరికి శుక్రుడు శత్రువగుటకు కల్పితకారణ మొకటి వ్రాయకున్నందుకు వారిబుద్ధికి ధిక్కారమర్పించుచున్నాడను. పరులచేద్రవ్యము లాగుటకున్ను, జప-పూజ-పార-శాంత్యాదుల మూలమున లూటీచేయుటకున్ను పన్నిన యీకపట మెంతకాలము జరుగవలసి యున్నదో ?

చచ్చుటకు గండాదులు కారణములుగా నుండును. బ్రతుకుటకు గ్రహబలము కారణముగా నుండును చావనూ వచ్చును. బ్రతుకనూ వచ్చును. ఆడది జన్మించనూ వచ్చును- మగవాడు జన్మించనూ వచ్చును. దరిద్రుడు గావచ్చును- మరియు వాడే ధనికుడుగావచ్చును. ఒకయోగమున వర్షమురావచ్చును - మరియొకభంగమున రాకనూ పోవచ్చును. సుఖము కలుగవచ్చును- ఆ కాలమునందే దుఃఖమునకు కారణము లుండవచ్చును. అంతేయు జడములగు గ్రహములు ప్రసా

దించును. దేవుడు లేడు; ఉన్నను వానికధికారములేదు. ఇవి యే ఫలశాస్త్రముయొక్క ముఖ్యసిద్ధాంతములు. చాలమంది యుపన్యాసకులున్నవారు గావున నేనింతటితో ముగించుచున్నాడను.

(చంద్రగుప్తుడు వ్యాఖ్యానపీఠమెక్కెను)

---

## (15) చంద్రగుప్తగారు.

సభ్యులారా! లోకములో నెవరికి జనులనువంచించుటయందెంత నేర్పరితన మెక్కువగలదో అటువంటి ధూర్తులును, కపటులును మహాజ్ఞానులగుచున్నారు. వారివలన మోసపోయిన యమాయికులందరు నెక్కువ స్వానుభవజ్ఞులై యున్నారు. కొద్దినాళ్లక్రిందట నొక దివ్యజ్ఞానియను ఫలశాస్త్రజ్ఞుడు, ముహూర్తములు కర్మ ఫలమును బోగొట్టజాలవుగాని, శుభకార్యములు శుభ ముహూర్తములలో చేయవలెననియును, మనమీశ్వర ధ్యానాదులు సలుపునపుడెట్లు శుభ్రిపరులై సలుపుదుమో అట్లు మంచిపనులు మంచిలగ్నమున జేయవలయునని యూ మపన్యసించెను. నా ప్రపౌత్రుడందుకు "చెడు ముహూర్తములను సృష్టించినవారెవరు?" యని ప్రశ్న

వేయగా నతనిని యందరుగలిసి బాగుగ మర్దించి పంపి వేసిరి ఇది వారిసభ్యతగా నుండును. శుభ్రిమనునది దేహాత్మల రెంటికిని సంబంధమయినది. బాహ్యశుద్ధి యారోగ్యమునకును ఆత్మశుద్ధి యీశ్వరప్రీతికిని అధవా మోక్షమునకును యావశ్యకములైనవి శుభకార్యము లన్నియు నీశ్వరప్రీతికి పాత్రమైనవి గావున, ప్రతి పనికిని ఆత్మశుద్ధి ముఖ్యమైనది. ఇది గుణకర్తస్వభావ సంబంధ మయినదిగాని ముహూర్తసంబంధమైనదిగాదు. మంచికి మంచిముహూర్తము కావలసినచో చెడ్డకు చెడుముహూర్తము నావశ్యకమయ్యెను. కూర్చుండుట – లేచుట– నడచుట- భుజించుట- పరుండుట యిత్యాది నిత్యకర్మ ములన్నియును శుభకార్యములు వీనికెల్ల ముహూర్తమును వెదకుచు గూర్చుండవలసి వచ్చెను. ఇది కేవల మసంభవము. ముహూర్తశబ్దము కాలవాచకముగా నున్నది. మంచి ముహూర్తమనగా అనుకూలమయిన కాలమని యర్థము. ఈ కారణమునుబట్టియే- గృహ్యా సూత్రములందుత్తరాయణము శ్రేష్ఠమని చెప్పబడియు న్నది. దేవుడు చెడుముహూర్తములను సృష్టించినాడని ఫలితజ్యోతిష్కులు నమ్ముచున్నారు. జీవులకు వారివారి కర్మానుసారము ఫలములనిచ్చుటకు మంచిచెడ్డ ముహూ

ర్తముల యక్కరయుండదు. భూలోక ప్రభువులు సయి తము శిష్టులను రక్షించుటకు మంచిదినములును, దుష్టు లను శిక్షించుటకు దుర్ముహూర్తములును నియమించి యుండలేదు. జీవులెక్కువ ధర్మపరులైన మంచికాలమ నియు, యెక్కువ దుష్కర్మపరులైన చెడుకాలమని సత్స హాచరితోపాథిగా చెప్పబడుచున్నది. "కలిప్రసుప్తో భవతి సజాగ్రద్వాపరంయుగం। కర్మస్వభ్యుద్యత స్త్రేతా విచరంస్తు కృతంయుగం" అని యున్నది. గనుక చెడ్డ కాలమనునది లేనేలేదు. అంతయు మానవుల ప్రవర్త నలో నున్నది. మద్యపానము చోరత్వము మొదలగు పాతకకర్తలకు ముహూర్తములు చూడుడు. "తీక్ష్ణో గ్రాంబుపభేషు మద్య ముదితం" (ముహూర్తచింతా మణి) (పీయూషధారా) "రౌద్రేపిత్ర్యేవారుణే పౌరు హూత్యేత్యాది" "ఉషాశ్వినీ మృగే స్వాతౌ పునర్భే శ్రవణత్రయేత్యాది" (ముహూర్తగణే) ఆర్ద్రా-మఘ- శతభిష- జ్యేష్ఠ- భరణీ- ఆశ్లేష - మూల- పూర్వాషా ఢ- పూర్వాభాద్ర- పూర్వఫల్గుణీ - నక్షత్రములు మద్య పానమునకు శ్రేష్ఠములు. "విశాఖాకృత్తికాపూర్వా మూలార్ద్రాభరణీమఘే । ఆశ్లేషా జ్యేష్ఠయోర్భేషు భౌమేవాశౌకునేబలే । లగ్నేవా దశమేభౌమశ్చౌరస్య

ద్రివ్యలబ్ధయః" ఆహా! స్వార్థపిశాచమా! నీవు మా సంతానముల నంధులను చేసితివా! నీకంటె పాపస్వరూప మెక్కడనున్నది? ఓ దురాచార ప్రవర్తకాచార్యులగు ఫలశాస్త్రవేత్తలారా! మీకంటె నధికమగు స్వదేశ శత్రులెవరు? సత్యనాశములో నేమైన శేషమున్నదా? లోకములోని ప్రతి దుష్టకార్యము చేయుటకును గ్రహములాధారమని వ్రాయబడినందున- జారులు చోరులు- జూదరులు- మొదలగువారందరును తమదుర్గుణములకు జాతకముల నాధారముగా జూపుదురు. జాతకములలో నే యేదుర్గుణములు వ్రాయబడియుండునో అట్టికుకర్తలనెల్ల నిర్భయముగ నాచరించి పాతకులగుచున్నవారు. ఒకడు తన్ను తనమిత్రులు జారత్వవిషయమై యాక్షేపింపగా వాడు తనజాతకములో తనకు రెండువందల భార్యలు గలరనియు నది యీమార్గమున ఫలించుచున్నదని చెప్పి, యిది తన దోషముగాదనియు గ్రహబలమనియు సమాధానమిచ్చినాడు. ఇట్టి శాస్త్రము ధర్మరక్షణము చేయుచున్నదని వాదించువారి నేమనవలయును? ఈ మహానుభావులు భావికాలమున రాబోవు గొప్ప ఆపదలను తెలిసికొని అట్టిప్రమాదములనుండి జనులను తప్పించువారివలె "ఈ సంవత్సర మష్టగ్రహకూ

టము, సప్తగ్రహకూటము, షడ్గ్రహకూటము, దేశ మున మహాఘోరము సంభవించును. రెండురూపాయ లుకు కడవెడు నీరమ్మబడును. అగ్నివరషము గురి యును. రాజులు రణకేళిలో మడియుదురు" ఇత్యాది భయంకరమగు ప్రకటనల వెల్లడిజేసి లోకులను భయ కంపితులను చేయుదురు. ఏ ఫలశాస్త్రివేత్తయయినను కలకత్తాలో గలిగిన భూకంపమునుగాని, మగరాజునందు పరిదర్శనమునకు నిప్పంటుకొనుటనుగాని, మంగపట్టణము వద్ద నినుపదారియొక్క యనాహతమునుగాని, మహీసూ రునందు రాజమందిరము దగ్ధమయిన సంగతినిగాని, గాజీ పుర డిస్ట్రిక్టు వీరనౌగ్రామమునందు సంభవించిన యుల్కా పాతమునుగాని, బొంబాయిలో ప్లేగుయొక్క యుద్రేక మునుగాని, దక్షిణ హైదరాబాదు అతివర్షమున జలప్రళ యములో దిగులుకొనుటనుగాని, యిటువంటి ఘోరమగు నాపదలలో నెద్దానినైన ప్రకటించి హెచ్చరించి రక్షించి నవాడు గలడా ? వీరు దేశమునకు చేసిన మేలుజూపె దరా ? అథవా అనర్థములనుగురించి లెక్కపెట్టగలరా? దీనివలన హిందూదేశమున నెన్ని వెఱ్ఱితలకాయలు పరిబలుచున్నవో గణింపగలరా ?

భూలోకములో నొకస్త్రీకి యొకడే పుత్రుడుం

డెను. ఆమె తన కుమారుని కుండలిని జ్యోతిష్కునకు జూపగా నాతడు "నీపుత్రుడింకొక వారములో మృతి నొందు" నని చెప్పెను. ఆమె మిక్కిలి భీతాత్మయై మరియొకరికి జూపెను. యా రెండవవాడును యీదుష్టశాస్త్రము ననుసరించి మొదటివాడు చెప్పినది యధార్థమనెను. అందుకా మూర్ఖస్త్రీ వ్యసనాక్రాంతురాలై, తనపుత్రుని చావును తానుచూచి యనంతరము బ్రతికి యుండుట వ్యర్థమని భావించి, యారాత్రి నెవరికినిఁ దెల్పక ఆత్మహత్యగావించుకొని చచ్చెను. ప్రవేశపరిక్షకు చదువుచుండిన కుమారుఁడిప్పుడు సౌఖ్యముగ నున్నాఁడు. ఇటువంటి శాస్త్రమందు విశ్వాసముంచుట శ్రేయమని - పురుషార్థమని - పుణ్యమని - యే మహాపాతకుఁడు చెప్పునో నేనూహింపఁజాలను. ఈ ఫలశాస్త్రజ్ఞులు స్వార్థసాధన నిమిత్తమై చేసెడు కృత్యములు వివరింపవలయునన్న గొప్ప భారతమగును.

నా సోదరులారా! మీకు సంశయముఖ్యకారణమింకను సమూలము నివర్తిగాకున్నచో నేజెప్పజాలను.

(అప్పుడు వేదభూషణరావుగా రుపన్యసింప సిద్ధమైరి)

---

## (16) వేదభూషణరావు.

పితృమహాజనులారా! నేను భూలోకములో నున్నప్పుడు నా పొరుగువాడగు పశుపతివర్మగారి యింటిలో వారికూతురగు కాంతిమతియొక్క వివాహమును గురించి యాదంపతులకు జరిగిన సంభాషణమును సభవారికి నివేదించుచున్నాడను.

(పశుపతివర్మ కొన్ని జాతకములు తనముందుంచుకొని బొమ్మలతో నాటలాడుచున్న కుమార్తెను జూపుచు భార్యహరిద్రాదేవితో చెప్పుచున్నాడు)

పశు:— ఈ యభాగినీదేవి మనకడుపున బుట్టి మనవంశమున కళంకమంకురింపసాగెను. ఈ దౌర్భాగ్యపు కూతురుతప్ప మనయింట నెవ్వరికిని యెనిమిదిసంవత్సరములు దాటినతరువాత వివాహము చేయబడలేదు. ఈ జ్యేష్ఠాదేవి పుట్టి మనప్రతిష్టను మట్టిపాలుచేసినది. చూడుము — నాశరీర మీచింతచేత క్రమక్రమమున కృశించుచున్నది. కంటికి నిద్రయెట్టిదో తెలియదు. ఆకలి మందగించిపోయినది. ఈ పట్టణములోగల మంచి వరుల జాతకపత్రములన్నియు మనయిల్లునిండిపోయినప్ప

టికిని యీపాదపుత్రిక పత్రికతో నొకటియు విధి కలియుచున్నది.

హరి:—ఏమీ! దీనికి విలువగల నగలలంకరించుకొను భాగ్యములేదా?

పశు:— నీకు పిచ్చియేమి? అలంకారములు గోరెదవు! నీ బిడ్డకుగల గ్రహగతులనుబట్టి దానికి నెండిన కొట్టెముక్కనయితము లభించుట దుష్కరమై యున్నది. అంతమాత్రము దొరకిన– విదే– భాగ్యవతి యని సంతసింపవచ్చును. నేనెంతో ధనవంతుల తనయులయొక్కయు గొప్పగొప్ప పదాధికారుల పుత్రులయొక్కయు జన్మపత్రములు చూచినను దేనితోను కలియకున్నది.

హరి:—అయ్యో దురదృష్టమా! (అని నెత్తిన గొట్టుకొనుచున్నది)

పశు:—ఈ కాంతిమతి గతవర్షమున రోగముతో చనిపోవుచుండగా నేను వృథా వైద్యులకు నూరారులు కొల్లబెట్టి రక్షించినది నాయపరాధము. అప్పుడే చచ్చియుండిన నెంత బాగుండెను.

హరి —(కన్నులనీరుగార్చుచు) హా పుత్రీ! నీ దుర్భాగ్యమునకే మందును? అయ్యో! నాపురాకృత

ఫలమిట్లుండగా విన్నవలసినదేమున్నది? బిడ్డా! నీవ్రాత ఫలమిట్లున్నదా? నీ వెంతో ధనవంతునికాంతవై యుండగా జూచి సంతోషించు భాగ్యము నాకు లేక పోయిన దే! హా దైవమా— నన్ను గొడ్రాలుగా నేల జేయక పోతివి? అయ్యో కూతురా! నీ తల్లిదండ్రులను దుఃఖములపాలు జేయుటకై నీవు మాకడుపున బుట్టితివా? అహో— నీరూపమునకు దగినవరుని యీపాపపు దైవమేల చూపకపోయెను? నీయట్టి సుందరాంగినిపొందిన వాడింద్రుని సముడని భావించియుంటినే! మీతండ్రి యిట్టి పాపపు మాటకాడునని నే స్వప్నమందైనను దలంచి యుండనే! ఆ దేవుడా! యిదెంతటి యభాగ్యము? కటకటా — యీకాంతిమతికి మృత్యురూపమగు నీపాపగ్రహము లెక్కడినుండి వచ్చియుండును? ఏమి నానోముఫలము? ఈశ్వరా— నీచిత్తమిట్లుండెనా?

పశు:—ఓసీ! దీనిరూపమేమి గాల్పనా! భాగ్యములేనట్టి సౌందర్యముతోనేమి ప్రయోజనము? నేనే కాదు- దీనిజాతకములో గ్రహచారమునుగురించి యే జ్యోతిష్కుని యడిగినను కలియవనుచునే జెప్పుచున్నారు.

నేను:—(వేదభూషణరావు) అయ్యా! తాము త్తచేతులతో వెళ్ళిన జాతకవిధులెట్లు మిళితములగును?

పశు:—వేదభూషణంగారూ ! నేను మూర్ఖుడను గాను ; తాంబూలపుష్పఫలాదులు లేకుండ శూన్యహ_స్త ములతో బోను.

నేను:— వాడిపోవు పూవులతో సిద్ధాంతుల కేమి ప్రయోజనము ? వారికి వెండినృప్పములు చక్రవర్తిగారి బంగారుముద్రలు కావలసియుండును. అందులో తప్పక దేవుడున్నాడు ; దైవజ్ఞులును సంతసింతురు ; గ్రహములును ప్రసన్నములగును. నామాటవిని వానిని లక్ష్మీ జ్యోష్యులకండ్లకు జూపెదరని అన్నిలోపములు చక్కబడి మీకూతురి వివాహము త్వరలోనే ముగియును. మీరు కోరిన వరుని జోడించును.

పశు:— రామరామ ! యెంతమాట !! యేమండీ !— నాకు జ్యోతిష్యము తెలియదా ? నేను అస్ట్రాలజర్ కానా ? మాతండ్రిగారెంతటి విద్వాంసులో మీరెరుగుదురుగదా ?

హరి:—మామామగారిసంగతి నాకున్ను తెలియును వారును పనికలిగినప్పుడు సిద్ధాంతులకు శూన్యనమస్కారాలు జేయక కొంత సమర్పించుచుండిరి. కుక్కవేషంవేస్తే- మొరిగేది రావద్దూ !

నేను:—మొన్న విగళద్దంతాచార్యులకు దామో

దరుని. కూతురను గూర్చినప్పుడు లక్ష్మీసిద్ధాంతిగారి యొడిలో నర్ధశతమానం పడినసంగతి మీ రెరుగరా! వృథా చిన్నదానిని కఠోరవాక్యములతో నొప్పింపక నేమియో సమర్పించుడు! వట్టిచేతులు జోడించితే వారికడుపెట్లు నిండును.

పశు:—మీ రేమి జ్యోతిశ్శాస్త్ర మెట్లుముడచిన సరిపోవుటకు గుండ్రనివి_స్తరి యనుకున్నా రేమి? చూడుడిది దేవదత్తుని జన్మపత్రము. అతనికైదు గ్రామములు గలవు. సంపదకు మేర లేదు ఇందులో మూలానక్షత్రము నాశ్వరకు బాగుండలేదు. ఎవరును రెండుమార్లు చావరుగాని, యెవరైన తమ గ్రహములవలన తాము చావ గోరెదరుగాని, పరులగ్రహములవలన తాము చావునుగోరరు. గాన నేను మరణభీతి గలవాడనకుము. నేను ధీరవీరమగు క్షత్రియవంశమందు బుట్టిన శూరుడను.

నేను:—నిజముగా మీరు ప్రచండ బహాదూరులు, తామింతటి ధీరులైయుండియు మూలానక్షత్రమునకు భీరులైయుండుట వింతగానున్నది. ఈజాతక మెవరిది!

పశు:—ఇది రామవర్ధది. బి. యే. బియల్. ప్యాసు చేసినాడు. ఇతని ఫొటోను జూడుడు!

నేను:—ఇతడు తనచేతులు తన జేబులో నుంచు కొన్నాడు. వకీళ్ళు యీ ాగుండరాదు. వకాలత్వము తో సమానమయిన వృత్తి మరియొకటిలేదు. వకీళ్లెప్పు డును ఆకలితో బాధపడరు.

హరి:—వారికజీర్ణరోగ మందునేమి ?

నేను:—కాదమ్మా— బాగుగా సంపాదించువారని తాత్పర్యము, దిగులుపడకుడు !

పశు:—ఏమయిననేమి ? వానిది జ్యేష్ఠానక్షత్రమై నందుచేత వధువుయొక్క అన్న చనిపోవును.

హరి:—ఆ పాడుజన్మపత్రమును కాల్చివేయుడు. ఆశోకపత్రము మాయింట నుండరాదు.

పశు:—ఇది గురుప్రసాదుని పత్రము. వరుని గ్రిహముకంటెను వధూగ్రహము బలీయమై యున్నది. ఇది పద్మనాభునిది. లగ్నాధిపతి యెనిమిదవరాశిలో నున్నాడు గనుక తప్పక దరిద్రుడగును. వానిబుద్ధి నశిం చును. కీర్తిలేనివాడగును. ఈ జాతకము సూర్యశర్మది. డాక్టరు పనికి ప్యాసుచేసినాడు. అయితే చతుర్థాధిపతి బలములేనివాడై పండ్రెండవ స్థానమునందున్నాడు; గనుక స్థిరవసతి చెడిపోవును. రుణబాధ కలుగును. ఎల్లప్పుడు

రోగపీడితుడగును. ఏది చూచినను విధికలియకున్నది. నేనేమి చేయుదును?

సభాసదులారా! కాలయాపనమగుచున్నది. మనభారతీయ కన్యలపాలిటి మృత్యువగు నీయవనజ్యోతిషమువలన గలిగెడు యనర్థము లిన్నియని యెవరు చెప్పగలరు. ఒక్క వివాహకర్మకే కాదు. మానవుడు జన్మించినదాదిగా దినప్రతిదినమును మరణపర్యంతము నీమూర్ఖసిద్ధాంత నామధారుల నాశ్రయింపవలసిన దుస్థితి సంభవించియున్నది. ఇది బాల్యవివాహమునకు కారణమైనది. బ్రహ్మచర్యమునకు కుఠారమైయున్నది సత్యవిద్యకు గర్భశత్రువైనది. పైనచెప్పిన శాంతిమతి యొక్క దుర్గతిని తలంచుకొన్న నాకిప్పుడును శరీరము జలదరించుచున్నది. యీ పశుప్రాయుడగు పశుపతి వర్తకుడగాక డెబ్బదియేండ్ల ప్రాయపు జమీందారునకు తనకూతురను వివాహముచేసెను. ఆకథను వివరించుటవల్ల ప్రయోజనమేమున్నది. ఈ పాడు ఫలశాస్త్రమును ధ్వంసముచేయుటకు ప్రయత్నించుటలో నాచేతనైనపని చేయుటకు సమ్మతించినాడను. నేగూర్చుండెద. (అప్పుడు అనంతావధాను లుపన్యాసవేదికపై నిలువంబడిరి)

## (17) అనంతావధాలులు.

మహాశయులారా! గణితఫలితములు వేరువేరని వానిలోని విషయమువలననే దెలియుచుందును. ఎట్లనగా—'అ' యను నక్షరము నుచ్చరించుకాలములో నాల్గవ భాగమునకు త్రుటి యనిపేరు. త్రుటి మొదలుకొని కల్పపర్యంతము కాలముయొక్క గణితమును, వికలము మొదలుకొని భగణమువరకు క్షేత్రపరిమాణమును, నక్షత్రములు మొదలు పృథివ్యా గ్రహగోళగతులను గురించిన విషయములును, వీని సంబంధమైన ఘటికాది యంత్రరచనవర్ణనలును, గలిగినది గణిత జ్యోతిషమనబడును. ఇది వేదాంగమగు సిద్ధాంతజ్యోతిషము. ఇందు కొన్ని ప్రాచీనములును ఆధునికములును గలవు. ఆధునిక సూర్యసిద్ధాంతములో "రామ ౩ నంద ౯ జిన ౨౪". యనుశబ్దములు వచ్చుటచేత కృతయుగ కాలమునాటిదని చెప్పబడు సూర్యసిద్ధాంత మిదిగాదని తేలుచున్నది. మరియు, లిప్త- హోరా- కేంద్ర మొదలగు గ్రీకుభాషాశబ్దములుండుటచేత నిది సనాతన సూర్యసిద్ధాంత మొకటియుండి దాని యాధారమున మయుడనువాడు సూర్యాంశ పురుషునిద్వారా తాను గ్రహించినట్లు చెప్ప

కొని సంగ్రహించియున్నాడు. (మహామహోపాధ్యాయ శ్రీపండిత సుధాకరద్వివేదీ ప్రొఫెసర్ సంస్కృత కాలేజి బనారస్‌గారి పంచసిద్ధాంతిక యొక్క భూమిక జూడుడు)

ఫలితజ్యోతిషమను గృహమునకు గ్రహగతుల నెడు బునాదిని వేసియుండుటచేత రెండునొకటియని భ్రమించిరి. గ్రహగతులవలన మనుష్యులకు ఫలము గలుగునని సిద్ధాంతమందు లేదు. రుద్రదత్తుగారు చెప్పి నట్లు ప్రాచీనకాలమున నైదుసంవత్సరములకొకతూరి పం చాంగములు గుణించుచుండిరి. మహాభారత విరాటప ర్వములో "తేషాంకాలాతిరేకేణ జ్యోతిషాంచవ్యతిక్ర మాత్ । పంచమేపంచమేవర్షేద్వౌమాసావుపజాయతేః" యిత్యాదిగా భీష్ములు దుర్యోధనునితో- పాండవులు తన తో యుద్ధసన్నాహము చేసినప్పుడు వారియొక్క పండ్రెం డుసంవత్సరముల వనవాసము దాటినదాయను విషయ మును చెప్పిరి. వారు లెక్కించిన యీగణనచేత పూర్వ మైదు సంవత్సరములకొకతూరి కాలపత్రములు వ్రాయు చుండిరి. ఇప్పుడు సౌర-బ్రాహ్మ-ఆర్య యను మూడు విధముల తిథిపత్రములు గలవు. ఇది యాధునిక గ్రంథ మహిమ. ఇందు యేకాదశ్యాది తిథులను వ్రతాదు లను గురించిన కలహము లుత్పత్తియైనవి.

ఫలితగ్రంథములనగా:—ఇష్టకాలముయొక్క గ్రహస్థితులు విచారించి భూతభవిష్యద్వర్తమాన కాలములయొక్క శుభాశుభములు తెలుపుచున్నవి. ఇవి సంహిత—హోర యను రెండువిధములు. గ్రహస్థితులను బట్టి సుభిక్ష—దుర్భిక్ష—సువృష్టి—అనావృష్టి—అగ్నిభయ—ఉపద్రవములు మొదలగువానిని దెలుపునది సంహిత. హోరాయనగా— నొకప్రాణియొక్క జన్మకాలమందలి గ్రహముల స్థితినిబట్టి సమగ్రజీవనముయొక్క వృత్తాంతమును దెలుపునది కొందరీ సంగతియు దెలిసియు స్వార్థపరులై హోరముచేత కల్లలు బోధింతురు. ఇట్టివారికే [illegible] మూర్ఖులని పేరు.

మనమొక ఫలశాస్త్రజ్ఞుని "అయ్యా! ఫలశాస్త్రము నిజమైన యెడల మిథ్యలేమియు నుండగూడదు గదా" యని యడిగిన నతడు "వైద్యశాస్త్రరీతిగా నవుషధములివ్వబడుచున్నవి ; రోగములన్నియు నిమ్మళించవు ; దానినిబట్టి యాయుర్వేదము బద్ధమని చెప్పవచ్చునా?" యని బదులుచెప్పెదరు. వైద్యశాస్త్రము వస్తుగుణమును బోధించుచున్నది. అవుషధములు జీవశక్తిగల రోగికి బలముగలిగించుచున్నవి. జీవశక్తిలోపించిన రోగికి బలమునియ్యవు. అందు, పదార్థములలోప

ముగాని, వానిగుణములను దెల్పు శాస్త్రములో యస త్యముగాని యేమాత్రములేదు. వ్యాధిబలము-యౌష ధబలమునున్ను, యౌషధబలము - వ్యాధిబలమునున్ను జయించుచుండును.

సున్నమును పసుపును నీటినిఁజేర్చిన వసంతమగు నని వైద్యశాస్త్రము చెప్పినదాని నెవరైన ప్రత్యక్షముగ మిథ్యచేయగలరా ? వైద్యశాస్త్రములో నొకచోట చిం తపండు పుల్లగనుండునని వ్రాసి మరియొకచోట నుప్పగా నుండునని వ్రాసియుండలేదు ప్రకృతి పదార్థగుణమును దానిబలమును దెలుపునట్టి వైద్యశాస్త్రమునకును, కంటి కగుపడని యదృష్టమును దెలుపు ఫలజ్ఞాన గ్రంథమునకెం తమాత్రము సంబంధములేదు. ఇట్టి పనికిమాలిన యుప మానములతో మానవులను సమాధానపరతురు. పామ రులిందుకు భ్రమింతురు. ఔషధములు పుచ్చుకొనున ప్పుడు గూడను. యీ వైద్యునివలన అథవా నీ యౌష ధమువలన నీ వ్యాధి నివారణమగునా ? యని ఫలశా స్త్రజ్ఞుల నడుగుదురు. ఫలశాస్త్రజ్ఞుల సలహాల నను సరించి చేసిన చికిత్సలెన్నియో వ్యర్థములగుచుండగా మనము చూచుచున్నారము. గనుక నీశాస్త్రమునకు ప్రమాణముగ వైద్యమునుబోల్చుట నెంతటియవివేకము ?

లోకములో-నే- జ్యోతిష్యుడైన స్త్రీక్రింది ప్రశ్నలకు సదుత్తరములు నిచ్చినదో- నాతనిని దైవజ్ఞుడని నిస్సందేహముగ నమ్మవలయును. (1) నేనీదిన మెంతసంపాదించితిని ? అందలి నాణ్యముల సంఖ్యయేది ? (2) నా కుమారునకు నే పెట్టదలంచిన పేరుయేది ? (3) రాత్రి నాస్వప్నమందేమి జరిగినది ? (4) గర్భిణీ స్త్రీ యేకాలమందు వెచ్చట యేశిశువును ప్రసవించును ? (5) పోయిన జంతువు చచ్చినదా ? బ్రతికినదా ? చచ్చియున్న నెట్లు గోనలముందు యే కాలమందు ? బ్రతికియున్న నెచ్చట గోస్థితిలో నున్నది ? యెట్లు లభించును ? (6) పోయిన వస్తువేది? దొంగయెవరు ? యే కాలమున దొంగలించెను? గో మునవస్వాడు ? పేరేమి ? యెక్కడగలడు ? వస్తువుల నేమి చేసినాడు ? దొరకునా ? లేదా ? యేవిధమున దొరకును ? యెంత కాలములో ? (7) నాజాబు నాస్నేహితునికెప్పుడు చేరును ? యేమి వ్రాసితిని ? వ్రాసినప్రకారము జరుగునా ? నాకెప్పుడు బదులువచ్చును? యేజాబున యేయింకితో యెన్నిపజ్తులువ్రాయును? (8) మాగ్రామమునందు చైత్రశుద్ధ పాడ్యమి మొదలు నేటివరకు జన్మమెత్తినవారెందరు ? చచ్చినవారెందరు ? ఉన్నవారిలో స్త్రీలెందరు ? పురుషులెందరు ? (9) ఈలోకము

లోగల నానామతములలో నిజమైన మతమేది? మీరవలంబించిన మతము సత్యమైనదని మీఫలశాస్త్రమువలన పరిక్షింపబడినదా? (10) నేపుట్టిన దినమేది? స్థలమేది? నాజన్మదినమున మాకుటుంబమున నెందరుండిరి? ఇంకననేకమైన ప్రశ్నలిదివరకు నుపన్యసించిన వ్యాఖ్యానములందు గలవు. వీనికి బదులుఁ జెప్పకున్న నాతఁడు వంచనచేయు పాతకుఁడగును.

ఒకడొక పశువును బోగొట్టుకొని దైవజ్ఞునివద్దకు పోయినప్పుడు దొరకును అథవా దొరకదు అని చెప్పును. దొరకునన్నప్పుడు నమ్ముకొని యూరకుండవలయునుగదా? వెదుకవలయునన్న - అడుగవలసినయక్కర యెందుకు? దొరకదన్న నిరాశగనుండవలయును. అట్లున్న చిక్కుట దుర్లభమగును. పురుషార్థమువ్యర్థమయ్యెను. పూర్వమొకప్పుడొక గ్రామములో భవిష్యముతప్పక చెప్పువారొకరు గలరని విని నేనును నాస్నేహితులును వెళ్ళితిమి. విచారించగా నొక శూద్రుడు కొన్ని వారములనుండి యిట్లు చెప్పుచున్నాడని తెలిసి, యతనిని జూడగానే మాకు మార్గమున సంభవించిన నొకరహస్యముచెప్పెను. అప్పుడు నాస్నేహితులలో నొకరు నా జ్ఞానముచూడుడు! ఇతడింక కొద్దిరోజులలో చచ్చునని చెప్పెను.

అదేమని యడుగగా "నిది అతీంద్రియ జ్ఞానము. ఇది యొక రోగప్రభావము.— యశ్చపశ్యత్యదృశ్యాన్ వైద్యః శ్యాన్ యశ్చనపశ్యతి। తావుభౌపశ్యతః క్షిప్రం యమక్షయమసంశయం" అను నాయుర్వేద ప్రమాణముచొప్పున, నితడు త్వరలో జచ్చునన్నట్లే యతడు రెండువారములలో మృతుడయ్యెను, గాన భవిష్యము తప్పక చెప్పుట మృత్యులక్షణముగా నుండునుగాని శాస్త్రిజ్ఞానము గానేరదు. నేనింక విరమించెదను.

(అప్పుడు పరమానందు లుపన్యసింపసాగిరి)

---

## (18) పరమానందులు.

సభ్యులారా! నేనెవరైననొక యింజనీయరుతో "అయ్యా! నాలుగైదు రూప్యములు మీకిచ్చెదను; ఆ పర్వతమును నావద్దకు పిలువవలయును. నేను చల్లని నీళ్ళు చల్లని గాలిని త్రాగవలయు" నని యడిగినచో, నాబుద్ధినిగురించి మీరేమని తలంతురు? నాసమానము బుద్ధిమంతుడు లేడని యనుకొనెదరా? నాలుగు... లకు కర్మఫలమును పోగొట్టుకొనుటకు యత్నించు... పోగొట్టువాడు నెంతటి బుద్ధిశాలులనవచ్చును?

ఫలశాస్త్రజ్ఞుల విషయమై యేమిచెప్పెదరు ? శుభము హూర్తమును వెదుకుటకు అర్థమేమో నాకువిప్పి చెప్ప వలయునని ఫలితజ్యోతిష్యుల నడుగుచున్నాడను. విష ముత్రాగుటయు గ్రహచారము - దానివలన నాయువు క్షీణించుటయును గ్రహచారము. మందు బుచ్చుకొను టయు గ్రహచారము- దానిచే బ్రదుకుటయును గ్రహ చారమే. సోదరులారా ! ఫలశాస్త్రమును నమ్మక దానిని దూరముగ నుంచుటయు గ్రహబలమేయని యేల చెప్పకూడదు ? మనువును వసిష్ఠులును స్త్రీలకు ఋతు మతియైన మూడుసంవత్సరములకు వివాహము చేయవల యునని చెప్పియున్నారు. శుశ్రుతకారుడును స్త్రీలకు ముప్పదియారు ముట్లుడిగినతరువాత వివాహము చేయువ లయునని చెప్పియున్నాడు. వేదమునందును యుక్తవ యస్సు వచ్చినతరువాత స్త్రీ తనపతిని వరించవలెనని చెప్పబడినది. లాజాహోమము చేయునప్పుడు వధువు మంత్రముల పఠించుచుండవలసిన విధియే- దీనికి ప్రమాణ ముగా నున్నది. యుక్తవయస్సురాని స్త్రీలెట్లు వేద ములు పఠింతురు ? ఇట్టి శృతిస్మృతి విరుద్ధమైన బాల్య వివాహములుచేసి, దేశమును దుష్టస్థితికి దెచ్చినది గ్రహ చారముగదా ? వరులమెడలలో జయమాలలువేసి ప్రేమ

రసప్రవాహమున మునిగి సంతోషించు స్వయంవర వివాహములను నాశనపరచినది గ్రహములుగావా ? మన పితృలోకమహాసభకు గ్రహబలములేకున్న నిది నడచునా? రాతివిగ్రహములకు నయితము గ్రహచారములను బట్టి ఫలములు నిర్ణయించుచుండ లేదా ?

హిందూ దేశములకు యూనానీ రాజదూతయగు మెగస్థినీజ్ 312 క్రీస్తుశకమున వచ్చినప్పుడు యీగ్రహచారములుండలేదు. చీనాయాత్రికుడగు ఫాహియానుడు 400 సంవత్సర ప్రాంత్యమున హిందూ దేశమునకు వచ్చెను. అప్పుడును కుండలీలనుబట్టి వివాహములు చేయుచుండ లేదు. తురుష్కస్థానమునుండి అలబరూనీ 1020 సంవత్సరమున వచ్చెను. అప్పటికీ గ్రహసంచారము మానవులనడుమ వ్యాపించినది. ఫలశాస్త్రములకు తండ్రియగు వరాహమిహిరుడు 506 సంవత్సరమున జన్మించెను. మొదట యవనులలో నిదియున్నప్పుడు స్త్రీసిగాదలంచిన చంద్రగ్రహమును హిందువులట్లే తలంచినయెడల భాగవతములోని చంద్రుడు గురుపత్నిని బొందిన చరిత్రకు భంగమేర్పడునని చంద్రుని పురుషగ్రహముగా మార్చిరి. నేను భూలోకములో తహశీల్ దారుగా నున్నప్పుడొక జ్యోతిష్కుని యుంచుకొని యతనిమూలముగా కక్షిదారులకం

దరికి కేసులు రాజీయగుచున్నవని ఫలమును చెప్పించుచు నేనును యాలాగే రాజీకండని చెప్పుచు జ్యోతిషముల వలన మంచి మేలును గలిగించితిని. మా దైవజ్ఞునిపనియంతయు కక్షులను రాజీచేయుటయైయుండెను. నాపరమానందమునుజూచియే నాకప్పుడు లోకులు పరమానందులని పేరుపెట్టిరి. మెగస్థనీ - ఫాహియాన్ - అలబరూనీ గారు వ్రాసిన చరిత్రలను బట్టి 400కి 1020కి మధ్యకాలములో నీగ్రహశాస్త్రముత్పత్తియై బాల్యవివాహము లేర్పడినవి.

మనమీ గ్రహముల బాధను దొలగింపవలయునన్న గ్రహబలిమి గావలయును. ముల్లును తీయవలయునన్న ముల్లుగావలయును. యవనులట్లే జయించియున్నవారు. ఐరోపాఖండ మీగ్రహజాలములో నింకను తగులొకనలేదు. వారిలో కొందరీ త్రాళ్ళను గట్టుకొనగోరుచున్నవారు. ఈ గ్రహగతి మనుష్యుని మృత్యువును మిక్కిలి చక్కగా తెలియజేయుచున్నది. ఇది మానసికవిద్యతో సంబంధపడుచున్నది. నేనొక నిజమైన సంగతిని జెప్పుచున్నాడను. ఒక గ్రామములో నిద్దరికి బద్ధద్వేషముగలిగి అందొకడు మరియొకనిని శూన్యముచేయించి చంపింపవలెనని యొక మంత్రగానిని పిలు

వనంపెను. వాడొక ప్రతిమనుజేసి వివిధడాంబిక పదార్థములతో వానియింటి ముందుభాగమున నర్ధరాత్రివేళ యుంచివచ్చెను. శూన్యమందు మిక్కిలి విశ్వాసముగల యాగృహస్థుడు దిగులుపడి మూడవనాడే కాయిలాపడి చనిపోయెను. శూన్యమబద్ధమని యిట్టిదృష్టాంతములను జూచినవారియెదుట యెవరువాదించగలరు ? ఇది నిజమైతే యీయుద్ధములేల? యీ సైన్యములేల ? యొక శూన్యమంత్రజ్ఞుడు చాలడా ? మూఢనమ్మక మీప్రకారముగ చెరుపుచేయుచున్నది యూరోపున నొకడు యొక గదిలో రాత్రి అథవా చీకటిలో ప్రకాశించెడు అక్షరములతో 'నీవీరాత్రి చనిపోదువు' అని వ్రాసెను. ఆ దినముః రాత్రి యజమానుడా గదిలో నిద్రించుటకై వెళ్ళి మంచముపై పండెను. చీకటిలో అక్షరములు ప్రకాశించుచు నగుపడెను. (మన మగ్గిపుల్లలను చీకటిలో గీచినప్పుడు ప్రకాశించునుగదా ? ) యీవాక్యమును చదువుకొని యాతడు యీవ్రాత దేవుని వ్రాతయని నమ్ముకొని యారాత్రియే ప్రాణమువిడిచెను. నేననేకులకు నీ ఫలశాస్త్ర విశ్వాసమును బోగొట్టితిని. వారి జన్మపత్రములలోగల యాయుపునకంటె హెచ్చుగా జీవించిరి. గాన జాతకములలో హెచ్చుగా యాయుః

ప్రిమాణము వ్రాయునట్లు తీర్మానముచేయవలయును. అనగా మానసిక విశ్వాసమునకు సహాయముగ నుండు లాగున శాస్త్రసంస్కారము చేయవలయును. నాడీవ్యాధిగలిగి మానసికమున స్త్రీకి భాధగానుండెను. నేనా స్త్రీకి నమ్మకముచెప్పి మంత్రించి ముచ్చెనుకడిగిన నీటిని ద్రాగునట్లు చేసి రోగమును కుదిరించితిని. మానసిక విద్యను మనవారు పూర్ణముగ నెరిగియుండిరి. ఇప్పుడు నుగలదు. ఆయునిర్ణయము దానికి సంబంధపడియున్న దిగాని గ్రహములకేమియు సంబంధములేదు. మనుష్యుడు మంచిచెడ్డలను యుక్తాయుక్తములను సత్యాసత్యములను తెలియగలడు. పశుపునకిట్టి జ్ఞానములేదు. ఫలశాస్త్రప్రకారముగా నంతయు గ్రహములు మనతో చేయించుచుండును. గనుక మనుష్యుడేమయ్యెను ? పశువయ్యెను. ఎప్పుడు మనుష్యునకు స్వాతంత్రములేదో— అప్పుడు ధర్మకర్మముల కన్నింటికి 'ఇతిశ్రీ' సంభవించెను. ఈశ్వరుడు గ్రహబలముచేత జారచోరాది కుకర్మములు చేయునట్లుచేసి, యాపాపమును గ్రహములకు చెందనియ్యక మనుష్యులకు సంభవింపజేయునని నమ్ముట పశుత్వముగాక మరేమి ? వేదాది ధర్మశాస్త్రములకు ఘోరశత్రువులెవరు ? నాస్తికులెవరు? హిందూ

దేశ మత్యుష్ణమైనది గనుక నిందలివారికి మానసిక శక్తి క్షీణించి యీనాస్తికరోగము ప్రాప్తించినది. మానవుడు తనకు తానే గ్రహమైయున్నాడు. మేలుపొందవలయునన్న మేలును, కీడుబొందవలయున్న కీడును బొందగలడు. ఎవరినైన వృథా పనిలేక నున్నావెందుకని యడిగినయెడల "అయ్యా! యేమిపని చేయుదును? శనైశ్చరుడు సాడేసాత్ దశలో నున్నాడు" అని బదులుచెప్పుచు, తనకు తానే పౌరుషహీనుడును, శక్తిహీనుడును, ఉత్సాహహీనుడు నగుచు సాక్షాత్ శనైశ్చరుడగు చున్న వాడు. ఆహాహా! ఓ ఫలశాస్త్ర ప్రీతమా! నిన్నుజూడ భయమగుచున్నది. నిన్నాశ్రియించినవారిగతి యేమి కావలయును.

సభికులారా! దీని వినాశమునకు నేనంగీకరించి విరమించుచున్నాడను. (అప్పుడు శంకరశర్మగారు నిలువంబడిరి)

---

## (19) శంకరశర్మగారు.

పితృమహాశయులారా! నేను భూలోకమున నున్నప్పుడు లక్ష్మీజ్యోతిష్యులవద్ద శిష్యుడుగా నుంటిని.

గాన వారియొక్క యొకదిన చర్యను సభికులకు దెల్పు చున్నాడను.

(మెడలో బంగారుకంఠియు చేతులలో కాపులును గలిగిన యొకబాలుని చెయిపట్టుకొని అహల్యా యను విధవ ప్రవేసించి, పండితునిచేతికి బాలుని జాతకమును పదిరూపాయిలును పీఠము ముందు నిచి నమస్కరించెను)

జ్యో:— అమ్మా! కూర్చుండుము! (జన్మపత్రి మును చేతికి తీసుకొని) వీని సుఖస్థానమును శనైశ్చరుడు చూచుచున్నాడు. గనుక, నీబాలుని తల్లి అథవా తండ్రికి ప్రాణభయము గలిగియుండవలయును.

అందరు:— ఆహా! దుఃఖకరము; మహాస్వామీ! నానితండ్రి చచ్చి నేటికి సంవత్సరమయ్యెను.

జ్యో:—అగ్నిభయము కలిగియున్నదా?

అహల్యా:— మొన్న యగ్గిపుల్లలతో నాటలాడు చుండి నేను కనిపెట్టడంతోటి గండముతప్పినది.

జ్యో;— బాలునకు మొదటి మూడుసంవత్సర ములలో కష్టప్రాప్తిగలిగి యుండవలెను.

అహ:—భేదులచేతను జ్వరముచేతను బాధింపబడెను. సత్యము.

జ్యో:—వీడు పుట్టినతరువాత తల్లికి మిక్కుటమైన కష్టము ప్రాప్తించి యుండవలెను.

అహ:-(కండ్లనీరు దుడుచుకొనుచు; దుఃఖించుచు) యింతకంటె యధికకష్టము మరేమి కావలయును. (అని వట్టిచేతులు చూపుచున్నది)

జ్యో:— వీనికిసరిగా నాకలిగావడములేదు. శరీరానుసారముగ భోజనముచేయక మిగుల కొంచెము పుచ్చుకొనును.

అహ:— తాముసాక్షాత్ యీశ్వరావతారులు! పిల్లవాడు పాలును బిస్కత్తులును వెన్నయువినా— అన్నమును తాకడు. వీనికి ప్రాణమెట్లున్నదోయని వింతగానున్నది.

జ్యో:— అంతయు గ్రహబలము, వీడునిండా భాగ్యశాలి. వీనికి రెండువివాహములు కావలసిన యోగమున్నది. మొదటిభార్య జ్వరమువల్ల గతించును. రెండవది మంచిరూపవతి. భర్తయందు ప్రేమకలది. భర్తను దానునిగా జేసికొనును. 21_27_33_37_44 యీ సంవత్సరములలో భాగ్యాభివృద్ధియగును. వీనికి 86 సంవత్సరములాయువు. ఆహా! ఇట్టి యద్భుతగ్రహ మేజాతకమందును నేను చూచియుండలేదు.

వీనిశత్రువులు వీనినిజూచి మండిపడుదురు. వీడు మిక్కిలి పరితాపశాలియగును. 7-11-17-23-35 యీ సంవత్సరములలో వీనికి కష్టమున్నది. ఇందుకు భృగుసంహిత రీత్యా మహా యంత్రమును ధరించవలయును. వీడు పూర్వజన్మమున మిత్రద్రోహము చేసియున్నాడు. దాని ఫలములు కొన్నిగలవు. నానిభయము తీరుటకు బంగారు మానవవిగ్రహమును దానమియ్యవలెను.

అహః—(తనలో వీని రెండవభార్య సుందరిన్నై వీనిని వశపరచుకొని దాసునిగా జేసుకొన్నప్పుడు నాగతి యేమి కావలయును? (ప్రకాశముగా) యంత్రముల విషయములో నేను మాట్లాడవలసియున్నది. నన్నెప్పుడు రమ్మనుచున్నారు?

జ్యోః— రేపు శనివారము వచ్చి మాటలాడిన భానువారమునాడు యంత్రము వ్రాయబడును. (అందరు వెళ్ళిపోయిరి)

(దండధర సోమయాజులు ప్రవేసించిరి)

దండః—(పండితునిజూచి) సాష్టాంగములు! సాష్టాంగములు!!

జ్యోః—ఓహో! యజమానులేమో బహుదూరము వేంచేసినారు! కూర్చుండుడు.

దండః — ఇదిగో నాజన్మపత్రము. ఇది ధర్మధ్వంస శార్దూలభట్టు కూతురు శారదాదేవిది. ఈ మూడవది ధనప్రియశర్మగారి పుత్రిక రుక్మిణిది. నానిమిత్తము మీరు యీయిరువురిలో నొక కన్యను కూర్పవలయును. తాము యీరెంటిని శ్రద్ధగా శోధించి దేని గ్రహబలమువలన నాకు బలాయురారోగ్యములు వృద్ధియగునో చూచి అట్టికన్యను చెప్పవలయును. నాకింకను శక్తి క్షీణములేదు గాని ముందైనను కన్యయొక్క గ్రహబలముచేత నాశక్తి వృద్ధికావలయును.

శాస్త్రీ — (అరగంటవరకు జూచి అంగుళీయ జపమునుచేసి ఆకాశమునుచూచి) శారదాదేవి తప్పక రండయగును అథవా జారిణియగును. భాగ్య (9) స్థానమున సూర్యుడున్నాడు. తక్కిన సలక్షణము లెన్నియుండినను ప్రయోజనములేదు. రుక్మిణి కుండలి సలక్షణమైయున్నది. తప్పక మీయాయువు వృద్ధియగును. పరంతు మీనక్షత్రము మాత్రము చిన్నదానితండ్రికి భయంకరముగా నున్నది: శ్వశురహాని తప్పదు. ఈసంగతి తెలిసిన వివాహభంగమగును. యేమిచేయుదురు ?

దండః — తామీశ్వరావతారులు. సర్వజ్ఞులు ఆ నక్షత్రమును బదలాయించవలయును. మనుష్యుడెప్పు

డైనను చావవలసినదేగదా? మా మామ చచ్చువర కైనను నేనిచ్చిన వేయిరూపాయిలు కాలిమీద కాలువే సికొని తిని సుఖపడుటకు చాలియుండును. అతడు కష్ట పడి చావడంలేదుగదా? అతని సంతోషార్థమై మీరు యీకళంకమును తుడిచి చక్కపరచవలయును. ఇదిగో తమకు నూరురూప్యములు దక్షిణస్వీకరించుడు. (నోటు యిచ్చుచున్నాడు)

జ్యో:— చిత్తము! తాము వెళ్ళవచ్చును.

సభ్యులారా! ఫలశాస్త్రముయొక్క మహిమ చేత మనదేశమందలి బలవీర్యవిద్య వివేకాదులు క్షీణిం చుచున్నవి. క్షీణించినవి. నేను భూలోకమునుండి కొద్ది వారములక్రింద నిక్కడకు వచ్చినవాడను, అం తయునీరశించి దేశము దరిద్రభూయిష్టమై పోయినది. అంతయు గ్రహచారమని సర్వులును పురుషప్రయత్నము లను మానుకొనుచున్నారు. వివేకము నెందువెదకినను గానరాకున్నది. నేనొకతూరి శాలివాహనశకము౧౮౩౨ యొక్క సాధారణనామ సంవత్సరమందలి ఫలమును పరిక్షించుచు నాస్నేహితులకిట్లు చూపించితిని "చూడు డీ సంవత్సరము సూర్యుడు రాజుగానున్నందున, అన్యో న్యవైరం క్షితిపాలకానాం నాత్యంబుముంచంతి బలాహ

కాంశ్చ । భూపాద్భయం శస్త్రభయం ప్రజానాం చోరాగ్నిబాధాబ్ద పతౌపతంగే” అనగా సూర్యుడధిపతియైనందున పరస్పరవైరము, వర్షములేకుండుట, రాజభయము, ప్రజలకు చోరాగ్ని బాధలు కలుగునని యున్నది. ఆదే సంవత్సరము గురుచారఫలములో చైత్ర శు ౧ మొదలు ఆశ్వయుజ శు ౩౦ వరకు కన్యారాశిలోను అది మొదలు సంవత్సరాంతమువరకు తులారాశిలో గురువుండుటవలన “జీవేకన్యాగతే వృష్ట్యావృష్టిస్వస్థాః క్షితీశ్వరాః। మహోత్సవకాః క్షితిసురాః స్వస్థాస్యుర్నిఖిలాజనాః। తులాగస్థితే దేవగురౌ సువృష్టిః సంపూర్ణసస్యాది భవంతి భూతలే” యిత్యాది. అత్యంతశుభమని— పైదానికి దేవల సిద్ధాంతగ ఫలము చెప్పబడినది. ఇందేది నిజము [illegible] ; [illegible] సమాధానముగా తెట్లు నివేదించుచున్నాను. [illegible] పనేకమున్నదని నేనెట్లు [illegible] ? [illegible] యంధులనియు, చెవులుగల [illegible] సందేహముగలదా ? [illegible] గ్రహయుగుటవల్లను, గురుచారఫలము [illegible], చంద్రగ్రహణము వలనను, సువృష్టి— [illegible]. ఐతే— పంచగ్రహకూటము, [illegible], శని—రాహు సంయోగము

మొదలగు దుర్యోగమువలన వర్షము తక్కువ, స్వల్పపంటలు, దేశమునకు దుఃఖము. ఇందు సత్యమున్నదా? యోచించుడు. నేనింతటితో ముగించెదను.

---

## (20) వ ర ద రా జు.

సభికులారా! భూలోకమున నేనొక ఫలశాస్త్రజ్ఞునియొక్క శిష్యుడుగానుంటిని. నేనును మాగురువులును పట్టణములకుపోయి ఛత్రములలోదిగి, యచటి పరిచారిక జనులవలన గ్రామములోని సంగతులు తెలియుటయు, నందు కొందరికి ద్రవ్యమిచ్చి లోబరచుకొనుటయు, మాయోపాయములు జేయుటయు వర్ణింపవలెనన్న నిది వేళగాదు. మాగురువులొకతూరి యొక లక్షాధికారునకు పుట్టిన సంతానమంతయు గిట్టుచుండుట గ్రహించి, నన్నుబిలుచుకొని వానియింటికి వెళ్ళెను. గృహస్థుడును మాకు చేయవలసిన మర్యాదలుచేసి, తన జాతకమును తెచ్చి జూపెను. మా గురువుగారు దానిని పూర్తిగా చూచినట్లు నటించి, ముఖ్యముగ తనకు కావలసిన 5వ స్థానమున బృహస్పతియుండగా కనిపెట్టి, తద్విరోధముగా సంతానము జచ్చుటకేమికారణమని వర్తకునిశంక నిశ్చ

యించి "బృహస్పతి యుత్తమగ్రహము గనుక నీకు ధన ప్రాప్తియు, రూపవతియగు భార్యయు, ముగ్గురు సోదరులును గలిగియున్నారు; భృగుసంహితప్రకార మొక పూర్వజన్మదోషము నీభార్యయందు గలదు" అని ఆమె జాతకమును దెప్పించి చూచెను అందు సంతానస్థానమున సూర్యుడుండిన చాలునని యోచించెనుగాని యత్నించలేదు. అప్పుడు తన యభినవ ఫలశాస్త్రప్రకారము ఫలము చెప్పుటకు ప్రారంభించి, మీకు సంతానము నెనిమిదిమంది వరకు గలుగునుగాని, యన్నియు మృతినొందును; ఈ దోషనివారణమునకై యొక యజ్ఞము చేయవలసిన దనెను. ఆ ధనికునిభార్య గర్భవతియై యుండెను గనుక, నాతఁడాతురపడి సమ్మతించెను. మాగురువులవారా యజ్ఞమూలమున వేయిరూపాయిలు లాగిరి. ఈ దినములలో నా గర్భిణీస్త్రీని యుపవాసాదులలో నుంచి స్నానాదు లెక్కువ చేయించుటవలన నారోగ్యము చెడి మేము స్వగ్రామముచేరిన కొద్దిదినములలో నామె ప్రసవించి శిశువుసహితముగ పరలోకమేగెనను సంగతి తెలిసెను.

మా గురువులవారు జోష్యవారుపయోగించు నానాకాగితమును యొకగ్రంథముయొక్క రక్షాపత్రము

పైయుంచి దానిక్రింద కాకితము నుంచి, పైన నేదియో చిత్తు కాకితమును కవరుగా రక్షాపత్రమునకు మడచియుంచు కొని, వచ్చినవారు కోరిన ప్రశ్నలను వ్రాసి, మీవద్దనే యుంచికొండనిచెప్పి, యీ పుస్తకముపైని కాకితముంచి చేత పెన్సిలు నిచ్చి వ్రాయించి దానిని దాచుకొనునట్లు చేసి, ఆయిల్ పేపరువల్ల తయారైన రెండవకాపీని నా సహాయమున తాను తిన్నగ సంగ్రహించి, మరియొక కాకితము తుండుపై వారిప్రశ్నలనన్నింటిని వ్రాసి వానికి దగిన ద్వ్యందర్థపుమాట లుత్తరములుగా దిగువవ్రాసి యిచ్చుచుండును. వారీ యద్భుతమునకాశ్చర్యపడి కట్న ములు చెల్లింతురు.

నాకు సంకేత సంభాషణమును నేర్పియుండెను. నేననేక సంకేతములనలన— నేవిచారించి తెలుసుకొన్న సంగతులు అప్పటికప్పుడే చెప్పుచుందును. మా కేమియు తెలియనివారు వచ్చినప్పుడు వారిని రేపురండు మరియొ కసమయమున రండని చెప్పుదుము. చింతామణియను ప్రశ్నపుస్తకమును మేము నిర్మించితిమి. దానిలో ప్రశ్నకుత్తరముగా మొదటిపేజిలో మొదటిపఙ్త్తిలోను, రెండవపేజిలో రెండవపఙ్త్తిలోను, యిదేచొప్పున తొమ్మి దవపేజీ తొమ్మిదవపఙ్త్తివరకును తగినయుత్తరములు ప్రశ్న

కుసంబంధించి వ్రాయబడినవి. మూర్ఖుడీసంగతి తెలియక నేసంఖ్యమిగిలిన నాపేజిలో నాపఙ్క్తిలో యుత్తరముండుట కాశ్చర్యపడుచు దానిని సత్యశాస్త్రమని భ్రమించుచుండిరి. కాకతాళన్యాయముగ కొన్ని నిజమగుచుండును. నిజమును లెక్కించుటయు తప్పిపోయినవానిని గణింపకుండుటయు మనవారికి స్వభావము. ఉత్తరములు ద్వంద్వార్థములుగాకూడ నుండుటగలదు.

మాగురువులవారొక్క జాతకమును మానవునకుగలుగు సుఖదుఃఖములకన్నింటికి సరిపోవులాగున వ్రాసికొనియుండిరి. జాతకము వ్రాయించుటకై వచ్చినవారి వయస్సు-ప్రతిష్ఠ- యోగ్యత- సంపద- స్థితి మొదలగునవి చూచి యేయంశములు విడువవలయునో వానిని విడిచి మిగిలినయంశములనన్నింటిని నాచేత వ్రాయించి యిచ్చుచుండిరి. నేనంతు కొకనాడు "స్వామీ! ఒక్క జాతకము ప్రతివారికి నాతో వ్రాయించియిచ్చుచున్నారే యదెట్లు సరిపోవునని" యడిగితిని. వారందులకు నీవిన్నినాళ్ళుండి ఫలితజ్యోతిషగ్రంథముల చమత్కారములు తెలియజాలకయున్నావేమి? ఈ ప్రపంచమునకంతటికిని యొకటేజాతకమువ్రాసి అందరికిని యది సరిపోవునట్లు చూపవచ్చును అని చెప్పిరి. అంతట

నట్టి మోసపుబ్రతుకు ఘోరనరక హేతువని నాయంతరాత్మను తోచినందున తక్షణమే యీవంచకవృత్తిని త్యజించితిని.

ఫలితజ్యోతిష్కులు ఛల, కపట, పక్షపాత, దంభ, అసూయ, స్వార్థత, హఠ, దురాగ్రహ, అసత్యగ్రహణ, సత్యపరిత్యాగ, దుష్టతాది దుర్గుణంబులు గలిగియుందురని నాకనుభవము. తమబోటి స్వార్థులు కల్పించిన గ్రంథములను కుక్షింభరులు తమ యుదరపాలనముకొరకు ప్రామాణికములని సాధింపజూతురు. కాలము సరిగాచిక్కుట దుస్తరమని వాదింతురు. ఇది "ఆకాశ పుష్పము దొరకినచో - సూర్యునివద్దకు పోగలను" అన్నట్లు వారికప్పుడు కాలము సరిగాచిక్కును? వారెప్పుడు సర్వజ్ఞులగుదురు? అహా! మనకు విధ్యుక్తము లగు సత్కార్యములనేకములు, పాపఫలశాస్త్రముల మున విడువబడుచున్నవి. చేయరాని దుష్కార్యములెన్నియో చేయబడుచున్నవి.

పూర్వమొక ముసలివాడరటిపండుతిని ప్రాణము విడిచెను. వాని కుమారుడందరికి "అరటిపండు తిని నచో చనిపోదురు" అని చెప్పుటకు ప్రారంభించెను.

ఇటువలెనే ఫలశాస్త్రము వ్యాపకమై యున్నది. ఏ మనుష్యుడు మిక్కిలి పరువెత్తునో వాడలసిపోవుచున్నాడు. పూర్వకాలమున మనవారున్నతస్థితిలోనికి వెళ్ళిరి. అక్కడినుండి విశ్రమించుటకై స్థానముజేరిరి. తరువాత నిద్రించిరి. పిమ్మట వెనుకకు తిరిగిరి ఇప్పుడు క్షీణించుచున్నవారు. గనుక మనమిపుడు పనిచేయవలసియున్నది. ఫలితము ఘోరనాస్తికముయొక్క మూలముగానున్నది. సర్వశక్తిమూర్తి సర్వవ్యాపకుడగు జగదీశ్వరునివిడిచి, మంగలశాహులను స్మరించుచు పూజించుచు ధ్యానించుచుండుట తటస్థించినది. (మనవారు) నిర్వాణమును కోరుచుండిరి. వారు కోరినట్లు కలరా – అకాల- మహామారీ మొదలగు వానిచే నిర్వాణము ప్రాప్తమైనది. మనుష్యుని యాయువు విధ్యా-ధనాది సంపదలు ఆపదలు – గర్భమందే నియతమైయుండగా, నాడీవేధలోను చెడుముహూర్తములోను వివాహము చేయుటవలన నెట్లు తగ్గిపోవుచున్నవి ? తగ్గిపోవునన్న పైనిచెప్పిన త్రివిధనిర్వాణములనేల తగ్గింపరాదు ? మనమాస్తికమునుండి జారి నాస్తికమునబడియున్నారము ; గాన మనకిట్టి నిర్వాణములు లభించియున్నవి. త్వరలో మనసంఘు తీర్మానమును భూలోక

మున వ్యాపింపజేసి మన సంతానములయొక్క దుర్భ్రమను నివారించుటకు సభవారిని ప్రార్థించుచు విరమించుచున్నాడను.

---

## (21) సరస్వతి శాస్త్రి.

భాతృలారా! మనలో వివాహమేలాగు జరుగును? బాలవధూవరుల జన్మపత్రములనెడు చీటీల-లాటరీ వేయబడును. అందే రెండుచీట్లు కలియుచున్నవో వారికి వివాహమగును. ఈ లాటరీ పందెములో నొక కోమలాంగియు సురూపవతియునగు కన్యను అష్టావక్రుడొకడు జయింపవచ్చును. అష్టాత్రిలజీ చట్టప్రకారము వారికి భార్యాభర్తల పట్టములంగట్టబడును. మరియు నీయంధాదుంధ పందెములో సలక్షణవంతుడగు వరుని నల్లని భూతము వశముచేసికొనవచ్చును. మొదటిపద్ధతిలో కుకర్దకతయు, రెండవపద్ధతిలో బహుభార్యాత్వము, ఆత్మహత్య మొదలగు నెదురుచూడని సంతాపములు సంభవించుట మనమెన్నియో జూచి యనుభవించియున్నారము. నేను నాపుత్రుని మిక్కిలిగారాబమున పెంచితిని. ప్రేమతో వానికాంగ్లేయ దేశభాష

లలో విద్యనేర్పించితిని. వాడును విద్యావంతుడును వయోవంతుడై పెండ్లికి యోగ్యుడయ్యెను. మంచికుటుంబములో సలక్షణమైన కన్యను విచారించితిని. వధూవరులు పరస్పరము ప్రేమించియుండిరి. అయినను వధువు తండ్రియు మావారును వారిజాతకములు దెచ్చి, వివాహ నిర్ణయాధికారియగు ఫలశాస్త్రజ్ఞుని సముఖమున బెట్టగా- సిద్ధాంతులు చీటీలను పరిశోధించి విధికలియదని చెప్పిరి. పుత్రుని వివాహము చేయుటకు తండ్రియగు నాకుగాని, వివాహము చేసికొను నాకుమారునకుగాని, యధికారము లేకపోయినది. వారికి విధికలియదని చెప్పిన మాటలు నాకంటెను నాయాత్మజుని హృదయమునకు కఠోరకుఠారముగా నుండెను. గనుక వాడు నన్ను జూచి, తండ్రీ! యే భూతముతోగాని- యే గాడిదెతోగాని నాకు విధి కలియుచున్నదని పురోహితుడు చెప్పినయెడల దానిని నామెడకుగట్టి మీరు ప్రసన్నులుగావలయునుగదా? యని యడిగెను. పురోహిత శబ్దార్థ మీవిధమున పాడైపోయినది. నాపుత్రుని వచనమువలన నాకన్నులు తెరువబడెను. నేనప్పుడు కుండపోల విచారమున వివాహము నాచరింపని దేశీయులను జాతీయులనుగూర్చి విచారించితిని. వివాహభేదములను

బట్టియు, రీతులను బట్టియు కొందరి యున్నతియును, మ రికొందరి యవనతియు పరిక్షించితిని. వానిలో దేనికి మనపద్ధతులను బోల్చవలయునో చూచితిని. స్వతంత్ర యస్వతంత్రతలయొక్క వృద్ధిక్షయములను పరిక్షించితిని. అప్పుడు మూర్ఖము, అజ్ఞానము, క్రూరము, అన్యాయ ము, అనుచితమగు-మన వివాహపద్ధతిని తృణీకరించితిని. ఇంతియగాదు; మాలో కుండలీలు గలియకున్న వరులకు నిరంతర బ్రహ్మచర్యము ప్రాప్తించును. చిన్నదానికి వివా హమవశ్యకము గనుక, తల్లిదండ్రులకు దానికి వయస్సు వచ్చినకొల్ల భారమధికమగును. పిల్లలకాహారము తగ్గిం చబడుచుండును. ఎవనిభార్యకైనను కొంచెము కాయి లాసంభవించెనా- అనేకులు దానిచావున కెదురుచూచు వారును, తమకన్యల కుండలీలను పరీక్షించువారునై యుందురు. కొన్నిచోట్ల వైద్యులకు లంచములిచ్చి ఘోరకర్మములుకూడ జరిగించబడును. తుదకొక వృద్ధ కళేబరమునకు ముడివేయబడును. దీని మూలమున నెన్నికుటుంబములలో నాశనమైనవి వంశములు క్షీణిం చిపోయినవి. పురుషార్థము ధ్వంసమైనది. గనుక నిది మిథ్యాశాస్త్రమైన నిన్నినాళ్ళుగా నెట్లు మనదేశమున ప్రచలితమయ్యెనను సందేహముగాని, యిది సత్యశాస్త్ర

మైనచో పూర్ణప్రపంచమందేల విశ్వాసయోగ్యము గాక పోయెనను సమాధానముగాని అక్కరలేదు. నేను మానవులపొడుగునుగురించి పరిక్షింప నెత్నించి యే నెలలో పుట్టినవాడెంత పొడుగుండునో చూడదలంచి యొక గ్రంథము వ్రాయబూనితిని. కొన్ని యుదాహరణములలో "మే నెలలో పుట్టినవారు నిడుపుగానుండి దీర్ఘాయువు గలిగియుందురని" తోచినది. తరువాత భ్రన్నించినది. గాన మరల 2 గంటల దశలను పరిక్షించి ఆప్రకారము వ్రాసితిని. ఫలశాస్త్ర మీప్రకారముగా వ్రాయబడినదని నిశ్చయించితిని. గనుకనే- లోకులీ శాస్త్రమునుగురించి భ్రమించుటకాస్పదమైనది ఫలితముయొక్క ప్రారంభము, చీనా-కలడియా దేశములలో కలిగినట్లు కొందరభిప్రాయపడుచున్నారు వారినుండి మిశ్ర దేశమువారును, వారినుండి యునాని దేశమువారును, అచ్చటినుండి హిందూదేశస్థులున్ను గ్రహించియున్నారు. మొదట సంస్కృతశ్లోకములందు యవనుల పేరులను వ్రాయుట నిషిద్ధముగా నుండెను గనుక, బృహజ్జాతకమందు 'అన్యై' శబ్దము వ్రాయబడినది. ఫలితగ్రంథములలో "యవనాచార్యైః కథితమ్ । యవనేన కథితంమహాత్మనా । యావనైః సంప్రదిష్టాః । తథాహ

వృద్ధయవనః" ఇత్యాదిగా వ్రాయబడియున్నది. యవనులు జన్మములు నమ్మరు. కర్మఫలమును నమ్మరు. ఇట్లుండగా యవనజ్యోతిషమగు ఫలశాస్త్రము పూర్వకర్మఫలమును తెలియుటకని- తన్నివారణమునకని యెట్లు చెప్పవలయును? ఇది కేవలము కల్పితమైయున్నది.

ప్రపంచములో నన్నింటియందును ద్వంద్వములున్నట్లే ఫలితము విషయములోను రెండుకక్షులున్నవి. ఉత్తర హిందూస్థానమున నొకప్రసిద్ధ ఫలశాస్త్రజ్ఞుడును మరియు గణితసిద్ధాంతియునగు బి-యే అస్ట్రాలిజర్ గారు ఫలశాస్త్రము నిజమని సాధించినవారికి అరువదివేల రూపాయలు బహుమతిచేయుటకై శపథములు ప్రచురించినారు. దక్షిణదేశమందును బి-యే అస్ట్రాలెజర్ గారొకరు ఫలితము నిజమని వాదించుచున్నారు. గాని వీరు ఫలితము కల్లయని సిద్ధముచేసినవారికేమియు బహుమతి నిచ్చుటకు పూనియుండలేదు. మనము మన పితృలోక సభమూలముగ పనిచేయుచుండగా, మనకు విరోధముగ మాతృలోకమహా సభవారు పనిచేయుటకు ప్రారంభించిరి. వారుద్యోగ-యుద్యమ- యుత్సాహ- పురుషార్థములు కోరగావని చెప్పుట స్త్రీధర్మమే యనవచ్చును. మనము మాతృలోకమువారి చేతులకు ప్రకాశమగు

మంచి గాజులను, నఖములకు గోరంటాకును, కన్నులకు దివ్యమైన కాటుకయును, ముఖములకు పసుపును, నొసళ్ళకు కుంకుమయును బంపి సన్మానింపవలయును. భూలోకమున సయితము ఫలశాస్త్రిపక్షమువారికి మాతృలోక మహాసభవారనియును, ఖండనపక్షమువారికి పితృలోక మహాసభవారనియు నామకరణములు చేయబడినవి. నేను నామనఃపూర్వకముగా పితృవుల పక్షమవలంబించి ఫలశాస్త్రిమునకు నాసంతతివారు తిలోదకములు విడువవలయునని గోరుచున్నాడను.

ఒకవిషయములో రెండుకక్షులున్నప్పుడు యేకక్షి సుఖకారకమో ప్రత్యక్ష ప్రమాణమువలన పరిక్షించి యాపక్షమున జేరవలయును. ఈవిషయమున మనము జనసాంఖ్యను ముఖ్యముగా పాటింపరాదు. మనమొక రైల్వే ష్టేషనులో జూచినయెడల మొదటితరగతి బండ్లలో ప్రయాణముచేయువారల్పసంఖ్యగా నుందురు. మూడవతరగతివారెక్కువ యుందురు. మూడవతరగతిబండి సుఖమనిభ్రమింపక బండ్లలోప్రవేసించి పరిక్షించవలయును. ఈవిషయమున వివాదముకంటెను యనుభవము శ్రేష్ఠమని నాయభిప్రాయము గనుక నేనేమియు శాస్త్రిచర్చలజోలికి బోవజాలను. ఇంతటితో కూర్చుండెదను.

## (22) హ రి హ ర దా సు గా రు.

మహాజనులారా! మా గ్రామమున నొక జ్యోతి ష్కుడుండెను. అతడు తనయింటి వెలుపలిభాగమందు "సౌభాగ్యశాస్త్రి జ్యోతిషమందిరం" అని బోర్డు వ్రేలాడవేసియుండును. నేనొకనాడా మందిరమున జరిగినదిన చర్యను నివేదించుచున్నాడను. అనేక స్త్రీపురుషులు నిశ్శబ్దముగ కూర్చుండియుండగా— మేఘనర్థుడు పదిరూప్యములును తన జాతకమును సౌభాగ్యశాస్త్రిగారిచేతి కిచ్చెను.

సౌ:—ఈ జాతకము వ్రాసినవాడు మిగుల భర్మించివాడు. మంచిది మేముచెప్పెడు దాఖలాలు మీరుచూచుకొనవలసియున్నది. ధనక్షేత్రమును బృహస్పతి చూచుచున్నాడు. వహావా! యెంతభాగ్యము? యెటువంటి యుత్తమగ్రహము? నీకు ముగ్గురు సోదరులుండవలయును. అయితే ప్రేమమిక్కిలి తక్కువ. నీకు నలుగురు పుత్రులుండవలయును.

మే:—స్వామీ! నాకిద్దరే సోదరులుగలరు. ముగ్గురు పుత్రులుమాత్రము గలరు.

సో:—మీతల్లిని యడుగుడు ! గర్భపాతమై నను, పుట్టినతోడనే గతించియైనను' సంభవించియుండును. పుత్రులవిషయములో నీవిప్పుడేమి ముసలివాడవాయేమి? అన్యథా జరుగదు. (ఈమాట మేఘవర్ణునిభార్య-ఇందు మతివిని నవ్వుచున్నది.

సో:—3, 5, 11, 17, 27, 36 సంవత్సరములలో కొంచెము కష్టప్రాప్తి కలిగియుండవలయును.

ఇం:— ఆరేడుమార్లు కాయిలా సంభవించియున్నది.

మే:—అంతియకాదు ; నాకపుడు 27-36 సంవత్సరములో నుద్యోగసంబంధమైన కష్టములు చాలాగలిగినవి. 3-5-11 సంవత్సరముల సంగతి పెద్దలు చెప్పవలయును.

సో:—కొంచెము నీకడుపులో వికారమున్నది.

మే:—అట్టిదేమియు గనిపించలేదు,

ఇం:—నాతోపలుమారు 'నాకాకలి మందము' అని చెప్పుచున్నారేల ?

సో:—ఇకమీద కలుగవచ్చును ; గ్రహబలమెప్పటికిని తప్పదు. ఇప్పుడే శాంతిచేయుట మంచిది. నీవు చాలాతినవలెనని కోరుదువు. తీపునిండాయిష్టము.

వుల్ల నిఫలాదులు నీకిష్టములేదు. అప్పుడప్పుడు చెడు స్వప్నములు గలుగును మంచముమండి లేవవలసిన మిక్కిలి బద్ధకము. కొంచెము ప్రమేహాశంక యుండవ లయును. సుందర స్త్రీల జూడనపేక్షింతువు.

ఇం:—ఆహా! స్వామిగారు అంతర్యామిగా వు న్నారు సత్యము సత్యము.

సా:—బృహస్పతి సన్ముఖముగా కేతువుండని యె డల నీకు రాజ్యప్రాప్తి కలుగవలసినదే నీవు మిక్కిలి భాగ్యశాలివి. బలవంతుడవు. చంద్రుడు యేడవస్థాన మును జూచుచున్నాడు. నీభార్య మిగుల రూపవతి (ఇందుమతి లజ్జచేత ముఖము వంచుకొన్నది) నీకు తెలియనంతటి ప్రేమ ఆమెకు నీయందుగలదు. నీభార్య లక్ష్మియవతారమని చెప్పవలయును. అప్పుడప్పుడు కఠోరవాక్యప్రయోగముచేసినను హృదయమందపారమైన భక్తికలదు. నీగ్రహబలముచేత నెటువంటి స్త్రీయయి నను నీకు దాసిగాపరిణమించును.

అందరు:—అయ్యగారు సాక్షాత్ పరమేశ్వరావ తారులు. (అని గుసగుసలాడిరి)

సా:— మీతండ్రి నీచిన్నతనములోనే చచ్చి యుండవలెను.

మే:— కేవల మూరుమూసముల్లైనది.

సా:—సరే! ఎప్పుడైననేమి? ఫలము తప్పలే దుగదా? శ్వాశురహాని యగపడుచున్నది.

మే—మా మామగారు బ్రతికియున్నారు.

సా:—ఐతే యతనికి–నీకు పరస్పర దర్శనము మిక్కిలి తక్కువ యుండవలయును.

మే:—వారిక్కడ రావడముపుఱూపము. నేనన్నా నో యూవూరి నీ గేత్రాగి యెరుగను. శనైశ్చరుని బల మునకు యెవరేమి చేయుదురు?

సా:—నీయూయువు 81 సం॥ నీకు 22, 28, 33, 47, 54, యీసంవత్సరములలో భాగ్యాభివృద్ధియగును. నీభార్య రెండుసార్లు కాయిలాపడియుండవలెను.

మే:—ప్రథమ కాన్పులో నసిస్టంటు సర్జన్ గారు బ్రితికించిరి. రెండవతూరికూడ అల్పబాధ ననుభవించినది

సా:—శనిఫలమువలన మీకిద్దరికిని, పిల్లలకు, సేవకులకు నప్పుడప్పుడు కాయిలాలు సంభవించును మీ స్వభావము సరళమైనది. నీకు పాడుటయందిష్టముకలదు. మనస్సు యుదారమయినది. దానికితగిన ద్రవ్యములేదు నీవలన నుపకారము బొందినవారు లోపలసంతోషింపరు.

నీకు శృంగారమందిష్ట మధికము. ఉల్లాసముగనుండ గోరెదవు. కష్టముచేయుట కిష్టపడవు. నీకకస్మాత్తుగా రెండుమారులు ధనములభించు ప్రాప్తమున్నది. నీకు గుఱ్ఱపుగండము తీరిపోయినది. నీకు ద్వితీయభార్యాయోగమున్నది గాని, దానికి భంగములనేకములున్నవి. నీవు పూర్వజన్మమున క్షత్రియుండవు. నీభార్య రాజకూతురు. మీరు పూర్వజన్మమందు పురోహితుని యవమానపరచిన దోష మిప్పుడు బాధించును. దీనికి పరిహారము—మీ రొక దైవజ్ఞునికి బంగారుప్రతిమా దానము చేయ వలయును

ఇం:—(భర్తచెవిలో) ఇప్పుడు మీవద్ద క్షామ నివారణచందా మొత్తమున్నదిగదా? దానిలో కొన్ని వందలుపయోగించి తీరవలయును.

సో:— శనైశ్చరుని ఫలమునుబట్టి నీభార్యా ము త్తైదువ చావునకు యోగభంగము చెప్పవలసియున్నది. గాని గ్రహజపమువలనను, భవానీ యంత్రమువలనను, తద్దోషము పరిహారమగును

ఇం:—స్వామీ! తమచిత్తప్రకారము జరుగువారము. మాకష్టనివారణము తమచేతిలోనున్నది.

సభ్యులారా! యేమనుష్యునియందు విచారశక్తి

యున్నదో వాడు యిట్టి యవిచారకూపమున బడక నుం డునుగదా ? నేనాలాగున దీనినంతయుజూచి బుద్ధి తెచ్చు కొంటిని. నా స్నేహితుడొకడు పైజ్యోతిష్యునికి తన కూతురియొక్క జాతకమును జూపెను. దానికుండలిలో నేడింట నంగారకుడున్నాడనియు, దానిభాగ్యము న్యూన తయనియు చెప్పెను. ఇది యూరంతయు వ్యాపించినం దున నాచిన్నదానికి వరుడుదొరకుట దుస్తరమయ్యెను. బాలికయొక్క మొదటి రెండవ యేడవ యెనిమిదవ పం డ్రెండవ స్థానములలో నంగారక గ్రహముండిన యెడల దానితండ్రి యెంతధనవంతుడయినను, చిన్నదెంతటి సు రూపవతియైనను నిష్ఫలమైపోయి తుదకు దాని వివాహ ము 60-70 సంవత్సరముల జీవచ్ఛవమునకు చేయబడును. అది యయిదారుసంవత్సరములలో తప్పక విధవయగును. అప్పుడు లోకులు " ఆహా ! జ్యోతిష్యులు దానికి వైధ వ్యయోగమున్నదని చెప్పియుండలేదా ? అన్యథా యెట్లు జరుగును ? " అని యనుకొనెదరు. ఇదంతయు నామి త్రునికి బోధించి దానిలగ్నకుండలిని కాల్పించివేసి, నా కుమారునకు యాచిన్నదానిని యుక్తవయస్సున వివా హము చేసితిమి; వారు సౌఖ్యముగ నున్నవారు, అనేక మంది బాలికలుపై తీరున జ్యోతిషపిశాచమునకు బలిహో

రులగుచుండుట మనము జూచుచున్నవారము. ఈఘో రమునకు కారణమగు ఫలశాస్త్రమును రద్దుచేయుటకు నాసమ్మతిని చ్చుచున్నాడను.

---

## (22) చంద్రపాలుడు.

పితృలారా ! ఫలశాస్త్రములోని గొప్పదోషము చూడుడు ! గ్రహము లుండుస్థితినిబట్టి మానవుడు దాన శీలుడగుట, మితభోజ్యుడగుట, పరిశుద్ధుడగుట, మితవ్యయుడగుట, సకలసుగుణములచే గూడియుండి ధర్మాత్ముడగుట, సర్వదుర్గుణములతో గూడి మహాపాతకుడగుట, యిత్యాది ఫలములు చెప్పబడియున్నవి. మనకిపుడు సంభవించు సుఖదుఖములు పూర్వజన్మకర్మఫలములని వేదశాస్త్రములు చెప్పుచున్నవి. ఇప్పుడు పుణ్యాత్ముడు అథవా పాపాత్ముడగుట కూడ పూర్వజన్మకర్మఫలమని చెప్పెడు యీఫలశాస్త్రమెట్లు విశ్వసింపవలయును ? ఫలశాస్త్రయాధారమున తాను పుణ్యుడో అథవా పాపియో తెలిసికొని, యందులకెట్లు నడుచుకొనవలయునో అట్లు చేయవలెనట ; దీనికర్థమేమో చెప్పినవారికి నా ధన్యవాదములు. సుఖము రాబోవునెడల దానిని వృద్ధి

పరుపవలెనట ; దుఃఖమొదవునెడ దానిని పరిహరింపవ లెనట ; ఈస్వతంత్ర మెవరిచ్చిరి ? పాపియో పుణ్యాత్ముడో నరకవాసియో అథవా స్వర్గవాసియో – యిదివరకే ఫలశాస్త్రము నిర్ధరించియుండగా నీస్వతంత్ర మెక్కడి నుండి వచ్చినది ? మరల జ్యోతిశ్శాస్త్రమున, పదార్థసంయోగముచే గలుగు వ్యత్యాసములను జూపెడి జ్ఞానమట ! గనుకనే యే పదార్థములు సంయోగమగుట వలన సుఖవృద్ధియు, దుఃఖపరిహారము జేయు వ్యత్యాస శక్తి మానవునియందు గలుగునో వివరించిన అస్ట్రాలెజరుగారికి సాష్టాంగములర్పించెద.

దయచేసి యీక్రిందివాక్యమును గమనించుడు. " నరునందు స్థూలసూక్ష్మకారణ శరీరములు విద్యుచ్ఛక్తి స్వరూపముగా నుండి, కొంతభాగము దృష్టముగాను మరి కొంతభాగము అదృష్టముగాను నున్నది. 'ఆకాశాద్వాయుః, వాయోరగ్నిః, అగ్నేరాపః, అద్భ్యః పృథివీ, పృథివ్యా ఓషధయః, ఓషధీభ్యోన్నం, అన్నాత్పురుషః' యను యుపనిషద్వాక్య ప్రమాణమును జూడ పంచమహాభూతములు సూర్యునియందే యుత్పత్తిలయమును బొందుచున్నట్లు స్పష్టమగుచున్నది. ' ఆపోవాయిదగ్ంశర్వం ' యను శృతివాక్య విచారణముచే సమస్తవస్తువులు జల

మందే పుట్టుచున్నవని తెలియుచున్నది. అగ్నికి సూ ర్యుడు మూలకారణంబు. ఇట్లుండు ప్రపంచ-క్రమమం దు సూర్యాది నవగ్రహములు తమతమ తేజస్సులను యాకాలమునకు యుక్తమగునట్లు సప్రమాణముగా ని చ్చుచుండినయెడల ప్రపంచస్థితికి గలుగునేగాని లేనియెడ నిమేషమాత్రంబును భూమండలంబుండ నలవిగాదు" (ఆంధ్రపత్రిక యుగాదిసంచిక. బి.సూర్యనారాయణరావు) అల్లము బెల్లమువలె ఫుల్లగనుండునను నిట్టి నిఘుపాటి లేఖనువ్రాసి లోకులను భ్రమింపజేయుట జూడుడు! యీక్రింది వాక్యమును సమీక్షచేయుడు; అప్పుడు శ్రీనారాయణతంత్రము తేట తెల్లమగును. "నరునందై దురంగులు గలవు; వానిలో కొన్ని దృష్టముగాను మరి కొన్ని అదృష్టముగా నున్నవి. 'అథ త్త పితరోగర్భం కు మారం పుష్కరజస్రజం యథేహపురుషోసత్' అను వేద వాక్య ప్రమాణమునుచూడ పంచమహారంగులు పురు షుడగు సూర్యునియందే యుత్పత్తిలయముల బొందుచు న్నట్లు ఇంద్రధనుస్సాది ప్రత్యక్షప్రమాణముగ స్పష్టమగు చున్నది. 'ఆపోహిష్టామయోభు' యను శ్రుతివాక్య విచారణముచే అన్నిరంగులును జలమందే పుట్టుచున్నవని దెలియుచున్నది. ఉదకమునకాధార మగ్ని - అగ్నికి

సూర్యుడు మూలకారణంబు. ఇట్లుండు ప్రపంచ క్రమ మందు శ్వేతాది పంచవర్ణములు తమతమ తేజస్సులను యాకాలమునకు యుక్తమగునట్లు సప్రమాణముగా నిచ్చు చుండినయెడ, ప్రపంచస్థితికి గలుగునేగాని లేనియెడ నిమే షమాత్రంబును భూమండలంబుండ నలవిగాదు. గాన నీవర్ణఫలశాస్త్రం బెల్లరకు నత్యావశ్యకంబు" అని నేనభినవ వర్ణఫలశాస్త్రంబును గురించి వ్రాసినయెడల "భళీ! నారాయణజ్యోతిషీ!!" యని పామరులు స్తోత్రింపరా? అయిననే విద్వాంసుడైన దీనిని యున్మత్త ప్రలాపమని తప్పక చెప్పివేయును.

వీడు మంచివాడగునని అథవా చెడ్డవాడగునని నిర్ణయించుట కీశ్వరుడుకూడ సమర్థుడుగాడు.. ఎందుక నగా—సుఖదుఃఖములు పూర్వార్జిత ఫలములుగా నుం డునుగాని, దుర్మార్గ సన్మార్గముల నవలంబించుట పూర్వ ఫలమెప్పటికిని గానేరదు. దేవుడట్లు దుర్మార్గ-సన్మార్గు లగునట్లు నిర్ధరించియే యుండినయెడల, నీశ్వరవ్యవస్థ ననుసరించి దుర్మార్గుడైనప్పుడు పాపమెట్లు కలుగును? ఒక యజమానుడు సేవకుడెట్లు ప్రవర్తించవలయునో మొదటనే నిర్ధరించిన ప్రకారము సేవకుడాచరించినప్పుడు తప్పితమెవరిది? మనకు విధ్యుక్తములగు సత్కార్యము

లెంతటి విఘ్నములు వచ్చినను విడువగూడదనియును, నిషిద్ధములగు దుష్కర్మములు యానుకూల్యమైనను చేయరాదని వేదాది సత్యశాస్త్రములును ఋషులును చెప్పుచు జీవునకు స్వతంత్రత యిచ్చియుండగా నీఫలశాస్త్రము విధిక్రియలకును శుభాశుభకాలములును శకునములను కల్పించి మరియు చెడుపనులకును శుభముహూర్తములను సృష్టించి యున్నది. దీనిని శాస్త్రమని విశ్వసింపవలెనని చెప్పువారును నమ్మువారును వివేకులా? వారికి బుద్ధియున్నదా ? నాకూతురు ప్రథమ రజస్వలయైనది. వాడుకప్రకారము నావారు కాలమును జ్యోతిష్కునికిచెప్పగా నతడు చెడుముహూర్తమని చెప్పి ఏబది రూప్యములు లాగినాడు. తనయింటిలో నిట్టిదే సంభవించగా నేమియుజేయలేడు. దీనివలన వీరు దొంగలని మోసగాండ్రని విస్పష్టమగుచున్నది.

వీరు వర్తమానపత్రికలలో ప్రచురించెడు భవిష్యములనెన్నియో పరిశీలించినాడను అన్నియు మిథ్యలైపోయినవి. 1910 సం॥ జూలై 6వ తేది ఆంధ్రపత్రికలో “చెన్నపురి గవర్నరుగారగు సర్ ఆర్థర్ లాలిగారిని గురించియు, వారి కుమార్తెను గురించియు” నొక భావికసూచకమును జూడుడేమైపోయినది ? గంజాంజిల్లా-నౌపడా

గాథ్రమములోనుండు బంకుపల్లి సూర్యనారాయణ సిద్ధాంతిగారి భవిష్యత్సూచనలు “మంజుభాషిణి— శశిలేఖ— మైసూరు ష్టార్” మొదలగు పత్రికలలోను, మైసూరు సర్వజనహితోపకారిణి పత్రికలో 1908 సం॥ డిశంబర్ మాస సంచిక (సంపుటము 1 సంచిక 12)లో 108 పేజిలో జూడదగినది. దయచేసి 1897 సం॥ లో ప్రచురించిన వికారివత్సర ఫలములను వినుండు.

1. గీ॥ రాగల వికారి వత్సరారంభమందు ।
బోరుగాలియు ధూళియుబలముగాను ।
వీచుచును వృక్షతతిఁగూల్చువింతగాను ।
చైత్రమాసంబునందలిచిత్రమిదియె ॥

2. రాధ నెలయందుమారికారాపుగల్గు ।
అసెను సేనులపందుగయపుడెవచ్చు ।
నగ్ని వర్షంబుఁగురిసెడునవనియందు ।
గోడుగు కుతురుమూడవకులమువారు ॥

3. అధికవర్షంబునాషాఢమందుగలుగు ।
పంటపైరులకెల్లను బురుగుపట్టు ।
ధూమకేతువ జనసంబు తేపరిల్లు ।
లయము జంతువులకును బాలింతలకును ॥

4. చంద్రగ్రహణంబు శ్రావణశుద్ధమందు ।
అమవసకుసూర్యగ్రహణంబు నమరగల్గు ।
బ్రిజవినాశకరోగముల్ ప్రబలమగును ।
ఖగమృగంబులుపీడచేఁగాసిఁజెందు ॥

5. భాద్రపదయాశ్వయుజమాసబహుళమునకు ।
నెల్లప్రాణులునారాటమూరగింత్రు ।
సరిగముప్పావులోకంబుసమసిపోవు ।
నిత్యసత్యవ్రతులందురు నిలిచియుంద్రు ॥

6. కార్తికమునందురణకేళిగాంచనగును ।
ఆరుగ్రహములు నేకమై యపుడెగలయు ।
గొబ్బుననునగ్నివర్షంబు గురియుమరల ।
జలమునావిరియైపోవుచెమ్మలేక ॥

7. అంతఁగార్తిక మాసాంతమైన వెనుక ।
ధరనుజెల్లునుకృతయుగధర్మమెల్ల ।
అవనియందలియుత్పాతమణఁగి పిదప ।
హరిహరబ్రహ్మమూర్తులు నవతరింత్రు ॥

ఇదేప్రకారముగ విరోధికృతు పరీధావి ప్రమాదీచ సంవత్సరఫలములను గురించి ప్రచురించిరి. విరోధికృతు పరీధావి సంవత్సరములలో " కుజస్థానమై క్రూరమైయున్న మేషరాశియందు శని–రాహువులు గూడు

టవలనను, తులారాశియందు సూర్య-చంద్ర-బుధాంగా రక- గురుశుక్ర కేతువులు గూడుటవలనను, వీరిని దుష్ట గ్రహములైన శని కేతువులు చూచుటవలనను, సూర్యుడు క్షీణచంద్రునితోను క్రూరగ్రహములతోడను(గూడి నీచ స్థానమునందుండుటవలనను, శుభగ్రహమయిన గురువునకు దుష్టగ్రహవీక్షణమును సంయోగమును గలుగుట వలనను, తులాధిపతియైన శుక్రునకు క్రూరగ్రహసంయోగము గలుగుటవలనను ప్రపంచమందుపద్రవములు మెండుగ గలుగునని యనేకపత్రికలలో ప్రకటింపఁబడెను" ఉపద్రవములు ప్రతిసంవత్సరమునందును గల్గుచుండును. దానికి తోడు శుభప్రదములును జరుగుచుండును. ఈ మహానుభావులా సంవత్సరములలో జరుగు శ్రీ సప్తమ యెడ్వర్డుగారి మరణమును గురించిగాని, శ్రీ పంచమజార్జి చక్రవర్తిగారి పట్టాభిషేకమును గురించిగాని భవిష్యత్తు ప్రకటింపజాలక పోయిరి. హాలీస్ కామెట్ ధూమకేతువును గురించి పాశ్చాత్యులు ప్రకటించినదానిని మనవారు తమపంచాంగములలో ప్రచురించి ఫలములుమాత్రము ప్రకటించిరి. దీనిని(బట్టి సిద్ధాంతగణితజ్యోతిషమునందు నయితము మనవారు పూర్ణపాండిత్యము లేనివారుగానున్నారు. వీరిభవిష్యములన్నియు సాధారణాం

శములుగా నెల్లప్పుడు సంభవించుననియే- గాని విశే షాంశములుగా నుండవు.

నేనొకతూరి యొక జ్యోతిష్కునిమాట తప్పిపో యినదని యాతనితో శంకింపగా నాతడు "ఇది కలికా లముగనుక నన్నియు తలక్రిందులగుచున్నవి కలిమహిమ జూడుడు! శ్లో॥ కలౌపాపినిసంప్రాప్తే ధర్మహ్రాసోభవి ష్యతి। యాతేష్వబ్దసహస్రాణాం పంచ కేపాపినోజనాః। చండాలాః ప్రచురంయాంతి యాంతి బ్రహ్మద్విషోబలం। బుద్ధిభ్రంశో ద్విజాతీనాం విద్యాకర్మాది సంక్షయః। శా స్త్రస్యాపార్థవాదశ్చ శిష్టాచారవినాశనం। దుర్భిక్షమ ప్యనావృష్టి బహుళోత్పాతదర్శనం। సూర్యాదిగ్రహగో ళానాంగతి వైషమ్యసంభవః। కుండగోళకసంతానం మద్య మాంసపరిగ్రహః। శివకేశవనిందాచ శ్రాద్ధాదీనాం విప ర్యయః। ఆచార్యగురుధిక్కార పురోహితవిసర్జనం। అ నర్థోక్తమంత్రతంత్రాణాం మతవాదదురాగ్రహః। స్వాం స్వాంవృత్తిం పరిత్యజ్య పరభృత్యుపజీవినాం। నశ్యంత్వాం తిపితుర్వాక్యం పుత్రాశ్చ భ్రాతరస్నుషా। పరనిందాపర స్సత్వం పరదారపరిగ్రహః। స్త్రీణాం పునర్వివాహశ్చ శూద్రసన్యాసలక్షణం। దేవతామహిమాలోపో వేదా ధ్యయనవర్జనం। నభృత్యానికళత్రాణి భవిష్యంతితథో

త్తరే ॥" అని పఠించెను. ఇది ద్వాపరములో వ్యా
సులు చెప్పిన భవిష్యమట. దీనిని సమీక్షచేయుద
ముగాక ! ఇంతవరకు ధర్మహాని కొంతవరకుఁ గలిగినను
అది పూర్ణముగ హ్రాసముగా లేదు. ఇప్పుడు ధర్మాభివృద్ధి
యు ధర్మరక్షణమును ప్రారంభమైనది. పుణ్యాత్ము లెం
దఱో గలరు. చండాలత్వము కృశించుచు దాని ప్రచుర
మునకు నాటంకమేర్పడియున్నది. చండాలులు తమ
చండాలత్వముపై యసహ్యము గలిగి దానిని త్యజించు
చున్నవారు. అనేకులు బ్రాహ్మణత్వమును గోరుచున్నా
రుగాని దానిని ద్వేషించుటలేదు. అబ్రాహ్మణత్వమును
మాత్రమే ద్వేషించుచున్నారు. ద్విజులు విద్యాదులం
దభివృద్ధి నొందుచున్నవారు. వారిలో బుద్ధి భ్రంశము
దూరమగుచున్నయది. వైదిక కర్మలు వెలయుచున్నవి.
విద్య వ్యాపించుచున్నది. కలాకౌశలము లధికమగుచు
న్నవి. సత్యశాస్త్రములు పఠింపబడుచున్నవి. శిష్టాచా
రమననేమో దెలిసికొనియున్నవారు, ద్వాదశాది దుర్భి
క్షములు స్వప్నప్రాయములై యెచ్చటజూచినను జలాధా
రములు వృద్ధినొందుచున్నవి. సూర్యాదిగోళములు సృ
ష్ట్యాదినుండియు నేకరీతిగా తమతమ నియమానుసార
ముగ స్థితిగతులలో నున్నయవి. ఏవిధమైన వైషమ్యా

ములు గలుగలేదు. కుండగోళక సంతానమును మద్య మాంస సేవనమును తగ్గుచున్నవి. యూరోపు అమెరికా ఖండాంతరములందు సయితము శాకభక్షణ సంఘములే ర్పడినవి. శివకేశవనిందలు పురాణములలో వ్యాసులే చేసియున్నారుగాని యిప్పటికాలమువారెవరును చేయ లేరు. అదియు నిప్పుడు క్షీణించుచు నేకేశ్వరోపాసన మధికమగుచున్నది మిథ్యాశ్రాద్ధమునశించి సత్యమైన శ్రాద్ధము లచ్చటచ్చట జరుగుచున్నవి. అనేకచోట్ల గురుకులములు ఆచార్యపరిషత్తులు స్థాపనమైనవి అగు చున్నవి. ఇంతవరకు వ్యాపించియుండిన అనర్థములు నశించి మంత్రతంత్రముల నిజము వెల్లడియైనది. మతమ తాంతరవాదముల డుగంటుచున్నవి. దురాగ్రహము క్షీ ణించుచున్నది. వారువారు నేర్చినస్వవృత్తులవలననే యం దరును జీవించుచున్నవారు. పుత్రులు తండ్రులమాట లను పాటించుచు వారియొక్క న్యాయమయిన యాజ్ఞ లను పాలించుచు యథాయోగ్యముగ వారిని రక్షించు చున్నవారు. సద్గుణమును దుర్గుణమనియు, దుర్గుణము ను సద్గుణమనియుఁ జెప్పుట నిందయగును; అట్టినిం దను జేయువారరుదుగా నుందురు. గుణమును గుణమని దోషమును దోషమని చెప్పుడు స్వభావ మత్యధికముగా

[illegible]. పూర్వయుగములలోవలె పురాణములరీతిగా [illegible] గమనములేదు. పునర్వివాహము నయి [illegible] ముగానేరదు అయిన నిది బాల్యవివాహ [illegible] గమునకు నౌషధరూపముగ నున్నది గాన [illegible] ని యెంతమాత్రమును లేదు. శూద్రసన్న్యా [illegible] ల మసంభవము. శూద్రునియందు సన్న్యాస [illegible] ములుండవు. సన్న్యాసలక్షణము లుండినవాడు శూ [illegible] గానేరడు. సభ్యులింకను పైశ్లోకమును విస్తార ముగ సమీక్ష చేయుట కర్తలుగానుందురుగాన తమకే- [illegible] నున్నాడను. భూలోకములో నింతటి మహా [illegible] ములు ప్రబలుచు పామరులను వంచించు [illegible]. సర్వసాధారణ మనుష్యులందరును గణిత- ఫలితములకంటె [illegible], యొక్కటియగు జ్యోతిషమని భ్రమిం [illegible] నమ్ముచున్నారు. ఈ భ్రమనివారణమును త్వరలో చేయఁగోరుచు విరమించుచున్నాడను.

---

## (24) ఆనందవర్ధ.

సభాసదులారా! మర్త్యలోకమందు థియాసఫి [illegible] ఫలిత జ్యోతిష పక్షపాతులైయున్నారు

వారు "మంత్రతీర్థే తథాదైవే దైవజ్ఞే భేషజే గురౌ! యాదృశీ భావనా యత్ర సిద్ధిర్భవతి తాదృశీ" మరియు "మనఏవమనుష్యాణాం కారణంబంధమోక్షయోః- యద్భావం తద్భవతి" యనునట్లు ఫలితము నిజమని భావించి నమ్మినవారికి నిజమగుననియు, అబద్ధమని భావించినవారికి నాలాగే యనృతమయి పోవుననియు చెప్పుచున్నారు. మేమిదివరకే నమ్మినట్లు మనలో నొక్కరు మూఢవిశ్వాసము మహానర్థమూలమని దృఢపరచియున్నవారు. మంచిది! ఈ థియాసఫిష్టులు తమలో నిశ్చయపరచుకొను వివాహముహూర్తములు శ్రేయోదాయకములనియు భావించియుండియు, తమభావనకు వ్యతిరేకముగ నాముహూర్తములందు జరిగిన లగ్నములు దుష్టఫలములనేల యొసంగుచున్నవి? ఎందరో స్త్రీలు విధవలుగను, పురుషులెందరో- భార్యావియోగులును, వధూవరవియోగములు సంభవింపని దంపతులెందరో-సంతానము లభింపకను, సతిపతులనేకులు పరస్పరము విడనాడినవారనేకులుగలరు. వీరిభావనార్థమేమయినది? అభావనమును భావనమని భ్రమించిన వీరిని థియాసఫిస్టులనుటకు బదులు-తిక్కశిరస్సుపిట్టలనుట లెస్సయని నాయభిప్రాయము.

కలకత్తాలో నిద్దరి జట్టీలకు కుస్తీకి వెళ్ళుటకు

ముహూర్త మొక్కటియే— నిశ్చయింపఁబడెను. ఒకటే ముహూర్తమున వెళ్ళిన మల్లులలో నొక్కఁడోడిపోయెను. అందువలన నాకు నీశాస్త్రమసంభవమని స్పష్టమైనది. మనుష్యజీవితములో రోగములు గలుగుట— యది నివృత్తియగుట— లాభముగల్గుట— నష్టము సంభవించుట—శత్రువులుగలుగుట— మిత్రులు దొరకుట— వివాహమగుట—వియోగములుగలుగుట— సంతానముఁ బ్రాప్తించుట— లేకపోవుట— ఆపదలుగలుగుట— సుఖమందుట — తప్పక సంభవించుచుండును. వీనినన్నిటిని మిశ్రమముఁజేసి వ్రాయుటకు శాస్త్రమెందుకు? యుక్తి చాలియుండును. అట్టి వంచనయుక్తమగు యుక్తిక శాస్త్రమని మనవారు నామకరణము చేసికున్నవారు.

మా పట్టణమందు నేనును నా మిత్రుఁడొకడును జ్యోతిశ్శాస్త్రజ్ఞుని యొద్దకు వెళ్ళుటకు నిశ్చయించితిమి. నా మిత్రుఁడు తిక్కశిరస్సుపిట్టలలో నొక్కఁడైయుండెను. మేము వెళ్ళుచుండగా దారిలో మరిద్దరు స్నేహితులు సంధించి, యెక్కడవెళ్ళుచున్నారని యడిగి తామును మాతోఁగూడ వచ్చిరి. జ్యోతిష్యుఁడు, మాయిద్దరి సంగతులను కొన్ని నిజముగాను గురిగాను చెప్పినాడు. దారిలో సంధించిన వారడిగిన ప్రశ్నలలో నన్నియు తప్పిపో

యినవి. వారిప్రశ్నలు మన యనంతానథానులవారి యుపన్యాసములోని ప్రశ్నలకంటెను గంభీరమైయుం డెను. తరువాత దైవజ్ఞుఁడీలాగు మావిషయమున నిజ మును, మా మిత్రులవిషయమందు బొత్తిగా నసత్యమేల చెప్పెనని మాలో వివాదము గలిగెను. ఈలాగుననే కొందరి విషయములనెట్లో తెలిసికొనియున్నవానిని సరి గాచెప్పుటయు, తెలియనివారి విషయమున ద్వంద్వార్థ ములుగా జెప్పి యొప్పించుటయు నన్నిచోట్ల జరుగుచుం డునని మేము సిద్ధాంతముచేసితిమి. ప్రజ్ఞామంతుల ముం దర వారి యుక్తులెంతమాత్రమును సాగవు. మూర్ఖుల నుమాత్రము వంచింతురు.

బావులను త్రవ్వించుటలో నయితము ఫలశా స్త్రివేత్తలవద్దకు వెళ్ళుదురు. దానికా జాలగ్రంథ మందు, కొన్ని నక్షత్రములు నీటియొక్క పూర్ణభాగ మును, మరికొన్ని నక్షత్రములు నీటియొక్క యర్థభాగ మును, వేరుకొన్ని నక్షత్రమును నాల్గవ భాగమును, కొన్ని నిర్జలభాగములు సూచించును ఈ విషయమున నసత్యములను గణించువారుండరు. ఘుణాక్షరన్యాయ ముగ నిజమయిన సమాచారములను మాత్రము లెక్క పెట్టుకొనుచుందురు. కొందరు భూమిలోపలి జలార్గ

[illegible] సంగతి భూమ్యుపరిభాగపు లక్షణములనుఁబట్టి తెలిసికొనఁదగును, నది ఫలశాస్త్రమహిమమని వంచిం [illegible] గలదు

ఫలితమును విచారించి పనులుచేయువారి యొక్కయు, బుద్ధిబలప్రమాణముల సహాయమునఁ బనులుఁ జేయువారి యొక్కయు, కార్యసిద్ధులు గమనించుచూడుఁడు ! ఇంగ్లీషువారును పూర్వము ఫలితజ్యోతిషమును మనముల వలెనే నమ్ముచుండెడివారు. వారప్పుడు నితాంతముగ హీనస్థితిలోనుండిరి. ఇప్పుడు వారు ఫలితజ్యోతిషమును గర్హించి సంపూర్ణముగ త్యజించినందువలన మహోన్నతస్థితికి వచ్చిరి. దీనిని నమ్మి పనులుచేయువారిని ద్విపాదపశువులని వారు బిలుచుచున్నవారు.

మనము మనబిడ్డలకు, రూప- యవ్వన- విద్యారోగ్య-భాగ్యములలో యోగ్యమయిన వరుని మిక్కిలి ప్రయాసతో వెదకి కుదుర్చుకొనుచున్నారము ; కాని తుదకు జ్యోతిషశాస్త్రవిధిప్రకారము వధూవరుల జాతకములను దైవజ్ఞుల చేతికిచ్చి, సంబంధముఁ జేయవచ్చునా ? కూడదా ? యని యడుగుచున్నారము. అప్పుడతఁడు నక్షత్రానుకూలము లేదనియో - వరుడల్పాయుష్యము గలవాఁడనియో- అథవా ప్రథమభార్య గతించి ద్వితీయ

కళత్రము గలుగుననియో- మాతాపితా శ్వశురాదులకు హానియనియో- చప్పున చెప్పివేయును. అప్పుడు వధూ వరుల తల్లితండ్రులకు తలపై పిడుగుపడినట్లగును. స్వార్థుఁడగు నాపురోహితుఁడు తచ్ఛాంతికై ద్రవ్యమైనను లాగును. లేక సంబంధము తప్పిపోవును. మరల నా బాలికలకు వరులను వెదుకుటకై వెళ్ళుచుము. ఈమధ్యలో మనబిడ్డల జాతకఫలములు వెల్లడియై, యాకన్యల నెవరును తమయింటికి రాగోరరు. ఈ యభ్యంతరముల చేతను, మనోవ్యథలచేతను వేసారి తుదకొక శుంఠశిఖామణికో- లేక నొక వృద్ధజంబుకమునకో- కన్యనంటగట్టుట యనేకచోట్ల సంభవించుచున్నది. అప్పట్టున సయితము నీవంచక పంచాంగమువారితో తథాస్తు యనిపించుటకు లంచములివ్వవలసి వచ్చును.

నా జాతకములో (100) నూరు వత్సరములాయువు వ్రాయబడియున్నందున దాని నమ్మకముచేత, నాయారోగ్యమును గురించి శ్రద్ధలేనివాడనై యలక్ష్యముగ నుండుచు స్వేచ్ఛగా ప్రవర్తించి ముప్పదిసంవత్సరములలోపలనే- మృతినొంది నేనీ పితృలోకము జేరితిని. నా స్నేహితుఁడొకఁడు తన జాతకములో నల్పాయువున్నందుకు చింతించుచు కృశించుచునుండి, యీపితృలోక

సమాజసభవారి ఉపన్యాసములు వర్తమాన పత్రికలవలన నాకు దిటవుగలిగి యిప్పుడారోగ్యము గలవాడై యున్నవాడను.

ఆకాశమున సంచరించు సూర్యచంద్ర నక్షత్రములగు గ్రహములను దెలుపునది జ్యోతిశ్శాస్త్రము వాని చలనములను గణితమేర్పడి, దానియాధారమువలన విద్వాంసులు దిన, వార, మాస, సంవత్సర, గ్రహణములాదిగా గల విషయములను దెలియుచున్నారు మనుష్యులు నివసించు భూమి సూర్యునకభిముఖముగా దిరుగుటచే రాత్రి పగలును గాలమేర్పడినది. కాలముయొక్క అత్యంత సూక్ష్మభాగమును సూర్యసిద్ధాంతములో "తీక్ష్ణసూచ్యగ్రభిన్నపద్మపత్రైకభేదన స్మృతైర్భవేత్ । తత్కృతం లవ ఇత్యుక్తం తత్త్రింశత్తుః మేషకః । నిమేషాస్త్రింశశ్చ కాష్ఠాత్రింశత్యక్షర స్మృతః । దశగుర్వక్షరోకాలో ప్రాణః కాలో వినీయ్యతే । షడ్భిః ప్రాణైర్వినాడిస్యాత్తత్షష్ట్యా నాడికా స్మృతా ॥" ఇత్యాదిగా కాలనిర్ణయము చేయబడియున్నది. ఈప్రకారముగ నొక్క ముహూర్తమునకు (48) నలువదియెనిమిది నిమిషములగుచున్నవి. ఈ జడగ్రహములకును వీనివలన నేర్పడు కాలమునకును మనుష్యుల యదృష్టమునకు నేమియు సంబంధముండదు.

మన సుఖదుఃఖములకు కారణములు మన పుణ్యపాపము లని వేదశాస్త్రములు చెప్పుచున్నవి. దీనిని యీనరా ధములు నమ్ముచుండియు మేలుకీడులను కాలమునకు సం బంధమని స్వార్థులై చెప్పుచున్నారు.

వారొకదినమును చెడ్డదని చెప్పెదరు. ఆనాడు సమస్తజనులును శుభకార్యముచేయరాదందురు ప్రయా ణము కూడదందురు. ఆదిన మందరికిని యొకేవిధమైన కీడును గలిగించవలయును. అన్ని శుభకార్యములును చెడిపోవలయును; ప్రతి ప్రయాణికునకును నష్టము గలు గవలయును. ఎవరికిని మేలు కలుగనే కూడదుగదా? మరలవారే యిట్టి కాలమును వేరువేరు జనులకు వేరు వేరు ఫలముల నిచ్చునని చెప్పుదురు. నక్షత్రభేదమును చెప్పుదురు. ఒక్కటే పేరును యొక్కటే నక్షత్రమును గలవారికైన నొక్కటే విధమగు ఫలప్రాప్తి కావలయు నుగదా? అందుకు ముహూర్తమునరిగా చిక్కలేదం దురు. ఇట్లెన్నిమిథ్యాజిత్తులుగలవో చిత్తగింపుడు!

భూలోకమున మన భారతీయులు తాము నడువ వలసిన విధ్యుక్తములన్నింటిని గ్రహములు నేమించి నడి పించుచున్నవని బుద్ధిపూర్వకముగ పాపముజేసి " ఇది నాప్రాప్తి; దీనిని తప్పించుట కెవరికేమి యధికారము

న్నది ? ” యని కుతర్కపరులై చెడిపోవుచున్నవారు. ఐతే స్వంత పాపములను గురించి వారీలాగు గ్రహచారఫలమని చెప్పినను పరులుచేయుదానిని యీలాగుతలంపరు. దొంగలువచ్చి దోచికొని పోయినప్పుడు గ్రహచారమే కారణమని చెప్పక వారిని నిందించి శిక్షించుటకేల ప్రయత్నించవలయును ?

గ్రహములు మనలను నీవిధముగ నడిపించునప్పుడు మనకు స్వతంత్రమే లేక పోయెను. ఈస్థితిలో కార్యఫలములగు సుఖదుఃఖములను, గ్రహములే-పొందవలెయుండగా మనకేల గలుగవలయును ? ఒహో! ప్రపంచమున జరుగునదంతయు గ్రహములయాదేశమయ్యెను. పెండ్లికి, సమర్తకు, శోభనమునకు, గర్భధారణకు, జననమునకు, మరణమునకు, విద్యవచ్చుటకు, రాకుండుటకు, వ్యాపారమునకు, నడుచుటకు, కూర్చుండుటకు, పరుండుటకు, పుణ్యమునకు, పాపమునకు, ముక్తికి, నరకమునకు, ఫలశాస్త్రము ప్రమాణమయ్యెను. అహా ! దురాచారములెప్పుడును ప్రవేశించినంత సులభముగా వదలిపోనేరవు. ఏకాలమున నెలకొనినదోగాని యిప్పుడీఫలితపిశాచ మెన్ని ప్రయత్నములు చేసినను కదలక స్థాయిగానున్నది. భూలోకమున నెందరో పలుప్రయ

త్నములుచేసి విఫలులైయున్నవారు. ఈభూతమొకప ట్టున కాలుకగల్పదు. గట్టిప్రయత్నములావశ్యకములు.

హిందూదేశములో జనులనువంచించి జీవించు టకు తొమ్మిది కొండలకు స్థిరదేవతలని పేరుబెట్టి ప్రజ లకు సంభవించు మేలుకీళ్ళన్నియు నాపర్వత మహిమ లనియు, నన్నింటికిని యాతొమ్మిదికొండలే కారణమని చాటించి, బిడ్డపుట్టినతోడనే యాకాలమునుబట్టి కుండలి నివేసి యాపర్వతముల దిక్కులననుసరించి ఫలము సంభ వించునని చెప్పిన నమ్మువారసంఖ్య జనులుగలరు. ఒక యూరిలో సంభవించు పనులతో నాయూరియొద్దనుండు పర్వతముల కేమి సంబంధముండును ? అలాగుననే-భూలో కమునందు సంభవించు వ్యవహారములతో గ్రహములకే మియు సంబంధములేదు. ఇది సర్వదాయసంగతము.

ఓ దైవజ్ఞులారా ! జడములకు స్త్రీ-పుం-నపుంస కలింగములును, జాదములకు - విశ్వాసఘాతములకు- అభక్ష్యభక్షణములకు- ముహూర్తములను కల్పించితిరి. సంప్రతి భరతఖండమునందు పశువులను వధించు క్రూర కర్త మధికమాయినది. ఈ దుష్టపద్ధతిని యాపుటకు ప్రభువులకొక- నివేదన మర్పించుటకై (మంచి) శుభ ముహూర్తమున్నదా ? “ పరోపకారఃపుణ్యాయ పాపా

యుపరపీడనమ్ " అన్నట్లు మీ రీ పుణ్యకార్యమునకు ముహూర్తము లేకంటి రేని మీరు పాపాత్ములును, పరపీడకులును, దేశద్రోహులు నగుదురు, భారతీయ రాజసంస్థానములలో పూజ్యులైయుండు జ్యోతిష్యులిందుకు మంచిముహూర్తమును వెదకి, యీ పశుహింసనమును మాన్పింపకుండి రేని వారు మహాపాతకులని సిద్ధాంతము గును. మరియు నీస్వార్థులకు స్థానమిచ్చి యాదరించిన వారందరును పాపభాగులగుదురు.

రామదైవజ్ఞుడు రచించిన ముహూర్తచింతామణియందలి వివాహప్రకరణములో " జన్మోత్థంచ విలోక్య బాలవిధవా యోగం విధాప్యం వ్రతీ " త్యాది శ్లోకములో నే కన్యకయొక్క జాతకమునందు బాలవైధవ్యయోగముండునో - యా కన్యకకు రావిచెట్టును వరునిగా గాని విష్ణుమూర్తి విగ్రహము అథవా యొక ఘటమును గాని వరస్థానమున నుంచిగాని మొదట వివాహముచేసి తరువాత మానవునితో వివాహము చేయవలయునని వ్రాయబడినది. ఘటము పగిలినతరువాత కన్య విధవయగును. తదనంతరము జరిగిన వివాహము విధవావివాహమయ్యెను. వృక్ష విగ్రహములు చాలకాలముండునుగాన నట్టివివాహము సధవా వివాహము

య్యెను. ఈలాగున ఫలితజ్యోతిషము విధవా- సధవా వివాహములు బోధించుచుండగా తదాశ్రయ జీవనము గలవారనేకులు అక్షతయోని విధవావివాహముల నాక్షేపించుచున్నవారు. మఱియు నాపత్కాలమందలి ధర్మమగు నియోగమును నిందించుచున్నవారు. ఈకన్నులు గల జన్మాంధుల నేమనవలయును ? ఇంతియగాక నీయాపదలకు మూలమగు బాల్యవృద్ధాది యనుచిత వివాహములను ప్రోత్సాహించి యాచరించుచున్నారు. రోగము రాదగిన కుపథ్యములఁ జేయవచ్చునట ! రోగముఁగలిగినప్పుడు యౌషధమును సేవింపరాదట ! ఛీ! ఛీ! ! వీరి బుద్ధికి ధిక్కారము!!! నా సంభాషణమింక ముగించుచున్నాఁడను.

---

## (25) పండితగురుదత్త.

సభ్యులారా ! మనుష్యులు నాల్గువిధములు. (1) ఒకఁడు తెలివినిపొందిి తనకు తెలివియున్నదని తెలిసికొన్నవాడు. వాఁడుజ్ఞాని. వానిని వెంబడించవలయును. (2) ఒకఁడు తెలివినిపొంది తనకు తెలివియున్నదని తెలియనివాడు. వాడు నిద్రించుచు

న్నాడు వానిని లేపవలయును (౩) ఒకఁడు తెలివిని పొందలేదు. తనకు తెలివిలేనిది సయితము తెలియదు. వాడపవేకి. వానిని యుపేక్షింపవలయును. 4) ఒకడు తెలివిని పొందలేదు. తనకు తెలివిలేదని తెలిసియు న్నాడు. వాడు బిడ్డ. వానికి బోధించవలయును. మన పితృవులు వించుమించుగా నాల్గువిధముల వారికిని తగి నట్లుపన్యసించి యున్నవారు. నేను కడపటితరగతికి మాత్రము బోధించుచున్నాడను.

వివాహమునకును ముహూర్తమునకేమయిన సం బంధముగలదా? దీనిని సమీక్షచేయుదము. వివా హముగా స్త్రీపురుషుల న్యోన్యముగ తమయాత్మలను పరస్పరము సమర్పణముచేయుటయై యున్నది. వేదమం త్రములలో "హేస్వామీ! నేను తమకు నాయాత్మ సమర్పణము చేయుచున్నాను" అని గలదు. ఆత్మసమ ర్పణ శబ్దార్థమేమి? రాముడు పుస్తకమును సమర్ప ణము చేయుచున్నాడు. ఇచ్చట రాముడు- పుస్తకము- రెండుపదార్థములున్నవి. ఆలాగుననే సమర్పయితా- సమర్పణీయ- మను రెండువస్తువులగుచున్నవి. ఈవిష యమున దేహాంతర్గతమగు జీవాత్మను సమర్పించుటయే- యాత్మార్పణమై యున్నది. దీనికి ముహూర్తమును

నక్షత్రానుకూలము మొదలగు ఫలితజ్యోతిషము నేమి సంబంధము ? గోకులమునకు మేకుమియ్యాగాడు రక్షకుఁడన్నట్లున్నది.

ఇట్టి సంబంధములను పాఠకులను వంచించుటకు కొన్ని యశాస్త్రీయమగు మాటలతో గూర్చుటకు కొందరు బి.-యేలు సహితము స్వార్థులై యుద్యమించి యున్నవారు. వారి వ్రాతలనుజూచి కొందరు మరి కొన్ని యుక్తులనుఁజేర్చి సహాయలేఖలను వ్రాయుచు న్నారు. ఇట్టివానిని సత్యమని నమ్మి విద్యార్థులు భ్రమించుచున్నవారు.

నేనొకతూరి సంవత్సరాదినాడొక పల్లెనుఁజేరితిని. అచ్చట పంచాంగశ్రవణముఁ జేయవలయునని వారునన్ను వేడుకొనిరి. నాకుఁదెలియకన్న నవమానమని కొన్ని కాగితములు చేతఁబట్టుకొని యీ రాగున ప్రారంభించితిని.

శ్లో॥ శ్రీకల్యాణగుణావహం సిరిహారం సుస్వప్నదోషా
పహం । పంపుస్నాన విశేషపుణ్యఫలదం గో
హత్యపుణ్యం నృణాం । నానావాయుసు సేవనం
శుచివిహారం సంతానసంపచ్ఛిదం । ద్యూతఃకర్త
సుసాధనం సముచితం పంచాంగమాకర్ణ్యతాం ॥

| | |
|---|---|
| అస్యసంవత్సరస్య సృష్ట్యాదిగతాబ్దాః | ౧౯౫౫౮౮౫౦౧౩ |
| కలియుగ గతాబ్దాః | ౫౦౧౪ |
| శాలివాహనశక గతాబ్దాః | ౧౮౩౪ |
| విక్రమార్క శక గతాబ్దాః | ౧౯౬౯ |
| హూణశకాబ్దాః | ౧౯౧౩ |
| చీనగతాబ్దాః | ౧౬౦౦ ౭౪౧ ౭ |
| పార్సీ గతాబ్దాః | ౧౮౯౮౮౭ |
| యుధిష్ఠిరశక గతాబ్దాః | ౪౦౬౧ |
| మహమ్మదశక గతాబ్దాః | ౧౩౩౦ |
| దయూసందాబ్దాః | ౩౦ ఇత్యాది. |

ఈ సంవత్సరం చైత్రవైశాఖమాసములందు యెండలు విశేషము. వర్షఋతువున వానలుగురిసి పంటల కాలమున పంటలు పండును. ఏయే దేశములందే మేమి ఫలించునో యాయా దేశములందావిధమైనవి ఫలించును. నదులుపారును. రోగాదియీతిబాధలు గలిగియుండును.

అస్యసంవత్సరస్య నవనాయకఫలవిచారః:—అస్మిన్ వత్సరే (అభినవజ్యోతిశ్శాస్త్రానుసారేణ) రాజా-టేబిల్. మంత్రీ-బెంచి. రసాధిపః-ల్యాంపు. మేఘాధిపతిః-ఇంక్ స్టాండ్. సస్యాధిపతి - పెన్సిల్. ధాన్యాధిపతి - పేనా.

సేనాధిపతి - చాక్ పీస్. అర్థాధిపతి - స్టూల్. నీరసాధిపతి - చేయ్‌ర్.

మేజాబల్ల రాజైయున్నందున వెన్నెల-చీకటి రెండును సమానము. వానలులేని ప్రదేశములలో క్షామములు గలుగును. మతపరివర్తనములు ప్రారంభమగును. శాస్త్రచర్చ లధికమగును. గుణకర్మస్వభావాదుల ననుసరించి వర్ణమేర్పడును. అనేకులు బ్రాహ్మణులగుటకు నెత్నించెదరు. పూర్వయుగములలోవలె గురుకులము లేర్పడును. పాఠశాల రజాకాలములో విద్యార్థులకు పనిలేనందున పరస్పరము కలహింతురు.

బెంచీ- మంత్రియయినందున, విద్యాభిమానము కొంచెము హెచ్చును. ఉపన్యాసములధికమగునుగాని, యాచరణలు యథాప్రకారము సిద్ధిరస్తు. కొందరుపన్యాసకులు తమభార్యలతో చీపురుకట్టలవలన పూజింపఁబడుదురు. అరువదియేండ్లముసలులు ఆషాఢగాలికి పడిపోయెదరు. ప్లేగు మరణములకంటెను యితరమరణములల్పము. ప్లేగు వ్యాపించినకాలములో నుపాధ్యాయులకు జీతములివ్వబడవు. బెంచీ మంత్రిత్వముచే - లంచములు రహస్యముగఁ బుచ్చుకొనబడును. పాఠశాల లధికమగును.

మేఘాధిపతి—ఇంక్రీస్టాండు గనుక హేమంతమందు చలియెక్కువ. కంబళ్ళును, ఉలన్ శాలువలును మిక్కిలి ప్రియమగును. వానచినుకలతో వడగండ్లు పడుచుండును. అకారము మొదటగల జిల్లాలలో అక్షరములు బాగుపడును. డ్రాయింగు బాగుండును. నల్లటిధాన్యములు బాగుగ పండును. నల్లులు దోమలు మనుష్యులను హెచ్చుగా బాధించును. ప్రయమరీ పండితులనేకులు ప్రధానోపాధ్యాయులగుదురు. మలబారునందు వానలు హెచ్చుగ కురియును.

సింహాధిపతి—సస్త్రెసెనందున యనేకరంగుల ధాన్యములు పండును. అప్పటప్పట చపాతికల్లి- ముండ్ల కొయ్యగూరా- ఉమ్మత్తి- ముల్లులేని వంకాయలు వర్ధిల్లును. అనేక ధర్మకార్యములకు చందాలనిచ్చెదమని పుస్తకములో వ్రాయుట బలమగును; చెల్లించుట అరుదగును. జాతిభేదములేకుండ సమానయాచారములు గలవారు భుజింప ప్రారంభింతురు. ఇది విని ఆడవారు కుండలను గరిటెలతో పగులుగొట్టునంతటి కోపముగలవారగుదురు. యోగులకు కొన్నిస్థలములలో స్త్రీలు అంతరంగిక సభికులగుదురు. విద్యార్థులు సభలలో నుపన్యాసము లిచ్చునంతటి ధైర్యముగలవారగుదురు. సీసమువెల

హెచ్చును. నలుపుధాన్యములధికముగ పండును. కొన్నిచోట్ల పైరులకు పీడకలుగును. ధాన్యము వెలహెచ్చినప్పుడు కాయగూరల వెలతగ్గును. పొట్లకాయలకు రాళ్ళుగట్టకున్న పొట్టివగును. రబ్బరుచెట్లు వృద్ధియగును.

ధాన్యాధిపతి—కలముగానున్నందున వ్యాపారస్తులు జనులను మిక్కిలి యెక్కువగా వంచింతురు. అన్నింటికంటె వేరుసెనగకాయ విశేషముగా పండును. బెల్లము, వడ్లు, రాగులు, కాయధాన్యములు, నూనెధాన్యములు సాధారణముగా పండును. పదార్థములలో చెడ్డవి యడుగునను మంచివి పైనపోసి చూపుదురు. తక్కువకొలతలు తక్కువతూకము లెక్కువయగును. ఇట్టివారివలన పోలీసువారికి కొంచెము లాభముగలుగును. కలముల పాళీలతో కరణాలు, రైతుల కన్నులలో మన్నుజల్లుదురు. క్రొత్తగ్రంథములుచాలా వ్రాయబడును. వకీళ్ళు మునసబులు కలసి చీట్లపేకలాడుదురు.

సేనాధిపతి—సీమసున్నమైనందున తెల్లవారు సైన్యములో గౌరవింపఁబడుదురు. ఉత్తమగ్రంథములు వ్రాసిన వారిని మతాధిపతులు బహిష్కరించి మరల విత్తుఁడాచేసికొందురు. తప్పులు తిద్దుకొనడము

హెచ్చగును. కోమట్లలో నార్యవైశ్యులు - ననార్యవై
శ్యులని రెండు తెగ లేర్పడును. అయిన నంద రేకమే.
బాపలలో మాత్రము భేదములేర్పడును అనేకులు
మాంసభక్షణమును మద్యపానమును త్యజించుదురు.
బాబయ్య పండుగలలో బెబ్బులి వేషముల ధికములగును.
కామనపండుగలలో వాక్కాళములు తక్కువయగును. అసం
గతవార్తల ధికమగును ఉపాధ్యాయులకు జీతమల్ప
మైనందున కొందరు తమకుటుంబములలో నేకభుక్తము
మంచిదని బోధించి యాలాగు చేయుదురు.

రసాధిపతి—ల్యాంపుగానున్నందువలన శోణపు
ష్పములు, మెరుపుధాన్యములు సమృద్ధిగా ఫలించును.
కిరోసినాయిల్ దీపములు పల్లెలకు వ్యాపించును. ఆము
దముధర యథారీతియుండును. వైన్ - బ్రాండి- కల్లు-
సారాయి- లెంనెడ్- సోడా- బుడ్లు టసారణా డీకొను
చుండును. భార్యాభర్తల జగడము లతిశయించును.
అయినను లోలోపల సమాధానమగుదురు. ఉపాధ్యా
యులకు నొకటిరెండురూప్యములు జీతములు హెచ్చును.
స్కూళ్ళును అధికములగును.

అథ మేఘోత్పత్తివిచారం— మేఘములు సము
ద్రమునుండుత్పత్తియై, యాకాశమున సంచరించి, కావలసిన

ప్పుడు వర్షించి, తుదకు తెల్లనగును. ఐదు ఘడియ ములు వాన. ఆరు ఘడియములు గాలి. 7 నేర్లు చలి. 12 నేర్లు ఉష్ణము.

అథ సంక్రాంతిఫలవిచారం— మూషకవాహనం రత్నాభరణభూషితం- కాషాయవస్త్రధారణం - ఘృతాన్నభోజనం- 13వ తేది ప్రవేశం ఇత్యాది లక్షణములనుఁ బట్టి, యెలుకలు నశించును. రత్నములు ప్రియమగును. కావివస్త్రములు మిగుల వ్యయమగును. నేయి వెల హెచ్చును. ఇదే 14వ తేదియందు రథసప్తమి ప్రవేసించినందునను, మరియు 13వ తేదియందే రెండు పున్నములు సంభవించుటవల్లను, మఠాధిపతులు పీఠాధిపతులు కొన్ని యంతరంగసభలు జరుపుదురు. విధవలు యేకాదశి నాఁడు అన్నినాళ్లకంటె నెక్కువ తిందురు.

జూన్ మాసములో ఆదివారం మొదటి తేది వచ్చినందున దేశము సుభిక్షముగా నుండును. 29-29-27 27 ఈప్రకారము నాల్గు అమావశ్యలు సంభవించినందున అచ్చటచ్చట కొన్ని సంకటములు యీతిబాధలు కలుగును. పున్నమ తేదీలయోగము 210, అమావాస్య తేదుల మొత్తము 140 శేషము 70 గనుక, ఈసంవత్సరము సప్తపాదసాష్టాంగములు చాలాభాగము నశించును.

## అథ వర్షధాన్యాదినిర్ణయః.

| | |
|---|---|
| వర్షం 4567890 టన్నులు | తచ్ఛాంతి 2 నిలువులు |
| ధాన్యం 5600000 పుట్లు | కీటకభయం 3 తులములు |
| శీతం 70 డిగ్రీలు | తన్నాశః 3 ,, |
| తృణం 3 పర్వతాలు | మూషకవృద్ధి 10 వాగిన్లు |
| ఉష్ణం 77 పాళ్ళు | తన్నాశః 8 ,, |
| మారుతం 10000 యోజనం | సర్పోపద్రవం 7 పాళ్ళు |
| ప్రజావృద్ధి 100కి 2 | తన్నాశః 3 ,, |
| తన్నాశః 100కి 3 | కామం 100 ,, |
| రాజవిద్వేషం 2 బార్లు | లోభం 99 ,, |
| ఉగ్రం 6 తూములు | మోహం 98 ,, |
| పుణ్యం నక్షత్రపరిమాణం | మాత్సర్యం 97 ,, |
| పాపం సూర్యపరిమాణం | సుఖం 96 ,, |
| వ్యాధి 900 గంపలు | దుఃఖం 95 ,, |
| తదుపశమనం 400 గంపలు | క్రోధం 13 ,, |
| సత్యఆచారం 000 పూజ్యం | శాంతం 13 ,, |
| మిథ్యాచారం 111 బండ్లు | ఆలస్యం 94 ,, |
| జంతుభయం 3 పాళ్ళు | నిద్ర 93 ,, |
| తన్నాశః 3 పాళ్ళు | విశ్వాసం 15 ,, |
| అగ్నిభయం 2 నిలువులు | అవిశ్వాసం 16 ,, |

| | |
|---|---|
| సత్యం 11 పాళ్ళు | పశువధ 999 పాళ్ళు |
| అసత్యం100 ,, | పశురక్షణం 9 ,, |
| పాలు 12 ,, | బ్రాహ్మణత్వం 5 ,, |
| కల్లు 234 ,, | బ్రాహ్మణనామం ,, |
| సారాయి 300 ,, | వైశ్యత్వం 4 ,, |
| లెమ్నేడ్ 30 ,, | తన్నామధారణం 4444 |
| సోడా 30 ,, | క్షత్రియత్వం 2 ,, |
| వైధవ్యం 45 ,, | తన్నామధారణం 2222 |
| శిశుహత్య 10 ,, | శూద్రత్వం 1 ,, |
| వ్యభిచారం 105 ,, | పురోహితులు 10 ,, |
| బాల్యవివాహం 230 | తన్నామధారణం10000 |
| ప్రౌఢవివాహం 2 | న్యాయం 16 ,, |
| మాంసభక్షణం 50 కోట్లు | లంచము 3 ,, |
| శాకభక్షణం 2 ,, | పాత్రదానం 7 ,, |
| జ్ఞానం 6 ,, | అపాత్రదానం 7777 ,, |
| అజ్ఞానం 66 ,, | స్త్రీస్వాతంత్ర్యం-అతిగుప్తం |
| కాపట్యం 8 ,, | పురుషస్వతంత్రం-బాహ్యం |
| నిష్కాపట్యం 1 | అధాయం_న్యూనం |
| దయ 000 ,, | వ్యయం-అత్యధికం |
| నిర్దయ 333 ,, | మితిమించిన- పలాయనం |

సోగ్గున్యాజ్యం – సమృద్ధం

గృహకలహం – అంతఃపురం

నాటకం – బాహుళ్యం

దైవభక్తి – అపురూపం

శిష్యభక్తి – విశేషం

వేదోక్తం – శూన్యం

అన్నదానికం – పరిపూర్ణం

పురుషప్రయత్నం – వక్రం

ముని – అగోచరం

స్నానం – సర్వవ్యాపకం

అంతశ్శుద్ధి – నాస్తి

బహిశ్శుద్ధి – బహుళం

అత్యర్ఘం – 4 గంటలు

సమాఘణం – 4 ,,

శూన్యఘణం – 5 ,,

జూదం – యథేచ్ఛం

ఉద్యోగం – యథాప్రకారం

అడ్మిషన్ – 100 పాళ్ళు

అటెండెన్స్ – 80 పాళ్ళు

సరాసరి – 50 పాళ్ళు

గణితం – అగణితం

వాచకం – యోగ్యతానుసారం

వ్రాత – మేలుపత్తిననుసరించి

డ్రాయింగ్ – చేతికివచ్చినట్లు

వస్తుపాఠం – అస్తవ్యస్తం

బ్రహ్మచర్యం – పూజ్యం

గృహస్థధర్మం – పరకభాగం

వానప్రస్థం – అరణ్యవాసం

సన్యాసం – ధారణమాత్రం

సర్వం – సమాప్తం

---

శ్రీరామచంద్రాయనమః, శ్రీమదలిమేలుమంగా సమేత శిలానిర్మిత శ్రీవేంకటేశ్వరార్పణమస్తు ॥ సర్వేజనా స్సుఖినోభవంతు ॥

ఈలాగున పంచాంగశ్రవణమును ముగించి, యా పల్లెలోని కాపులకుముఖ్యముగ గ్రామదేవతలకుగురుబల శనిబలములు మొదలగునవి చెప్పి దక్షిణ ఫలాదులను నూతన వస్త్రములును చిక్కినదానిని లంకించుకొని వచ్చి నవాడనైతిని. ఇంతకంటె ఫలితములో నేమి రహస్య మున్నది? ఎంతసత్యమున్నది? మరియు నసత్యమేమున్నది?

సభ్యులారా! అసత్యమును పరిత్యజించి సత్యా చరణులుగానుండుట విద్యయొక్క లక్షణము. ఆ త్రికో న్నతినిఁ బొందగోరువారు సత్యశాస్త్రములను పఠింపవల యును. ఖద్యోతములవలన నంధకారము తొలఁగదు. తమసభ్యతను రక్షింపలేనివారిని, దానియాథార్థ్యమెఱుం గనివారిని పశుతుల్యులని చెప్పవలయును. పశువు తన తల్లి గర్భమునుండి వెడలినవెంటనే తనకాళ్లపై నిలువఁబ డుచున్నది. కొన్ని నిమేషములలో నడుగులిడుచు పా రాడుచు మెగురుటకు తనకుతానే నేర్చుకొనుచున్నది. కష్టములేకుండ తన జీవనయాత్రను గడుపుకొనుచున్నది. మనుష్యుఁడట్లుగాక మిక్కిలి నిర్బలదశలో జన్మించుచు న్నవాడు. వాడు కూర్చుండుటకును, నిల్చుండుటకును పారాడుటకును సంవత్సరములు కావలసియుండును; సహాయములనేకము లుండవలయును. తనకుతాను బట్ట

లను ధగింపజాలకుండును. ఇట్టి సహాయసంపద లేనివాడు తప్పక చనిపోవును. ఇన్నికష్టములతో జీవించి, సత్యమిది యసత్యమిది యని తెలిసికున్న వానిజ్ఞాన మెందు నకైన పనికివచ్చునా? దేశముమునిగిపోయెను ; అయ్యో! గతియేమి ? అని కూకలువేయుటవలన ఫలమేమి ? దేశ సుధారణకాటంకములుగానుండు దురాచారములను ఖండించి తొలగించవలయును. కొందరు పండితులుగలరు ; గాని వారిని స్వార్థమావరించియున్నది. వారి వివేచనము ఇతిశ్రీయై పోయినది. ఉదాహరణముగ 1912–13 సం॥ పరీధావివత్సర పంచాంగమును ప్రచురించిన హరపనహాళ్ళి తెలిగిమఠమువారి చర్యలను జూడుడు ! పంచాంగములో " బాలగ్రహనివారిణీ మహాయంత్రము- గృహదిగ్బంధము – శిరోరోగనివారిణిటోపి – శ్రీనీలకంఠమహాఉద్ధరణి " మొదలగు తూమంత్ర యంత్ర తంత్రములు ప్రకటించియున్నారు. వాని మహిమలు సత్యములుగానప్పుడు తద్దోషము ధరించువారి యందారోపింపఁబడి, యదేపంచాంగములో నొకచోట " జ్యోతిషం మంత్ర యంత్రాది శకునం స్వప్న ఏవ చ । ధార్మికాణాం ఫలావాప్తినిమిత్తాం నాన్యథాభవేత్ " అనగా జ్యోతిషము- మంత్రములు- యంత్రములు - తంత్రములు- శకు

నములు - స్వప్నములు పుణ్యవంతులకు సత్యమగును. తదితరులకు వ్యర్థములగును— అని వ్రాసియున్నవారు. ఇది స్వార్థతయు ధూర్తతయు మూర్ఖతయుగాక మరేమి? ఈ ప్రపంచవంచకుల జీవనము జీవనమా? వీరిబ్రతుకు బ్రతుకా? వీరిపాండిత్యము పాండిత్యమా?

శ్రీ రాజరాజేశ్వరుఁడగు పంచమజార్జి చక్రవర్తి గారు ఢిల్లీలో తక్తునెక్కుటకు 1912 డిశంబరు 12వ తేది మంగళవారము 2 గంటలకు నిర్ణయించినప్పుడు, ముహూర్తము మంచిదిగాదనియు దానిని మాన్పించి 11 అథవా 12 గంటలకైనను యేర్పాటుచేయవలెనని శ్రీ మాడపాటి వెంకటేశ్వరరావు పంతులుగారు, గవర్నమెంటువారికి తంతిఁ గొట్టినట్లు దేశాభిమాని మొదలగు పత్రికలలో ప్రకటింపఁబడెను. పట్టాభిషేకోత్సవమునిర్విఘ్నముగ నెరవేరెను. అందలి వారవర్జ్యదోషముల న్నియు తిథిబలమువలన నశించెనని యీరావుగారు నిశ్చయించిరిగాబోలు? భరతఖండమందిట్టిపంతులు పండితులు గాగణింపఁబడుచున్నవారు. వివేకులు నవ్వుదురను లజ్జ యైనను వీరికి లేకున్నందుకు చింతయగుచున్నది.

ఈ పండితనామధారులు మనతో యుక్తియుక్తముగను, సప్రమాణముగను సిద్ధాంతపఱుచుకొనలేక వ్యర్థ

మగు నుస్నత్త్రప్రలాపములు ప్రేలుచుందురు. పనికిరానట్టి శుష్కవాదములు చేయుదురు. పన్నిదములకు నిలువరు. శుంఠలతో మనకు కంఠశోషమక్కరలేదు. ఆచరణ మునకు నాచరించుటముఖ్యము గనుక దానికై మనము తగినవిధులను విధించవలయును.

లోకములో సంస్కారపరులను ప్రేమించువారును, ద్వేషించువారును, ఉపేక్షించువారును గలరు. ప్రేమించు వారినుండి దయను నేర్చుకొనవలయును ద్వేషించువారి నుండి ముందుజాగ్రతఁ బొందవలయును. అనగా ప్రబో ధించుకొనవలయును. నిర్లక్ష్యము చేయువారినుండి స్వవి శ్వాస మభ్యసించవలయును.

కడాపటనొక శపథముఁజేయుచున్నాడను. సభి కులలో నెవరైనను యేవిధమయిన శంకకలిగినను నన్న డిగిన చో సమాధానమివ్వగలను. మరియు ఫలశాస్త్ర మసంగతమని దృఢముగను సప్రమాణముగను నిరూ పింపగలను.

ఈ ఫలితమూర్ఖము యవనులనుండి మనలో వ్యాపించినరీతిగనే - మనలనుండి యూరోపియనులలో చివాలున కాలూనియున్నది. ఇంగ్లీషువాడొకఁడు అము

కమాసమందుఁ బుట్టినవాఁడు అముకఫలములు గలిగి యుండునని వ్రాసియున్నవాఁడు. ఉదాహరణముగ ;—

ఏప్రిల్ మాసమునఁ బుట్టినవాఁడు చతురుఁడు; యత్నించినచో పెద్దమనుష్యుఁడగును ; ఎవరిని విశ్వాసింపడు ; అందరిని కపటులని నమ్మియుండును ; పరులతప్పితములను మరువడు. .........ఈనెలలో జన్మించిన స్త్రీలు ద్రవ్యమును లక్ష్యపెట్టరు ; విచారములేకుండ ధనవ్యయముఁ జేయుదురు. వివాహమును మిక్కిలి సావధానముగ యోచించి చేసికొందురు. ఇత్యాది ఫలములు పరీక్షలో సరితూగక పోయినందున నీమాసమున 2- 10 24 25 తేదీలు శ్రేష్ఠములని ద్వితీయగప్రాష్టకమును పఠించినాడు. అతడును దుష్ఫల నివారణముకొరకు రత్నములుచెక్కిన యుంగరములు ధరించవలయునని వ్రాసియున్నవాడు. వీడు పురుషార్థమును పూర్వకర్మమును నమ్మియుంచినవాడు కాడు. అయిన నాంగ్లేయులంథపరంపర తరంగములలో సాధారణముగఁ దగుల్కొనరు గాన, నాదేశమందిది భద్రముగ నుండలేదు. ఈ యాంగ్లేయ జ్యోతిషఫలవేత్త, జన్మించిన మాసములో ననేకులు జన్మించిరిగాని, యెవరును వీనివలె నీఫలశాస్త్రమును రచింపలేదు. దీనిని నమ్మలేను. పైగా దీనిని

ఖండించిరి. వీడింతటితో తనశాస్త్రమును బెంచక విరమించెను. నా యుపన్యాసకాల నిర్ణయము పూర్తియైనది. నేగూర్చుండెదను.

---

## (26) అనుభవచూడామణిగారు.

మహాశయులారా! భూగోళములో తలకొక్క మతముగలవారు కొందరుచేరి (దివ్యజ్ఞానసమాజమువారు అథవా థియాసఫిష్టులు అను నామాంతరమున) ఫలితజ్యోతిషముండనవారమైయున్నవారు దీనిని నమ్మినవారు నాస్తికులని సభికులికివగకే యుపన్యసించినారు. వీరట్టి కారణముచేతగాక అసలు శుద్ధ నాస్తికులైయున్నవారు. ఇందుకు ప్రమాణముగా వారిలో ముఖ్యులు ప్రచురించిన "ముముక్షుమార్గోపదేశిని" యను గ్రంథమునందు 135వ పేజిలో పునర్జన్మమును గురించి వ్రాయుచు "నామనస్సుకు బ్రహ్మాండముకంటె భిన్నముగా భగవంతుడుండు నెడల సృష్టియేకరీతిగా నుండనేరదు...... ఇట్లనుటచేత ఈ బ్రహ్మాండములో లీనమైయున్న శక్తి తనంతటతానే సృష్టిని నడుపునుగాని, తనకంటె భిన్నుడైన నియామకుడు, తనకు మార్గము చూపుటకుగాని,

యింకొకవిధముగా సంబంధము గలుగజేసికొనుటకుగాని యుండడము అగత్యముండదని తాత్పర్యము. గనుక బ్రహ్మాండమునకు భిన్నముగా నొక భగవంతుడుండనేరడు. నేను గ్రహించినవరకు యిదే ఆర్యుల సిద్ధాంతసారము" అని వ్రాయబడియున్నది. ఈ నాస్తికులు 'తాను చెడినకోతి వనమెల్లఁ జెఱిచె' నన్నట్లు, తాము నాస్తికులగుట జాలక నార్యులందరు నాస్తికులని వచించిరి. వీరి సిద్ధాంతమును బలపరచుటకు ఫలితజ్యోతిషము మంచిసాధనమైయున్నందున దానిపక్షమువహించియున్నవారు. ఈ స్వభావవాదులతో మనవారసంఖ్యాకులేకీభవించి భ్రమించియున్నవారు వీరి భ్రమనివారణార్థమై కొన్ని ప్రశ్నలను వారిసమ్ముఖమున నివేదించుటయే—నా యుపన్యాసముగా నున్నది. గాన నాలాగు చేయుచున్నాడను.

1. ఫలితజ్యోతిషము సత్యమనుటకు వైదికదార్శనిక ప్రమాణములచేతను యుక్తిచేతను సిద్ధాంతముచేయగలరా? వానినిఁజూపుడు

2. సూర్యచంద్రమంగళబుధ గ్రహాదులు చైతన్యములా? జడములా? ఇవి మనుష్యులకుమాత్రము దుఃఖములు గలిగించునా? పశ్వాదులకు నయితముఁ గలుగజే

యునా ? లేదన్న— కారణమేమి ? ఒక కార్యమున కనేక కారణములు గలవా ? ప్రమాణమేమి ?

3. గ్రహకారణములవలనఁ గలుగు దుఃఖములు, జప-పూజ – దానాదులు సలుపుటవలన తొలగుటకు హేతువేమి? లేదన్న-నవియేల చెప్పఁబడియున్నవి? పశ్వాదులు గ్రహశాంతి చేయవుగనుక వానికిసదా దుఃఖమేయుండునా ? సంభవమేనా ?

4. ముహూర్తచింతామణ్యాది ఫలితగ్రంథములు వేదాంగమైతే, దానిని ప్రామాణ్యముగ మీరు స్వీకరించితే, దానిలో మద్యపానము, చోరత్వము, జారత్వము మొదలగు కుకర్మములు చేయుటకుఁ జెప్పఁబడిన ముహూర్తములు, యేవేద మంత్రముల ననుసరించి చెప్పబడినవి ? భాష్యములు చూపగలరా ? వేద ప్రమాణము లేదన్న - వేదవిరోధమైన గ్రంథముల నెట్లు వేదాంగమనెదరు ? వానిని నమ్మువారు నాస్తికులుగారా ?

5. దిశాశూల- త్యాజ్యములాదిగాగల, చెడుకాలములందు ప్రయాణము మున్నగునవి చేయుటవలన చెడుగుఁగలుగుట నిజమైతే, ఆకాలములలో వెళ్ళినవారి కనేకులకు నిష్టఫలప్రాప్తికి కారణమేమి ? వేరుకార

ణమును జూపినచో- దిశాశూలాదులు అనిష్టహేతు వులని చెప్పుట హేతువాదమగునా?

6 కాళిదాస మహాశయులు పన్యసించినట్లుగ నీవేదాంగ మగు గ్రంథములలో, పరస్పర విరోధమెందుకుంగ లదు? పూర్వాపర విరుద్ధములు రెండును మిథ్యల నుటకు బాధకమేమి ?

7. సూర్యచంద్రగ్రహణముల, నియమములేమి? రాహు కేతువులు, సూర్యచంద్రులను-గ్రసనముఁజేయుట నిజ మా ? లేక " భూచ్ఛాయాం స్వగ్రహణే భాస్కర మర్కగ్రహే ప్రవిశతీందుః । ప్రగ్రహణమతః పశ్చా న్నేందోర్భానోశ్చ పూర్వార్థాత్ " అనగా— చం ద్రుఁడు తనగ్రహణమందు భూమియొక్క ఛాయయం దును, సూర్యగ్రహణమందు భూ-సూర్యులకుమధ్య మందు నుండుననుట నిజమా ? ఋగ్వేదము నాల్గవ అష్టకమందు నీలాగే గలదు. (ఋగ్వేదభాష్యం 257 పేజి) "యత్వాసూర్యస్వర్భానుః" అను మం త్రిమునుండి జూడుడు ! (శ్రీ-ద-స)

8. వివాహము నిమిత్తము గృహ్యసూత్రములయందు " సార్వకాలమేకేవివాహం " అనియు మరియు నుత్త

• రాయణము, ఉత్తరహస్త చిత్తాది నక్షత్రములు అనుకూలములని, శుభములని, యున్నది. సీఘ్రబోధలో అనూరాధ- హస్త మున్నగునవి శుభములని యున్నది. ఇందేది మాననీయము ?

9. ఏకరాశిలో నుత్పన్నమగు మనుష్యులందరు తన్నియతము ననుసరించి యొక్కనాడే మృతినొందవలయునుగదా ? ఏల యట్లు జరుగుట లేదు ? ఈప్రత్యక్ష ప్రమాణమువలన ఫలశాస్త్ర మసత్యమని సిద్ధాంతముగాదా ?

10. ఇదివరకు పస్యసించినట్టి అనంతావధానుల ప్రశ్నలకు సదుత్తరములనిచ్చి ఫలితము సత్యసిద్ధాంతమని, యే ఫలశాస్త్రజ్ఞుండైన నిరూపింపగలడా ?

సభ్యమహాజనులారా ? ఈ పదిప్రశ్నలకు త్తరములివ్వమని థియాసఫిస్టులను ప్రార్థించుచున్నాడను. వారివ్వజాలకున్న నికమీాద "తిక్కశిరస్సుపిట్టల"ని బిలుచుచున్నాడను. మరియు స్వదేశఘాతకులను బిరుదునొసంగుటకు సలహా యిచ్చుచున్నాడను. వీరు శుద్ధనాస్తికులని యిదివరకే నిరూపణముఁ జేసియున్నాడను. శారీరక - మానసిక - సామాజిక యున్నతికి భంగకరమును, కేవల కల్పితమును, అసత్యమును నగు నీయవన

జ్యోతిషము సత్యమని వాదించు కుమతుల కెట్టి యక్షర బహుమాన మీయవలయునో సభికులాలోచింపుఁడు.

విషయపరీక్ష యైదువిధములు. మొదటిది:— ఈశ్వరుఁడు, యాతని స్వాభావగుణకర్మములు, వేదము. రెండవది:—గౌతమముని కృతమగు న్యాయదర్శనము, అనగా ప్రత్యక్షాది ప్రమాణములతోఁగూడిన హేతువాదము. మూడవది:—సృష్టిక్రమము, ప్రకృతివిద్య. నాల్గవది:— ఆప్తవ్యవహారము. ఐదవది:— తార్కికుల పవిత్రత్వము. ఈ పరీక్షాపంచక మంగీకరింపని వారికి దివ్యజ్ఞానసమాజకులని పేరట! పూర్వము ఋషులును యిటీవల శంకరాచార్య ప్రభృతులు అసత్యఖండనమును సత్యమండనమునుఁ జేసి తమయపారమైన యన్వీక్షకీవిద్యను జూపియున్నవారు. ఇప్పుడాలాగు చేయరాదట! ఇట్లనియనుట పూర్వాచార దూషణగాదట! ఆహా! వైదికాంగమును తిరస్కరించుచు నవైదికమును సత్యమని ప్రలాపించువారినే మనవలయును? పరీక్షాపంచక లక్షణనిరక్షర భట్టాచార్యులనవలయునా? అథవా-వాదీంద్ర ప్రబలప్రతాప బహోద్దూరులనవలయునా? లేక- వాద విముఖప్రముఖ వాచస్పతులనవలయునా? నామట్టునకు నేను యిట్టివారిని బృహస్పహోవంచకపట్టభద్రులని బిలుచు

చున్నాడను. వీరు 'దివ్యజ్ఞానులో' లేక 'దివ్యమైన యజ్ఞానులో' పరిశీలించగా తెల్లమగుచున్నది.

ఈ తుష్కరజ్యోతిష్యమును నమ్మెడు ముష్కరులు ముహమ్మదీయులగుదురు గాని బ్రాహ్మణులెట్లగుదురు? ఈ వేదవిరోధవిధుల నవలంబించువారు దస్యులగుదురు గాని వైశ్యులెట్లగుదురు? వైదికమంతవ్యములకు నితాంతముగ వ్యతిరేకమగు నీ ఫలశాస్త్రమును విశ్వసించెడు వారు ద్విపాదపశువులగుదురుగాని మనుష్యులుగానేరరు. నామాట సత్యమనుటకిదిగో ప్రమాణము! ఈ భూమి కంటె నెన్నియోమడుగులు గొప్పయగు సూర్యాదిగ్రహములు వానియుపగ్రహములనొక్క మూరెడు పరిమాణముగల వేదియందొక్క భాగములో కూర్చుండబెట్టి జప-హోమ-పూజాదులు జరిపించెడువారు మనుష్యులని, వారియందు మనుష్యత్వ మున్నదని, నమ్మవచ్చునా? నిజముగా సూర్యుని వీరావాహనముచేసి, నమస్కరింతురుగదా? సూర్యుడు వచ్చినయెడల నిచ్చట జలమంతయు శుష్కమై లోకము భస్మీభూతముగాకుండ నుండునా? సూర్యుడు కాదు- వానిలో కోటిలో నొకయంశమైనను యిచ్చటికి వచ్చినయెడల నిర్జలమై భూమి నిశ్శేషమగును. గనుక నీఫలశాస్త్ర సంరక్షకులు వెఱ్ఱి

తలకాయలని నిర్ధారణమైనది మరియొక నిదర్శనముఁ జూపెదను. కడప హైస్కూల్ హెడ్‌మాస్టరు సి. రామయ్యాయనువారు 7 మే 1912 తేది, రంగాచార్యుల మెమోరియల్ హాలులో- రిటైర్డు డెప్యూటీ చీఫ్ యింజినీయర్- వై. శ్రీనివాసరావుగారి యగ్రాసనాధిపత్యము క్రింద యుపన్యసించుచు, ధర్మసంస్థాపన చేయుటకై మైత్రేయముని, యిప్పుడానిబెసంటుదొరసాని యాశ్రయమునందుండు కృష్ణమూర్తియందవతరించినాడని చెప్పిరి. (16 మే 1912 స్వాధ్వీ-మైసూరు) ఈ సంఘములో కొంతకాలము బోధకుఁడుగానుండిన మన నారాయణమూర్తి యొక్క స్వానుభవము గొప్పదియు నకాట్యమునైన పుష్టప్రమాణముగ నయితము నున్నయది. ఇఁక నే చాలించుట సముచితమని తలంచెదను.

---

## (27) దే వీ దా సు లు .

సభ్యులారా! లోకములో సత్కర్మలనుఁ జేయ నాజ్ఞాపించు గ్రంధములకు శాస్త్రములని పేరు. కుకర్మలను జేయుటకాజ్ఞయు కాలమును నిర్ణయించు గ్రంథమెట్లు శాస్త్రమనంబడును? ఇట్టి హాసికారకమైన ఫలిత

మ్మను శాస్త్రిమనుటయు నది వేదాంగమని వచించుట యు కేవల మవివేకమైయున్నది. ఇంకలి నిందితాంశ ములు కొన్ని నివేదించెదను.

అథ తీక్ష్ణనక్షత్రాణి తత్కార్యంచాహః:- మూల శక్రశివసార్పదైవతాః యుత్యపంత్యథచ తీక్ష్ణసంజ్ఞయా॥ భూత యక్ష నిధిమంత్రసాధనం భేదబంధకర్మచాత్రతు ॥ అనగా:— మూల, జ్యేష్ఠా, ఆర్ద్రా, ఆశ్లేషనక్షత్రములు తీక్ష్ణములు. ఇవి భూతప్రేతాది సాధనములకును, మంత్రసిద్ధియు, తంత్రము, భేదబంధన యక్షిణీత్యాములకును వధచేయుటకును యోగ్యములైనవని తాత్పర్యము.

అథ ఉగ్రనక్షత్రాణి తత్కార్యంచాహః:-పూర్వి కాత్రిత యమంతకం మఘే। త్యుగ్రపంచకమిదం జగుర్బుధాః ॥ శాఠ్యనాశ విషఘాతబంధోన త్సాహశాస్త్రి దహనాదిషు స్మృతమ్ ॥ పూర్వముచెప్పిన మూడనగా- మూల జ్యేష్ఠ ఆర్ద్రలును భరణి, మఘ-యీనక్షత్రములు గ్రములు. ఇవి శఠవినాశమునకును, విషప్రయోగము నకును, ఘాతచేయుటకును, బంధన వధాది కర్మలకు శ్రేష్ఠములని తాత్పర్యము.

అథ మద్యారంభః—రాద్రి పిత్ర్యే పౌరహూతే యామ్యే సార్పే నైబుతేచైవ ధిష్ణ్యే। పూర్వాఖ్యేషు

త్రిష్వపి శ్రేష్ఠ ఉక్తో మద్యారంభః కాలవిద్భిః పురాణైః॥
అనగా:— ఆర్ద్ర- మఘ- శతభిష— జ్యేష్ఠ- భరణి—ఆ
శ్లేష- మూలాది నక్షత్రములు మద్యమును తయారుచే
యుటకు శ్రేష్ఠములని ప్రాచీనులు సెలవిచ్చియున్నారని
తాత్పర్యము.

మహాశయులారా ! పూర్వాచార్యులు ప్రాచీను
లనగా నెవరు ? ఆసంశయ మిప్పుడే పరిహారమగును.
వినుండు !

"శ్రుతి త్రయే మఘాపూర్వా.........శుక్రే
జైనాగమంపఠేత్" అనగా—. శ్రవణ - మఘ - అనూ
రాధ— అశ్వినీ- రేవతి- భరణీ— పునర్వసు- స్వాతీత్యా
దులందు జైనశాస్త్రిపఠనము యోగ్యమైనదనియును,
"జ్యేష్ఠాశ్లేషా మఘాపూర్వా రేవతీభరణీద్వయే । వి
శాఖా ద్రోత్తరాషాఢా- శతభే పాపవాసరే । లగ్నేస్థి
రేచ చంద్రేచ పారసీ మారపీ పఠేత్" ఈ శ్లోకముల
వలన నీఫలిత జ్యోతిషము జైన- శాస్త్రిములు బుట్టినత
రువాతను, ఫారసీ అరబ్బీ భాషలు మన భారతఖండ
మందు వ్యాపించిన పిమ్మటను కల్పింపఁబడినట్లు విస్పష్టమ
గుచున్నది. ఈ శాస్త్రిము వ్యాధిగ్రస్తులకుచేసిన మహో
పకారముఁజూడుడు ! "పౌష్ణద్వయేచా దితిభద్వయేచ

శ్రీవణత్రయేచ । మైత్రేచ మూలేచ మృగేచ శస్తం క్షైమజ్యకర్మః ప్రవదంతి సంతః ” అనగా:— రేవతీ- అశ్వినీ- పునర్వసు- పుష్యమి- హస్త-చిత్త- స్వాతి- ధనిష్ఠా- శ్రీవణ- శతభిషాది నక్షత్రములు మాత్ర మౌషధసేవనకు యోగ్యములు. అయ్యో ! పాపమనారోగ్యులకీ శాస్త్రము శస్త్రప్రాయమై యున్నదిగదా ? శాస్త్రములలో మద్యపానాది కుకర్మలకు శిక్షలు విధింపఁబడియుండగా నీఘలశాస్త్రి మాట్రికర్మలకు శుభముహూర్తములను విధించియున్నది.

సోదరులు నేజెప్పఁబోవు యీాక్రిందియంశమునకు నవ్వుదురుబోలు ! “ నారాశ్వవృషభాదీనాం లింగాంగం ఛేదనం స్మృతం । అర్కా రేజ్యాంతి పుష్యార్క స్వాతీందు శృతివాసవైః ” అనగా— పుష్యమి - హస్త- స్వాతి- మృగశిర- ధనిష్ట- శ్రవణ- సూర్య- మంగల- బృహస్పతి శని వారాదులందు మానవాశ్వపశ్వాదులకు మర్మాంగచ్ఛేదనముఁ జేయవలయును. చోరత్వమునకు చంద్రగుప్తగారిదివరకే ముహూర్తముఁ జూపియున్నవారు. వానిలోను అల్పభేదములను గలవు. జ్యోతిషసారమందిట్లుగలదు. “ విశాఖాకృత్తికాపూర్వా మూలార్ద్రాభరణీద్వయే । ఆశ్లేషా జ్యేష్ఠయోర్మంద భౌమయోః

శకునేబలే ( లగ్నేవాదశమేభౌమే చౌర్యం సద్రవ్యలబ్ధ యే " ఆహా ! శాస్త్రిశబ్దమున కేమిగతి పట్టినది ? ఈ ఫలశాస్త్రిజ్ఞుల స్వార్థమునకొక యుదాహరణమువినుము.

మాపొరుగున నొక కాపు కాపురముండెను. యాతనియింటిలో మాఘమాసమందొక బఱ్ఱె యీనినది. మాఘమాసమందెనుము లీనుటవలన దౌర్భాగ్యమని యాఫలశాస్త్రిజ్ఞులు కల్పించినదే గాని మఱేమియుఁగాదు. ఇదివిని యాప్రజ్ఞాంధుఁడగు కాపువాఁడు పురోహితునివద్దకువెళ్ళి విన్నవింపగా, మాఘమాసమందు బఱ్ఱె ప్రసవించిన నింటియజమానుఁడు మృతినొందునని పురోహితుఁడు చెప్పెను. ఇందుకేమి చేయవలయునని కాపు మిక్కిలి బతిమాలెను. అప్పుడు పురోహితుఁడు వాని స్థిత్యాదులెఱింగి యున్నవాఁడు గావున, నొక యజ్ఞముచేయించి (100) నూరు బఱ్ఱెలను దక్షిణయియ్యవలయునని విధించెను. యాకాపు శాస్త్రిప్రకారమే చేసెదనని సమ్మతించి మహిషీయాగముచేయ నుద్యమించెను, కావలసిన సామగ్రి సిద్ధమయ్యెను. హవనము చేయుచుండగా మఱియొక పౌరోహితుఁడు వచ్చి యీ అర్థలుబ్ధునిజూచుచు నిలువఁబడెను. వెంటనే- యితడు పాత్రలోనుండి నేయినితీసి అగ్నిలో నాహుతియిచ్చుచు

"అస్య మూర్ఖస్యయాజ్ఞస్య దక్షిణామహీక్షితం । త్వయార్థంచ మయార్థంచ విఘ్నం మాకురుపండిత ॥ స్వాహా" యని పఠించెను. ఈమూర్ఖుడిచ్చు నూరెనుములు నాకర్ధము నీకర్ధమని చెప్పిన యుత్తరక్షణముననే రెండవవాడును, వేదికపై గూర్చుండి హోమమంత్రములు "భూమ్యామిరచలానంతారసావిశ్వంభరాస్థిరా" యని ప్రారంభించెను. ఇట్టివారిప్పుడు యాచార్యులుగానున్నవారు. ఈపాఖండ పురోహితులవలన ప్రాచీన వైదిక పద్ధతులన్నియు మంటగలిసిపోయినవి. ఈ యాడంబర బ్రహ్మబంధులు తమయాజీవికమే-కర్మకాండముగ నిశ్చయించి మహాపాతక కర్మల నాచరించుచున్నవారు.

నేననేక జన్మపత్రములను సమాలోచన చేసినాడను. ఈ సభలో పరిహాసముగ జెప్పక యదార్థముగఁ బల్కుచున్నాడను అవిజన్మపత్రములుగానేరవు. వానిని ధనహారణపత్రములని గాని శోకపత్రములనిగాని ధర్మవినాశక పత్రములనిగాని పిలువవలయును. జాతకమును వ్రాయుటకుఁ బ్రారంభించినదాదిగా ద్రవ్యధ్వంసమును ప్రారంభించును గృహస్థునివద్దయుండని లేకపోని ఋణమైనను తెచ్చి దక్షిణసంభావనల ర్పించవలయును. అది వార్షిక పత్రమని, దినఫలజాతకమని, మాసికమని యనే

కభేదములలో నుండును. ఆయా తరగతికిఁ దగిన ధన యోగముచేసి తీరవలయును. జాతకములో నచ్చటచ్చట శనైశ్చర-రాహు-శుక్ర-బృహస్పత్యాది గ్రహదోషములు తప్పక యుండును గాన, వాని శాంత్యర్థమై జప- పూజ-దానాదులకు ద్రవ్యము కావలయును. గనుక దీనికి పరిథమనామకరణము యోగ్యమైయున్నది.

లోకములో ప్రతివారును సంతానమయినదన్న సంతసింతురు. దానికి జాతకము వ్రాసి వినిపించినప్పుడొక చోట అముకగ్రహ మరిష్టప్రదమని, అముక సంవత్సరము గండమని, పీడయని విన్నప్పుడు నెత్తిన పిడుగుపడినట్లుగ హృదయము కంపించును ; మైచెమర్చును ; తల్లి క్లేశప డును ; తండ్రి తహతహపడును ; బంధువులు మిత్రులు సంకటపడుదురు ; గావున నిది శోకపత్రమనఁ జెల్లును. మరియు ధర్మవినాశక పత్రమనుట సయుత మనుచితము గానేరదెట్లన్నను.—

ఈ జాతకపత్రమూలముగ వేదచోదితమయిన పర మేశ్వరుని భక్తియుపాసనాదులు నిషేధింపఁబడి సూర్య చంద్రాది జడ గ్రహములను పూజించుట మొదలగు నవైదికపంథములు ధర్మవిరుద్ధముగ నాచరింపఁబడుచున్నవి.

ఈశ్వరాధీనముగ మనకర్మానుసారము లభించు సుఖదుఃఖములు గ్రహాదులవలన అథవా వాని మూలముగ గలుగునను నమ్మకము గలుగుచున్నది. వేదాది సత్యశాస్త్రప్రకారము గుణకర్మస్వభావాది సామ్యముచే వివాహముచేయుటకుఁ బదులు వధూవరుల జన్మపత్రములను గలిపి చేయబడుచున్నది ఇత్యాద్యనేక విషయములఁ బట్టి వీనికి ధర్మవినాశక పత్రములను పేరు సార్థకమైయున్నది. తొంబదియేండ్ల వృద్ధబ్రహ్మచారియొక్క జన్మపత్రమును, పదేండ్ల 'పిల్లజాతకమును నక్షత్రానుకూలము సరిపోయినదని వివాహముఁ జేసినది నేను ప్రత్యక్షముగఁ జూచినాడను. ధర్మనాశములో శేష మేమున్నది ? వధూవరులయోగము కలియుటకుగాను యాకాశములోని గ్రహముల కూడికతో సంబంధ మేమి ? మనవద్దనొక గుఱ్ఱముండగా దానితో సమమగు మరియొక గుఱ్ఱమును జోడించుటకు, వింధ్యాచల హిమాచల పర్వతముల సామీప్యములను పరిక్షించుటతో సంబంధ మేమి? ఇది అంథాదుంధరాజ్యముగాక మరేమి ? గంగాజల ముజ్జ్వలమని యమునాజలము నిర్మలమని కాకితములలో వ్రాసి పసుపుపూసి పురోహితపోపుజీలకు పదార్థములర్పించి, వివాహములుగూర్చుట ధర్మవినాశముగాదని యెద్విపాదపశు

వైనను భావించవచ్చునుగాని వివేకులు భావించరు. ఇది నాపూర్ణాభిప్రాయము.

---

## (28) జన్మాధదాసు.

పితృమహాశయులారా! నేనిపుడు తమసమ్ముఖమున, జన్మపత్రికలనఁబడు జాలలేఖనములను, ఆగ్రంథప్రమాణములచేతనే — మిథ్యలని సిద్ధాంతముచేయుచు నుపన్యసించుచున్నాడను. సావధానచిత్తములతో నాలకింతురుగాక!

జాతకములలో సంవత్సర-అయన-ఋతు-మాస-పక్ష- తిథి- వారనక్షత్ర- యోగ-కరణ- గణ- అవర్గ-దివా-రాత్ర్యాది ఫలములు వ్రాయబడుచున్నవి. "సర్వవస్తుపరిసంగ్రహేరతః పుత్రసంతతిరతీవ సన్మతిః సర్వభోగయుత దీర్ఘజీవితో జాయతే ప్రభవసంభవఃపుమాన్" దీని యర్థము:— ఎవడు ప్రభవసంవత్సరమందు జన్మించునో-వాడు, సమస్తవస్తువులను సంగ్రహించువాడును, మిక్కిలి పుత్రసంతతి గలవాడును, బుద్ధిమంతుడును, సర్వభోగయుక్తుఁడును, పూర్ణాయువుగలవాడగునని. సంవత్సరములు ప్రభవాదిగ నరువదిగలవు. నియ

మప్రకారము మరువది వత్సరములతర్వాత ప్రభవవిభవాది సంవత్సరములు వచ్చుచుండును. ఒక్కొక్క సంవత్సరములో ప్రపంచమందు, లక్షలకొలది జన్మించుచున్నారు. ప్రతి ప్రభవసంవత్సరమునందును జన్మించువారందరు నొక్కఫలము ననుభవించవలయును. నేనుచూడగా నొకసంవత్సరమందు జన్మించినవారు నూరులకొలది గలరు. వారందరును సంతతివంతులై, బుద్ధిమంతులై, భోగయుక్తులై, పూర్ణాయుష్షు గలవారలై యుండలేదు. ఇది సర్వథా మిథ్యగానున్నది. సంవత్సరమునకు రెండు అయనఫలములో "శశ్వత్ప్రసన్నోననుసూనుకాంతో సంతోషయుక్తో నితరాంచిరాయుః నరః సదాచారపరోప్యుదారోధీరాశ్చసౌమ్యాయనజాతజన్మా" ఉత్తరాయణమందుత్పన్నమయినవాడు నిరంతరము ప్రసన్నుడుగాను, సుందరపుత్రులు గలవాడును, సంతోషయుక్తుడును, దీర్ఘాయువు గలవాడును, సదాచారుడును, ధీరోదారుడును నగును. ఉత్తరాయనమందుత్పన్నమగువారనేకులు సమముగ నుక్తఫలము లను భవించుటగానము. మరియు సంవత్సరఫలము త్తరాయన దక్షిణాయన ఫలములకు విరుద్ధమయినప్పుడు సంవత్సరఫల మసత్యమని స్థిరమయ్యెను. ఉదాహరణముగ దక్షిణాయన ఫలముు

జూడుడు. “ అఖర్వోగర్వః కృషికర్మకర్తా చ తుష్టధా, ధ్యోతికఠోరచిత్తః శఠోప్యసనశ్చ్యాననుమానవానాంయా మ్యాయనే నా జననం ప్రపన్నః ” దక్షిణాయనమందుఁ బుట్టినవాఁడు అభిమాని; సేద్యముఁ జేయువాఁడు ; కఠోర చిత్తుఁడు; మూర్ఖుఁడు; అసహ్యపరుఁడు యిత్యాది గుణ ములుగలవాఁడు. ఉపశ్లోక్త సంవత్సరాయన ఫలములు ఋతుఫలములకు అర్థాత్ “ కందర్పరూపోమతిమాన్ పవిత్రాపీ సంగీతశాస్త్రే గణితే(ప్రవీణః శాస్త్రప్రసూతా మలచేలచేతావసంతజన్మామనుజః ప్రపన్నః ” ఇత్యాదులు విరుద్ధములైనప్పుడు వర్షఫలమును అయనఫలమును మిథ్య లగును. సంవత్సరమునకు పండ్రెండు మాసములు ప్రతి మాసమునకును ఫలములు వేరువేరుగలవు. “ సత్కార్య విద్యావినయోపపన్నో భోగీనరః స్యాన్మధురాన్నభోక్తా సత్పాత్రమిత్రానురతశ్చమంత్రీ చైత్రోద్భవశ్చాపి విచిత్ర మంత్రకి ” చైత్రమాసమందు జన్మించినవాఁడు త్తముఁడు; సత్కార్యపరుఁడు ; విద్యావినయాదులు గలవాఁడు ; సత్పాత్రమిత్రాదులందు ప్రీతిగలవాఁడు ; విచిత్రసమ్మతి గలవాఁడు ; యిత్యాదులు పైమాటికి విరోధించినప్పుడు సంవత్సరాయన ఋతుఫలములు మూఁడును బొత్తిగ యు బద్ధములని సిద్ధమయ్యెను. పక్షములు నెలకు రెండు

గలవు. "భవేచ్చిరాయుః సుతరాం సుశీలః శ్రీపుత్ర వాన్ కోమలకామకాంతిః సదాసదానంద వితీనకాల శ్చే జన్మకాలోధవలేచపక్షే" ఇందుకు విరోధముగ శుక్ల పక్షమందు జన్మించిన యనేకులు చిరాయువుకు మారుగ పుట్టినప్పుడే చచ్చినవారును చచ్చువారునెందరోగలరు.

కృష్ణపక్షఫలము:—"ప్రతాపశీలోతిబలశ్చలోకః కలహప్రియః స్వీయకులోద్ధతశ్చ మనోభవాధిక్యయుతో నితాంతంసితేతరేయస్యనరస్యజన్మ" అనగా బహుళపక్ష మందు జన్మించినవాడు ప్రతాపశీలుడు; అతిబలవంతుం డు; కలహప్రియుడు; కులశ్రేష్ఠుండు; కాముకుడు.

తిథిఫలము:—బహుతన పరివార శ్చారువిద్యో వివేకీ కనకమణివిభూషావేషశాలీ సుశీలః అతిసులలితకాం తిర్భూమిపాలాప్తవిత్తః ప్రతిపది యదిసూతిర్జాయతే యస్యజంతోః ॥

వారఫలము:— శూరోల్పకేశో విజయీరణాగ్నే శ్యామారుణః పిత్తచయః ప్రకోపః దాతామహాత్సాహ యుతో మహాజాదినేదినేశస్యభవేన్మనుష్యః ॥

నక్షత్రఫలము:— సదైవదైవాభ్యుదితో వినీతః స త్యాన్వితః ప్రాప్తసమస్తసంపత్ యోషావిభూషాత్మజ భూరితోషః స్యాదశ్వినీ జన్మనిమానవస్య ॥

యోగఫలము:— శశ్వత్కాంతా పుత్రమిత్రాది సౌఖ్యం స్వాతంత్ర్యస్యాత్సర్వ కార్యప్రసంగే చంచద్దేహో సాద నేమానసంచేద్విష్కంభో వైసంభవేయస్యజంతో ॥

కరణఫలము:— కామిందయాలు ర్బలవాన్ సుశీలోవిచక్షణః శీఘ్రగతిః సభాగ్యః బవాభిధానే జననంహియస్య నానావిధాతస్యభవేత్సుసంపతు ॥

వర్గఫలము:—అవర్గజో మహాసత్వః ప్రతాపీ దుష్టనాశకః చపలః శుభకర్తాచ విష్ణుభక్తిపరాయణః । కవర్గజోమహాలోభి క్రూరోహింసాపరః సధామిష్టభుక్ సూక్ష్మదర్శీచ దుష్టస్వామీచవల్లభః । చవర్గజోతి తేజస్వీ జ్ఞానీ విజనవల్లభః మహతాంశాసనేదక్షో మానీఖ్యాతో జయీభవేత్ । టవర్గజోతిక్రూరశ్చ ధావకోపరనాశక అల్పభుక్ జాగరః క్రోధీవాచాలో- లోలుపఃసదా॥ తవర్గజోమహాక్రూరో జడోదుష్టోతికోపనః అవిచారిచ హింస్రశ్చ ఏకాకీ బహుశత్రువాన్ । పవర్గజోమహాద్యోగీ భక్షణేతత్పరఃసదా—సంగ్రహీచ యశస్వీచ పరకార్యవినాశకః । యవర్గజః శబ్దవేధీ గీతనృత్యప్రియఃసదా గుణవాన్ విజనప్రీతః స్వదక్షశ్చలవిక్రమః । శవర్గజోమహామూఢః పరబుద్ధిరతః సదాపోషకః సర్వలోకానాం క్షేమవాన్ స్వాతికఃసదా ॥

దివారాత్రి జన్మఫలం:—తేజస్వీ పితృసదృశశ్చా రిద్వేష్టానృపప్రియః– బంధుపూజ్యోథ నాఢ్యశ్చ దివాజా తోనసంశయః। మందదృక్ బహుకామార్తో త్కుయరో గమలీమసః। క్రూరాత్మాచ్ఛన్నపాపశ్చ నిశిజాతోభ వేన్నరః॥ ఇత్యాది ఫలములన్నియు పైనవివరించిన రీతిగ మిథ్యలైపోయెను. ఎవడు పగటిపూట జన్మించునో వాడు తేజస్వియు, తండ్రిసమానుడును, శత్రువులకు వైరియు, రాజులకును బంధువులకును ప్రియుడగును. రోగి కూ్రరాత్ముడగును. ఈ రెంటిని పరీక్షించిచూడగా– పగలుజన్మించినవారనేకులు నిర్ధనులు– తేజరహితులుగా నున్నవారు. తండ్రిసమానుడనగా తండ్రికొక కాలు విరిగిన పుత్రుడా లాగుననే యుండవలెను. తండ్రి దరి ద్రుడైన కొడుకును దరిద్రుడుగావలయునుగదా? అట్లు లేదుగావున ది వా రా త్రి ఫ ల ము లు నసత్యములని సిద్ధాంతమైనది.

లగ్నములు మేషాదిగా పండ్రెండుగలవు. మేష–మీనములు మూడుగడియలు; వృష–కుంభములు నాలు గుగడియలు ; మిథున – మకరములు నైదుగడియలు ; తక్కినవి యారుగడియలు. ఈరీతిగా నొకదినములో సమాప్తమగుచుండును. ఎందరు మనుష్యులొక లగ్న

ములో జన్మించెదరో వారందరు నొక్కకుండలి గలిగి యుందురు. ఫలములు నొక్కరీతి సిద్ధించవలయును. ఒకేలగ్నమందుఁబుట్టినవారిలో నథమ మిద్దరికి సయితము సమానఫలములు గలుగనేరవు. దీనికంటెను యసంభవము వేరొకటి లోకములో లేదు, గాన లగ్నము మిథ్య యయ్యెను. ఇంతియగాక ముహూర్తముసరిగా చిక్కుటను స్తరమని చెప్పి తప్పించుకొను కువాదమునకు కుతారరూపములుగ సంవత్సరాయన ఋతు మాస పక్ష తిథి వార నక్షత్ర యోగ కరణ గణ వర్గ దివారాత్రి ఫలములున్నవి. ముహూర్తము ప్రధానమయినచో నీఫలములన్నియు వ్యర్థములును మిథ్యలు నయ్యెను. ఇవి శాస్త్రమందున్నవి గావున ముహూర్తవాదము కృత్రిమమయ్యెను. ఇందువలన జన్మపత్రములు మిథ్యాపత్రములు అథవా నిష్ఫలపత్రములు 'మరియు హానికారకములని స్థిరమయ్యెను. ఎందుకనగా నొకడే లగ్నములేకుండగనే, పదిమాటలుచెప్పినప్పుడు కొన్ని సత్యములగుచుండును ; కొన్ని మిథ్యలగుచుండును. నేనొకతూరి మేషలగ్నమందు బుట్టినవానికి వృషభలగ్నమును బట్టియు, వృషభలగ్నమందు బుట్టినవానికి మేషలగ్నము ననుసరించియు, జాతకపత్రములు వ్రాసి చూడగా రెండును

సమానమయిన ఫలములనే జూపినవి. రెంటియందును కొన్ని సత్యములుండినవని ; యీలాగే యసత్యములును రెంటిలోను సంభవించినవి. గాన నీఫలశాస్త్రము చమత్కృతిగా గల్పించినదని సిద్ధాంతమైనది. (శంకాసమాధానముల కాలమును సూచించు గంట వాగుచున్నది) సభికులారా ! నేనింతటితో విరమించి సమాధానపక్షముగ సూర్చుండుటకనుజ్ఞ వేడుచున్నాడను.

సభాపతి లేచి, శంకా- సమాధానముల నియమములను గురించి యీప్రకారముగ జెప్ప దొడంగెను.

శంకా–సమాధానములు.

సభాపతి:—సుహాసిభ్యులారా ! శంకించువారందరు నొక్కరిని, మరియు సమాధానమిచ్చువారందరు నొక్కరిని మాటలాడుటకు కోర్పరచుకొనవలయును.

అనంతాసభాసులు:—అది యుక్తముగానుండదు. అందువలన కాలహరణ మగుచున్నది. శంకాపక్షము వారు ప్రశ్నలనే యడుగుచుండవలయును. సమాధానపక్షము వారు వారివారికి తోచిన సమాధానములను త్తరముగా జెప్పుచుండవలయును.

సభాపతి:—మంచిదాలాగే కానిండు ; శంకించు

వారు లేచినిలిచి తమశంకను వివరించవలయును. సమాధానమిచ్చువారాలాగుననే ప్రత్యుత్తరమియ్యవలయును.

శంక.

వేంకటనృశింహాచార్యులు:— ఫలశాస్త్రమును త్యజించినయెడల మనయొక్క జన్మజన్మాంతర వార్తలు మరేవిధమునఁ దెలియవలయును? అనేకసంగతులు నిజముగా తెలియుచుండగా నొక కొన్ని యసత్యములకొరకు సత్యముగూడ నసత్యమనవచ్చునా?

సమాధానము.

హంసరాజు:—ఆ పరమేశ్వరుఁడువినా మరియెవరికిని జన్మజన్మాంతర విషయములు దెలియవు. నేనిట్లు చెప్పుచున్నాను నమ్మెదరా? మీరు పూర్వజన్మమందొక చాకలివానియింటిలో కుక్కగా జన్మించియుంటిరి. ఒకనాడొక బ్రాహ్మణుఁడు చలువగుడ్డలకొరకు చాకలియింటికి వెళ్ళగా మీరు నాబ్రాహ్మణుని కాలుఁగరచితిరి. ఇప్పుడాబ్రాహ్మణుఁడు కుక్కజన్మమెత్తి మీకాలినిఁగరచియున్నవాఁడు. దీనిని నమ్ముదురుగదా? ఆలాగుననే ఈజీవుడు పూర్వజన్మంబున బహుమిత్రద్రోహియు, నీచకులజుడునునై జన్మాంతర పాపవశంబుచే సోదరకళత్రసుఖములేక దుఃఖితుఁడునై గంగాస్నానఫలంబున నుత్త

ము జన్మంబున జనించెనను నిత్యాదిగా జెప్పినయెడల నె
ట్లునమ్మవలయును ? నేజెప్పినదానికిఁ గాని దీనికిఁ గాని
ప్రత్యక్షప్రమాణంబేమున్నది ? ఒకఁడు కుపథ్యముఁ జే
యుచు కుకర్మపరుండై యున్నదిజూచి, నీకుతప్పక వ్యాధి
గలుగుననియును, వృథావ్యయముచేయుచు సోమరియై
యున్నఁజూచి, నీకు కొంతకాలములో దరిద్రము సంభ
వించునని చెప్పినచో నాలాగు సంభవించుట
కేమి యాశ్చర్యము ? అట్లు చెప్పి, నీ గ్రహచా
రము తొలగించెదనని జ్యోతిష్యుఁడు గ్రహమూర్తియై
పూజాపాఠములు జరిపి, యున్న దానిని సున్న జేసి, ఫల
శాస్త్రము నిజమనుటకు వానిని దరిద్రునిఁ జేయుటలో విం
తయేమి ? తుదకు దరిద్రము ప్రాప్తించినదేయని వాఁడు
దుఃఖింపగా—దాని కేమి ? నీ ప్రాణమునకు భయముఁదొ
లగిపోయినది. లేకున్న మహాహాని సంభవించునని వాని
నూరార్చవచ్చును. నీ చిన్నతనమందు నీటిగండము
తప్పినదనియును, నొక పశువు నిన్ను పొడిచినది ; దాని
కొమ్ముపై క్రూరగ్రహముండినది గాని నీయొక్క శుభగ్ర
హముచేత రక్షింపఁబడితివనియు, నుదుపుల గౌరవమును
బట్టి నీకుద్యోగమందభిలాష గలదనియు, నీకీచేతవచ్చినది
యీచేత ఖర్చుయగుచున్నదనియు, నీమనసు చంచలమై

నదనియు నిత్యాదిగా జెప్పుటకు ఫలశాస్త్రముతో పని లేదు. గనుక నూహించుటయే– సత్యశాస్త్రమనుకొ నవచ్చును. గుప్తక్రియలవలన ననేకరహస్యములు తెలి యుట నాకనుభవము. నేనొకతూరి యొకరిపై వ్యాజ్య ము వేయగానిది తెలిసి యొక జ్యోతిష్యుడు గంభీరముగ వెళ్ళి నా ప్రతివాదితో "నీపైయొకరు పదివేలరూపాయల వ్యాజ్యము తెచ్చినారు. అతని గ్రహము నీగ్రహమున కంటె ప్రబలమయినది ; అయినను భయమక్కరలేదు ; నేను తద్దోషనివారణార్థము హోమముచేసి నీకొక యం త్రమును వ్రాసి యిచ్చెదనని" చెప్పి, వారము రోజులుండి నూరారు సంగ్రహించి వానికొకయంత్రమువ్రాసి యిచ్చి వచ్చెను. వ్యాజ్యము నాపక్షమయినది ; నేనోడియుం డినచో జ్యోతిష్యుడు వెళ్ళి, చూడుము ! శాస్త్రము దర్పణముగానున్నది ; యనియును, వాడే యోడినను " నేను మొదటనే నీగ్రహము బలహీనమని చెప్పియుండ లేదా ?," యనియును, రెండువిధములచేతను శాస్త్ర మును నిజమనిపించవచ్చునుగదా? దీనిలో సత్యమేమియు లేదు. ఇది నితాంతముభ్రమముగా నున్నది.

మరియొకతూరి, యొకజ్యోష్యుడువచ్చి గుప్తదూ తలవలన గ్రామములోని సమాచారములు తెలియుచు,

ఋత్విజులకుఁజెప్పుచుండి, మాగ్రామములో ప్రతిష్ఠిత పురుషునియొక్క పుత్రుఁడు, యీమాప్రాంతముఁ జన్మనని చెప్పి, తన దూతవలన నాబాలునకు విషమును బెట్టించి, ఘాత చేయించెను. ఈ ప్రసిద్ధివలన గ్రామములో ద్రవ్యమును నానావిధముల లూటీజేయుచు త్రికాలజ్ఞానియని పిలువబడుచు, వెళ్ళిపోయెను. ఈపరిహాస్యపంతియు నాతని గుప్తచారులలో నొకఁడు ఫలశాస్త్రిజ్ఞానము జేత నే చెప్పి, వాఁడును ద్రవ్యమును సంపాదించినాఁడు. ఇది సత్యజ్ఞానమని వివేకులు జెప్పఁజాలరు.

శంక.

నరహరిశర్మ:— గ్రహముల బద్ధములా? అవి ప్రత్యక్షముగ నుండలేదా? వానిగతులు సత్యముకాదా?

సమాధానము.

గురుమూర్తి:— గ్రహములును వాని గతులు నిజమే; గాని వాని సంబంధము ఫలశాస్త్రిప్రకారముగ నుండలేదు. ఇదెంతటి యాశ్చర్యము? కోట్లకొలది నక్షత్రములలో నీ నవగ్రహములు మాత్రము మనుష్యులకు సంబంధము గలిగియున్నవిగదా? మృగాదులకేమియు సంబంధము లేకుండుటకు గారణ మేమి? అందులో

హిందువులకు మాత్రము సంబంధమా? రైలుప్రయాణము చేయువారికీ గ్రహములు సంబంధము లేదెందుకు? ఈ శంక వ్యర్థమయినది.

శంక.

నరహరి:— మృగములు దేహధారులైనను వానికి నామావళిలేదు; గ్రహములు మానవుల దేహములకుగాక, పేరులకు సంబంధము గలిగి యుండును. మహమ్మదీయ క్రయిస్తవాదులు మ్లేచ్ఛులుగనుక, వారిపై గ్రహములు క్రూరములైయుండవు.

సమాధానము.

గురుమూర్తి:— పశ్వాదులకు సయితము పేరులున్నవి. గౌరీ_ గంగా_ కపిలా మొదలగు నామము లుంచబడి యుండును. మ్లేచ్ఛాదులకు క్రూరములుగాకుండ తదితరులకు క్రూరములనుట న్యాయముకాదు. గ్రహములు శిష్టులను శిక్షించుచు దుష్టులను రక్షించు నన్నట్లు కేవల మసంగతముగాన నీశంక సరికాదు.

శంక.

రామచంద్రప్ప:— పేరు, రాశి ననుసరించి యుండును; దాని కనుకూలముగ గ్రహములు సుఖదుఃఖముల నొసఁగుచుండును

సమాధానము.

కాళిదాసు:— ఒక్కటే పేరుగలవారు లక్షలుగా నున్నారు. వారిలో ననేకులు సుఖముగనున్నారు. అనేకులు దుఃఖమనుభవించుచున్నారు. పేరు తల్లిదం డ్రులు కల్పించియుంచిన చిహ్నముగా నున్నది. అట్టి పేరు సుఖదుఃఖ హేతువని మీరు చెప్పితిరి. గోవిందుడు రోగా దులచే బాధపడుచుండగా- మరియు రాముడు సుఖవం తుడైయుండగా జూచి, గోవిందుని తండ్రి యా పేరును తీసివేసి రామా- యను పేరుఁ బెట్టవలయును. ఏ పేరు బెట్టినను, కల్పితముగానే యుండును. జీవుని కర్మానుసార ము ఫలముగలుగునను టసిద్ధాంతముగాకపోయెనుగదా?

శంక.

రామచంద్ర:— అట్లుకాదు ; వానివాని విధి యనునది జన్మరాశిని ననుసరించి యుండును. ఒకటే రాశియందనేకులు జన్మించినను, తప్పక యంతరమేర్పడు చుండుట యీశ్వరనియమము. నూరు తమలపాకులు జోడించి, వానిపై నొక్క సూదితో బొడిచితి మేని, నూ రాకుల నొక్కసారి బొడిచినట్లు చెప్పినను, సూక్ష్మముగ విచారించినయెడల, మొదటిపత్రము రంధ్రమయినతరు

వాత రెండవపత్రమునందు రంధ్రమేర్పడినదని తెలియఁ చున్నదిగదా ? ఈఁగాగున అంతరమున్నది. దీనినిబట్టి ఫలము భిన్నించునని యేల యూహించరాదు ?

సమాధానము.

చంద్రగుప్త:— జ్యోతిశ్శాస్త్రినామధారక ఫలిత గ్రంథములందు రెండున్నరగడియలకొక ముహూర్తమని చెప్పియుండడమేమి ? ఇప్పుడీ యుక్తిని తద్విరుద్ధముగఁ జెప్పుటలేమి ? జగన్నాథదాసుగారు పన్యసించినట్లుగ, సంవత్సర- మాస- తిథి- వార- దివా - రాత్ర్యాది ఫలములగతి యేమి ? ఇది స్వోక్తివ్యాఘాతము. అయినను చూతము ! వాదసౌకర్యముకొరక కంగీకరింతము ; ఒకే సమయమందు, రెండుకార్యములు జరుగుట యసంభవ మని యనుట సరికాదు. చూడుడు ! కనురెప్పలురెండు నొక్కసారిగ గప్పుకొనుచు తెఱవంబడుచున్నవి. భజన గానాదులు జరుగునప్పుడు మృదంగము, తాళము, మోర్చింగు, వీణాదులు, యంతరమింతయేనియులేక వాయింపఁబడుచున్నవి. వర్షపుచినుకులు లెక్కలేనన్ని యొక్కసారిగా భూమిపై బడుచున్నవి. గావున దృష్టాంతము ఖండితమైనది. ఒకేసమయమందు జన్మించుటయు, మృతి నొందుటయు సంభవించుచున్నది. ప్రపంచములో ప్రతి

మానవునియొక్కయు జీవిత ఫలములు భిన్నభిన్నములై యున్నవి. పశ్వాదులకు ఫలములున్నవని కొందరు చెప్పుచు, శిలావిగ్రహములు, గ్రామములు, వృక్షములు మొదలగువానికి ఫలములు జెప్పుచున్నవారు. కొందరు వానికి ఫలములేదందురు. పేరునుబట్టి ఫలములున్నవందురు. పేరులేని పదార్థము ప్రపంచమున లేదు. జడములకు సుఖదుఃఖముల యనుభవ మెట్లుండునన్నప్పుడు, వానికి ఫలములేదందురు. ఇది యుక్తముగాదు.

శంక.

మహాబుద్ధిశాలులగు నైరోపావారు సయితము ఫలశాస్త్రమును నమ్ముటకు కారణమేమి?

సమాధానము.

ఐరోపు ఖండమువారందరు ఫలశాస్త్రమును నమ్మరు. వారిలోను ప్రొఫెసర్- ర్యాణ్‌డోలఫ్ (Rnadalph) వంటి స్వార్థులవ్వటివారిని కొందరిని భ్రమింపఁ జేయవచ్చును. ఇట్టి స్వార్థసంఘములును లండనులో గలవు. "దీ నేషనల్ ఇన్‌స్టిట్యూట్- ఆఫ్- సైన్సెస్" (Thə National Institute of seicnces) మొదలగు సంఘములు జనులను వంచించుచున్నయవి. ఒక నమ్మకమును

సత్యమని చెప్పకూడదు. క్రైస్తవ మతమందెన్నియో-మిథ్యలున్నవి. (భారతసూర్యోదయమును జూడుడు) ఎన్నియో-దురాచారములున్నవి. అట్టి యసంభవాంశములను నమ్ముచుండలేదా? ఫలశాస్త్రమును నమ్ము వారు బుద్ధిశాలులుగానేరరు. అస్తుతలంచుట సర్వథా యనుచితము ఐరోపావారు నమ్మినదంతయు సత్యమై నమ్మకపోయినదంతయు నసత్యమై యుండునని చెప్పుట యసంగతము గావున నీశంక నితాంతముగ యోగ్యము కాదు. ఫలశాస్త్రమును నమ్మని యూరోపువారందరు బుద్ధిహీనులగుదురా? ఏది గాని పరీక్షాపంచకముచేత సిద్ధాంతముగావలయును. ఈవిషయమును "సత్యాసత్య వివేకము" నందు జూచుకొనవలయును

శంక.

శ్రీకంఠశాస్త్రి:— జన్మపత్రములు వ్రాయుటవ్యర్థ మేనా?.

సమాధానము.

వేదభూషణరావు:— జాతకపత్రము వ్రాయఁగూడదని యెవరును చెప్పలేదు. అవి వ్రాయవలసిన దేగాని వానిలో నీసంవత్సరము నీమాసమున-నీతిథియందీవారము

పగలు అథవా రాత్రి- యిన్ని గడియలు, లేక గంట లప్పుడు, నీ పేరులుగల మాతాపితరులకు, నీ గ్రామము నందు బాలుడు అథవా బాలిక జన్మించినదను సంశ ములను, విశదముగ వ్రాయవలయును. ఎందుకనగా నీ పత్రము ముఖ్యముగ వయస్సును తెలియవలసివచ్చిన ప్పుడావశ్యకమగుచున్నది. అంతీయగాని, మాతాపితరు లకు శోకము గలిగించు విషయములే ఫలశాస్త్రమురీతిగ నేమియు వ్రాయఁబడఁగూడదు. అట్లు వ్రాయుంచు వారు, ధూర్తులు స్వార్థులునగు ఫలశాస్త్రజ్ఞుల కపట ధూళిని కన్నులలో జల్లించుకొని దుఃఖింతురు. ఈపాతక జ్యోతిష్కుల మూలముననే (పూర్వమార్యులపైదస్యు లుదాడి వెడలివచ్చినప్పుడు, యుద్ధమునకు వెళ్ళినప్పుడీ లగ్నము జయప్రదముగాదనియు మరియొక మంచిలగ్న ము చూచెదమనియు సమయమును చెడగొట్టినందున) భారతేయులు బల-పరాక్రమయుతులై యుండియు, స్వారా జ్యములను గోలుపోయిరి.

శంక.

రాఘవయ్య:— విధవా యోగమయినను చూడ వలయునా- కూడదా ?

## సమాధానము.

పరమానందులు — మీ ఫలశాస్త్ర ప్రకారము విధవాయోగముగల కన్యకలకు, పరిపూర్ణాయువు గల పురుషులను జేర్చి, వివాహము చేయుగా, ఫలితమేమగునో దెల్పగలరా ? కన్య విధవయగుచున్న పురుషుని గ్రహబల మబద్ధమయ్యెను. విధవగాకున్న-కన్యకయొక్క బాల్య వైధవ్యయోగ మసత్యమయ్యెను. ఇందువలన సారాంశ మేమన- విధవాయోగ మసంభవమయ్యెను. శాస్త్రి మసంగతమాయెను. కొందరీ విధవాయోగముగల కన్య కలను మొదట వృక్షాదులకుఁ జేసి పిమ్మట మనుష్యులకు జేయుదురు. అయ్యో ! వీరింత శ్రమఁబడియు విధవలు హెచ్చగుచుండుటకు కారణమేమి ? ప్రథమభర్తయగు వృక్షముండగా ద్వితీయభర్తకు వివాహముచేయుట న్యా యమా ? కొందరావృక్షమును నరికించివేసి వైధవ్య యోగము తీరినదని భావించెదరు అప్పుడు విధవా వివాహమయ్యెను. చెట్లకు మానవస్త్రీలకు పెండ్లి-శి లావిగ్రహములతో గర్భాధానము! నవ్వకండి! నవ్వకండి!! వీరియోగములలో బాలవిధవలున్నట్లే- గర్భపాతములు, భ్రూణహత్యలు, పతితపురుషుల వెంటబడి పోవుట మొద

ళ్ళగు యోగములేల లేవు ? ప్రౌఢవివాహములు విధిగా నాచరించినచో బాల్యవిధవా యోగము నశించును గనుక నీవాదము నిలువనేరదు. ఫలశాస్త్రము చేతినే విధవా యోగము ఖండింపఁబడినది.

శంక.

సీతాపతిరావు:— మహాశయులారా ! సకలపురుషార్థసాధన క్రియానుష్ఠాన శ్రీకరంబగు నీ భూలోకంబున సకలవందారుజన బృందామందానంద సంధాయియగు నరవింద బాంధవుఁడుదయించి యస్తమించుటచే, సువృష్టియు, దర్శనపుష్టియు గలిగి, దుష్టవాయువినష్టంబునుఁ బ్రాప్తించుచు, విశిష్టజీవ వర్గంబున కనర్ఘంబగు జీవనమార్గంబు వలబ్ధంబయ్యెడిని. సర్వగ్రహాగ్రేసరుండగు నాభాస్కరుని తేజస్కరంబగు కిరణంబుల ప్రాభవంబెంతయు పరిశుద్ధమగు నీపవనంబునకు సంబంధంబైయున్నయది. ఎల్లవేళల నెల్లెడల చల్లగవీచుచు నెల్లసిరులకుఁబుట్టినిల్లై వెలయు నీవాయువు సర్వప్రాణధారులకును బ్రాణాధారంబై యనారతంబును చ్ఛ్వాస నిశ్వాసగతంబై తిరుగుచుండును. ఈ సదాగతి లేకున్న బుతుభేదంబులు నున్న. ఈ శ్వాసరూపంబగు వాయువే

మూఁడును, జంతుసంతానంబుల ప్రారబ్ధంబునుఁ బ్రతిసమ యంబును సూచించునని వేఱుగఁజెప్పనేల? ఇఁకవిస్తారంబు తోడంబనిలేదు. నిక్కంబుగ నొక్కటి వక్కాణించెద. నే కాలంబుననో- యీ- స్వరోదయంబు సూర్యోదయం బని పూర్వమార్యులు సువిచార్యంబుగ సిద్ధాంతముజేసిన వారు. ప్రాథమికమహాత్ములీ పవిత్రమగు స్వరవిద్యను గుప్తముగ నాప్తులగు విద్యార్థులకుపదేశించుచుండువారు. ఈశ్వాసమును నాసికాగ్రమున స్పర్శించి, భావీవిచార విశేషంబులనెల్ల నిర్దోషంబుగ నెరుంగవచ్చు. నావా క్కులు నిక్కంబులని పరిక్షింపవచ్చు. ఈ-స్వరోదయ విధానంబుం జూచునప్పుడు శిరోబాధయు, శ్వాసాశయ వేధయు, నాసికాద్వార నిరోధములుండరాదు. ఇది ఫలి తజ్యోతిషపథంబువలె ధనాకర్షణ ప్రధానంబుగాక,సాధు విధానంబైవెలయు. ఇందాకాశాగ్ని వాయుపృథ్వీజల తత్వంబులఁదెలిసి, చిత్తంబునఁగల ప్రశ్నలకుత్తరంబు లుం జెప్పనగు. ఇది పాశ్చమాత్యుల చేతనుంగూడ పరమప్రమాణంబుగ స్వీకరింపఁబడినది. పూర్వమొక ప్పుడప్పరమబొప్పిని, తిప్పమాంబచెప్పినట్టుల, నిప్పుడానిబె నంటుయోగిని, యీయోగంబుచేగాభోలు! కనురెప్ప లనప్పళించి, నైదునిమిషంబులలో తప్పులేకుండ లండను

న్నందుఁగల విండసర్ కోటలోని యంతఃపురవార్తలను, మరియు నొకస్త్రీ ప్రసవించుటయు, నైదవజార్జి చక్రవర్తులకు భవిష్యమును అలహాబాదునందు చెప్పెనని, మొళకాల్మూరు—తత్వజ్ఞానమందిరం—. సెక్రెటెరిగారగు-యం. రంగప్పగారు, ఆర్య-నారాయణమూర్తిగారి మద్యమాంసనిషేధమును కన్నడమున భాషాంతరీకరణము జేయుటలో (35-36 పేజీలలో) జెప్పియున్నవారు గాన నీ భవిష్యజ్ఞానమునుగూర్చి సవిస్తరముగ నిపుడు చెప్పగలరు ?

•

సమాధానము.

అనుభవచూడామణిః— స్వరశాస్త్రమునందును చమత్కారముగలదదేమన, భవిష్యము తప్పినప్పుడు చూచువారికి శిరోరోగాదులుండుటవలన, స్వరముయొక్క తత్వము సరిగా దొరకలేదనుట యొకటి. రెండవది తత్వము దొరకుట యసంభవము. ఎట్లనగాః—ఆకాశాగ్ని వాయు పృధ్వీజల తత్వములకు క్రమముగా 1, 4, 8, 12, 16, అంతరములు గలవు, నేను దీనిని యభ్యసించికను గొనియున్నాడను. తప్పినందుకు తత్వము సరిగా కనిపెట్టబడలేదనుట మంచి కల్పితమైయున్నది. అని బెసంటుగారి భవిష్యమునకు జార్జిచక్రవర్తిగారి యోగ్య

తాపత్రముండవలయును. అదిలేదు. ఇది యామె శిష్యు లయొక్క కల్పితముగానోపు ఈలాగుననే మదరాసు గవర్నరు ఆర్థర్ లాలిగారి కొకరు జాతకమును సరిగా వ్రాసి యిచ్చినందున నూరుయెకరముల భూమి బహుమతిగా నివ్వబడినదనువార్త అబద్ధమాయెను. (1910సం॥ 3 సంపుటము ఆంధ్రపత్రిక బొంబాయి) మంచిది! యే లాభమునులేని యీ ప్రసవభవిష్యమును జెప్పిన యానిబెసంటుగారు, మనఘనతజెందిన వైస్‌రాయిగారగు లార్డు హార్డింజ్‌గారిపై యొక రాక్షసుడు (23-12-1912) బాంబును ప్రయోగించునని, భవిష్యమేల చెప్పజాలక పోయెను? థియసాఫికల్ సొసైటీ సభ్యులకిట్టి భవిష్య జ్ఞానముండియు, రాజద్రోహుల-కుకర్తలను గుప్తముగ నుంచిరి; గనుక, వారుతప్పక రాజద్రోహులని సిద్ధాంత మయ్యెను. "మేము రాజద్రోహులుకాద" నెదరా, వారు భవిష్యమును జెప్పినది సర్వథా కల్లయు, కల్పిత మునయ్యెను. ఉన్నచోటనేయుండి నానా దేశములు మరియు నానా లోకముల సమాచారములన్నియు స్పష్ట ముగ చెప్పెడు లెడ్బీటరుగారికిని, మైత్రేయమహాముని యవతారమగు కృష్ణమూర్తియను బాలునికిని, జరిగిన సంబంధము, వర్తమానపత్రికలన్నియు ప్రకటనచేసినవి.

హస్తప్రయోగాది (ముష్టిమైథునము మున్నగు) అభ్యాసములు గలవాఁడు, బ్రహ్మచారి యని లెడ్బీటరుగారి సిద్ధాంతము. (1913 ఏప్రిల్ 16 ఆంధ్రపత్రిక బొంబాయి) ఇట్టి యశ్లీలమాచరణలుగల తిక్కతలపిట్టలు "పరిణామత్రియ సంయమాదతీతానాగతజ్ఞానం" బను యోగసూత్రముచొప్పున చిత్తమును వశపరచుకొని, ధారణ ధ్యాన సమాధిత్రయసంయమ బలముచేత, భూతభవిష్యజ్ఞానమును లభింపఁ జేసికొనియుండు యోగీశ్వరులని, గ్రంథములలో వ్రాసినంతమాత్రమున, సిద్ధాంతమగునా? నమ్మఁగూడునా ? అంతయు కపటము ; సర్వముమిథ్య ; సమస్తము కల్పన ; సకలము వంచన యని దృఢమయినది ఈలాగుననే కొందరు మేము యోగులు, సిద్ధులు, మాకు యోగవిభూతి గలదని చెప్పకొనుచు కన్నులు ముకుళించి జంభమునఁ గూర్చుండుటయు, 'గోతులలోను గొయ్యలలోనుఁ గూర్చుండుటయు, పామరులకు యుక్తిగ భవిష్యములు జెప్పటయుఁజూచినారము. గాని వారికి తమ భవిష్యమే- తమకుఁ దెలియకుండుట పరిక్షింపఁబడినది. మరియు వారియందు యోగదర్శన లక్షణము లొక్కటియైనను గానరావు. "యోగశ్చిత్తవృత్తినిరోధః" అను సూత్రమునకుఁ బ్రత్యక్షవిరోధ ప్రవర్తనగలిగి

యుందురు. నిజమైన యోగులను గురించి మానమ్మిక మిదివరకే చెప్పియున్నారము. ఇంతకును, ఫలితజ్యోతిషచర్చలో యోగవిభూతిప్రసంగము ప్రకరణవిరుద్ధము. ఫలశాస్త్రవిషయమయిన శంకలనుమాత్రము జేయుడు. ఆహా ! నాస్తికులు, జగద్వంచకులు నగువారు, జ్ఞానులని భ్రమించిన మన పిచ్చిపుల్లయ్యల నేమనవలయును ?

శంక.

వసంతాచారి:—వృథా వాదమెందుకు ? ఇదంతయు మాకును దెలియును. అయితే యిది కలికాలము గనుక నిప్పుడెవరును ధర్మభిక్షము చేయరు. అంతయు దగిడీభిక్షమునాశ్రయించి యున్నది. మేమున్ను యిష్టో వాశిష్టోవా యన్నట్లు గ్రహాభయాపులను జూపి దానధర్మ పరోపకారములు చేయించుచున్నారము. ఈపుణ్యాముచేతనైన, వారు ధన్యులగుదురు కదా ?

సమాధానము.

సభాపతి:—ఇట్టి మోసముచేత ద్రవ్యముపుచ్చుకొనుటయు వెచ్చము చేయించుటయు దానమెప్పటికిని కానేరదు. ఇట్లుచేసినవారు భయులును నరకగాములగుదురు. దానమనునది, సుపాత్ర- కుపాత్రములెఱింగి

షేయవలయును. దానము- విద్వాంసులకును, దేశోప కారులకును, ధర్మసుధారకులకును, సత్యోపదేశకులకును, సత్యాచారులకును, బ్రాహ్మణగుణయుక్తులకును, దేశోన్నతికార్యములకును, చేయవలయునని వేదాది సత్యశాస్త్రములు చెప్పుచున్నవి. అన్యథా వ్యయముచేసినది, దానమనిపించుకొనదు; దాన ఫలశాస్త్రనెపమున మీరు చేయునదంతయును, దేశద్రోహముగాని మరివేరు కాదు. ఇది పాతకములలో నెల్ల గొప్ప పాతకకార్యమై యున్నది.

హా! ఘనిష్ఠ జ్యోతిష పిశాచినీ! మారీ! ఓ రాక్షసీ! నీవు నానారూపములచేత భారతవాసులను భ్రమింపజేసి, మావారిని, నికృష్టమగు దానాన్నపరిపోషితులఁ జేసితివి! ఆర్యసంతానమును నీ మోహమంత్రముజేత, పురుషార్థవిహీనులజేసి, దుర్దానములను లజ్జలేకుండ స్వీకరింపజేసితివిగదా? ఆహా! పరధనహరణమును దానమని ప్రబోధించితివా? నీ గొంతుగోయా! కపోలకల్పిత కల్పవృక్షమును జూపి, మావారిని స్వార్థులుగను, నితాంత నిర్బుద్ధులుగను, మూర్ఖులుగను, మనోమాలిన్యులుగను, దురాచారులుగను, కపటాచార్యులుగను, దుర్దానధారులుగను, పరధనహారులుగను,

పాపాత్ములుగను, జేసి విడిచితివిగదా? నీకింకను తృప్తిలేదా?

సభికులారా! అంకెలులేని సున్న లెన్నివేసినను ప్రయోజనములేనట్లు నీయుక్తి ప్రమాణ రహితములైన శంకలవలన నిసుమంతైనను ఫలములేదు. ఇంతదూరము సకాట్యప్రమాణములతోడ నిరాఘాటముగ నుపన్యసించిన యంశముల నాలోచింపక, శుష్కవాదమును కుతర్కమును జేయుటచే లాభములేదు. గావున సభికులు కాలయాపనము జేయక, నే జెప్పెడు నాల్గుమాటలను ప్రీతితో నాలకింతురని ప్రార్థించువాడను (అని సభాపతి తన కడపటి వ్యాఖ్యానమును ప్రారంభించెను)

సభాపతి వ్యాఖ్యానము.

పిత్రుమహాజనులారా! మనలో మహాశయులనేకులు, ఫలితజ్యోతిషము గణితజ్యోతిషమునకు భిన్నమైనదనియు, ఫలశాస్త్రము సనాతనముగాదనియు, నది యవనులనుండి హిందువులలో వ్యాపించెననియు, దీనివలన వైదిక వివాహము మొదలగు కర్మలెన్నియో చెడిపోయినవనియు, పురుషార్థము క్షీణించినదనియు, ఫలమెట్లు గావలసిన నట్లు సరిపోవు చమత్కారము గలదనియు, నది పరస్పర విరోధమనియు, పూర్వాపర విరోధములై

ఁ౦గి యు తిక్కఫుల్లయ్యలు నమ్ముచున్నారనియు, ఫలితము కేవలమసంభవములతో గూడియున్నదనియును, స్వార్థులు దీనిని తమ జీవనోపాయముగ స్వీకరించినారనియును, భవిష్యజ్జ్ఞానమునకు, యోగాదినైమిత్తికజ్ఞానము సాధనముగా నుండునుగాని ఫలశాస్త్రముగాదనియు, నిది ఘోరవిపత్తులకును క్రూరకర్మములకును మూలమనియు, దీనివలన దేశము పెక్కురీతుల నధోగతిపాలైనదనియు, స్త్రీలకుడకిది యురిత్రాడుగా నున్నదనియు, భారతీయుల నిది భ్రమింపజేసినదనియు, నిది శుద్ధనాస్తికమనియు, దీనిలో నింక ననేకములగు నవీనపద్ధతులను దూర్చి ధూర్తులు వంచించుచున్నారనియు, ప్రసంగములు జేసిరి. దీనినెవరంగీకరించినను యంగీకరింపకున్నను, సత్యము సత్యమేయగును గాని, దానికి లోటెంతమాత్రమును లేదు. ఒక పల్లెవాడు కస్తూరిని పేడయని పారవేసినయెడల, నది కస్తూరిగాకుండునా ? దానిని స్వీకరించువారుండరా ? ఎన్ని విధములు పరిశీలించినను దానిలో సత్యములేదు. బొగ్గును పాలలో నెంతకడిగినను తెలుపురానియట్లు వంచనభూయిష్టమగు నీ ఫలితజ్యోతిషము సత్యసిద్ధాంతమెప్పటికిని గానేరదు. రాగులును ఆవాలును గలసినట్లుగ మిక్కిలి చమత్కారముగ కష్టసుఖములిం

దులో మిశ్రితముఁ జేయఁబడి భ్రమింప నవకాశము గలిగియున్నది.

ఇంకను నీ ఫలశాస్త్రమునకు దాహసంస్కారముఁ జేయకున్నవారున్నచో, వారు తప్పక మానవపశువులని నాయాశయము. అటువంటి వజ్రశుంఠలకు సత్యోపదేశము చేయుటయు, పశువులతొట్టికి మధురమైన మామిడిపండ్ల రసమును పిండుటయు, నొక్కటియే యగును. మూర్ఖుఁడు "ఇంతవరకు నేనెన్నియో తప్పితములుఁ జేసితిని; యిప్పుడుఁ దీనినొక్కదానినిఁ జేసిన దోషమేమి" యనుకొనును. తనతప్పులను తిద్దుకొనువాఁడే మానవులలో శ్రేష్ఠుఁడును జ్ఞానియు నగును. ఈ యుపన్యాసములలోని సారమెఱుంగనివారున్నచో, వారు వృక్షములుగా నుండవలయును. అడవులలో మనము వృక్షసమూహమునందు పన్యసింపలేదు. వృక్షములలో కొన్ని పుష్పించకనే ఫలించునవిగలవు. ఆ ప్రకారముగ చెప్పకనే యభిప్రాయమును గ్రహించు వివేకులుకలరు. చెప్పినను గ్రహింపనివారెట్లు మానవులగుదురు ?

అవివేకుల మాటకేమి గాని, వివేకముగలవారు తప్పుమార్గములలో నడువరాదు. నోతిలో చీమలెన్ని

పడిన నేమి ? ఏనుగు గోతిలోపడిన మిక్కిలి శ్రమయగును. అయిన నొక్క విశేషము గలదు. లోకములో జనులకు సత్యమనభిమతమై, యసత్యము హితముగా నుండును. పాలు యింటింటికిఁ దెచ్చియిచ్చినను వెలయగుటకష్టము. మద్యమున్నచోటనే సులభముగ వెలను సంపాదించును. పూవులతోఁ జేరిన దారమునకు సయితము సువాసనగల్గు లాగున, వివేకుల సాంగత్యముచేత- నవివేకులకు జ్ఞానముఁ గలుగవలసియున్నది గావున మన తీర్మానమును భూలోక నివాసులలోన, • వివేకలోకమునకుఁ బంపవలయును కొందరు మదాంధులున్న వో నిసుకలోగలిసిన చక్కెరను గ్రహింపజాలరు, యేనుగులవలె నుందురు; గాని భారతహితార్థము మనమునస్యము పాటుఁబడవలెను

భారతవాసులిప్పుడు బ్రిటిషుసామ్రాజ్యముయొక్క పాలన ఛత్రముక్రింద సుఖముగను స్వతంత్రముగ నున్నవారు. ఇంగ్లీషుపాలన మను మేఘము వర్షించుచుండ, శీతలజల బిందువులచేత హిందూ మహమ్మదీయులకుండిన పరస్పర ప్రాచీన ద్వేషాగ్ని యారిపోయినది ; గాని పూర్వపు యవన కృపాణధారవలన వైదిక ధర్మమునకొకింత భిన్నత్వము ప్రాప్తించి, దానియందనేక సాంప్రదాయ-మలినములంటుకొన్నయవి. వానిలో నొకటియగు

నీ యవనజ్యోతిషము, మనవారినెంతయో యంధకారము నం బడవేసినది. ఈ లోపమును లేశమును పాటింపకుండుట, దేశద్రోహమగుచున్నది. ఇట్లుండగా నీదేశారిష్టమగు దుష్ట ఫలశాస్త్రమును సంరక్షించుటకై దొంగలును, స్వార్థులు నగు కొందరు ప్రయత్నించుచున్నారు. వీరిని వెంబడించు, వెఱ్ఱితలకాయలు మరి కొన్ని గలవు. తలకొకమార్గము గలిగి పరులను ముఖస్తోత్రములతో నుబ్బించుచు నాస్తికబోధనలఁ జేయుచుండు వేరొక తెగవారును గలరు. అయినను యీగు ప్తనాస్తికులు మనసంఘముయొక్క సత్యప్రవర్తనమును మన యనుయాయికులయొక్క ప్రేరేపణ నెదురింపఁజాలరు. అట్లని మనము పేక్షింపరాదు సాంక్రామిక రోగముల తోడ జచ్చినవారి గుడ్డలనుధరించి వ్యాపారాదులు చేయు వారినిఁ గనుగొన్నప్పుడు ప్రభువులు దండించునట్లు దేశక్షేమమునకై యీయున్మత్తప్రలాపుల నోరు మూయించవలయును. వీరు మూర్ఖులలో వజ్రమూర్ఖులుగను, ద్వేషులలో కుటిలద్వేషులుగను, వంచకులలో మహావంచకులుగ నున్నవారు. పరులను మెప్పింపజాలకున్నను గాడిదె తనస్వరమునకుతానే సంతసించునట్లు తమతుమామంత్రముల చిటికెలకు తామే యానందపడుచున్నారు.

ఘునకీ కపటులను ప్రతిఘటింపక తప్పదు. ఈ దశ్యరా జ్యము క్షీణింపఁ బ్రారంభించినది. మంచిది—

తనకు మంచిదని నానావిధముల సిద్ధాంతమయిన దానిని యాచరణలోఁ బెట్టుటయే- పౌరుషము. తన తోఁటి మానవునకు శ్రేయస్కరమయినదానిని మొట్టమొదట చేసి, యాత్మకు సంతృప్తినొందఁ జేయవలయును. తన్ను వెంబడించువారు గలరా! యని యోచించి వెనుకకుఁ జూడరాదు. అట్టి ధైర్యధురీణులు లోకమునకు మార్గదర్శకులుగా నుందురు:

మహాజీవులారా! గ్రహములు ధూమకేతువులు మొదలైన ఖగోళములు భూలోకవాసులగు మానవుల సుఖదుఃఖముల కేమియు సంబంధము లేదని ఖండితముగఁ దెలియుచున్నది. దేశమందేదో యొకభాగమందుగాని అథవా కొన్ని కుటుంబములందుగాని, యొక్క కుటుంబమందుగాని, యొకరికి యేమైన కీడుఁగలిగినచో, నది గ్రహచారఫలమని- ధూమకేతుమహిమయని చెప్పుట మూర్ఖము గాదా? ఎందుకనగా నితర భాగములందును, యన్య కుటుంబములందును యనేకులకును అదేకాలమునందు క్షేమములు గలుగుచుండును. ఒకేసమయమందు సంభవించిన కీడులకుమాత్రము గ్రహాదులు కారణములై,

మేళ్ళకు కారణములు గావని జెప్పుట, న్యాయమెట్లగు
ను ? నిజమేలాగగును ? ప్రపంచమందుగల ప్రత్యేక జీవు
నియొక్క జీవనదశలు భిన్నభిన్నములై యుండును.
లోకములో, నిద్దరి మానవుల జీవన చరిత్రము లొక్కవి
ధమున నుండగాఁ జూపువాడు నభూతోనభవిష్యతి.
గనుక నెన్నిజీవకోటులుగలవో యన్ని గ్రహములు గావ
లసియుండును. మరియు నన్ని ముహూర్తములుండక
తప్పదయ్యెను. అది సంభవముగానేరదు.

కొందఱు మానముగఁ గూర్చుండి సాంకేతికముల
ద్వారా ప్రశ్నలకుత్తరములు జెప్పుట కలదు. ఉదా
హారణముగ నెవరైన ప్రశ్నయడుగుచు మాయింట నా
భార్యకు కాయిలా- నివారణమేలాగని దెల్పినయెడల
నొకరాతిని చేతికిచ్చును. చచ్చెనా- లోకులు తమకు
తామే "దాని రొమ్ముమీద రాయి" యని మహా
త్ములు రాతిని యిచ్చినారని తీర్మానించుకొందురు. బ్రతి
కెనా- "దానితలమీద రాయివేసిననూ చావులేదు"
అని మహాత్ములు రాతినిచ్చివేసెనని యనుకొందురు
ఇటువంటి యర్థాంతర సమర్థనముఁజేయు శిష్యులనేకులు
కాచుకొనియుందురు. వెట్టిచేష్టల ననేకము లీలాగున
సమయానుగుణ్యముగ నర్థముచేయుచు పిచ్చివారిని

మహాత్ములుగ భావించువార సంఖ్యాకులు గలరు. ఫల శాస్త్ర చమత్కారమంతయు నింతియె.

వేదశాస్త్రములందు పరోపకారులును, తపస్వులును, అధ్యయనశీలురును, నిర్వైరులును, నిర్దోషులును, నిరభిమానులును, జితేంద్రియులును, సత్యవ్రతులును, సత్యవాదులు నగు వారిని బ్రాహ్మణులని చెప్పఁబడియున్నది. ఫలశాస్త్రోపజీవులగు నిప్పటి బ్రాహ్మణనామధారులు అతి సంగ్రహులును, స్వార్థులును, విషయపరాయణులును, భోగులును, విలాసపరులును, కపటులును, వంచకులును, క్రూరులును, అజ్ఞానులై యున్నవారు ఇట్టి యసత్యవాదులు భూదేవతలని, యేగ్రంథమందైనను నితాంతముగఁ జెప్పఁబడియుండ లేదు సూర్యచంద్రాదులును యీశ్వరీయ దేవతలని వాసియొక్క పరోపకారతను బట్టి చెప్పఁబడుచున్నవి సూర్యాది గ్రహములు పరులెవరియందును పక్షపాతమునుజూపక నందరికిని సమానముగ నుపకారము చేయుచుండుటచేతనే వానికి దేవతలని పేరు. అట్టి యీశ్వరీయ దేవతలగు గ్రహములు మనుష్యులలో సుఖములు గలుగునట్లు ప్రవర్తించునేని, వానికి దేవశబ్దము వాడఁబడియుండదు. గాన నిది కల్పితమని స్పష్టమగుచున్నది. దీనిని యవలంబిం

చినవారును, దేవతలుగాని- భూదేవతలుగాని- బ్రాహ్మణులుగాని, నృదేవతులుగాని ఖండితముగ గానేరరు. సభ్యులకు ధన్యవాదములు సలిపి నేనాసనమును స్వీకరించుట కనుజ్ఞ వేడుచున్నాడను. (చప్పట్లు)

ఓమ్ విశ్వాని దేవసవితర్దురితానిపరాసువ ।
యద్భద్రంతన్న ఆసువ ॥

తే-గీ॥ పృథుభరద్వాజగోత్రపవిత్ర వేద ।
ధర్మబోధకగురుమూర్తివర్మపుత్రుం ।
డైన యార్యనారాయణాఖ్యరచిత ।
మైనఫలితచమత్కారమెల్ల ముగిసె ॥

ఓమ్ శాంతిః శాంతిః శాంతిః.



Printed by K. S. KRISHNA IYER, B. A.,
AT THE "IRISH PRESS" BANGALORE CITY.